# కథాగుచ్ఛము

మొదటి భాగము

## రవీంద్రనాథ ఠాకూర్



కారుమూరి వైకుంఠరావు
490 తిరువత్తూరు హైరోడ్
చెన్నపురి

మొదటి ముద్రణ 1000 కాపీలు 1929

రెండవ ముద్రణ 1000 కాపీలు 1950

వెల రెండు రూపాయలు

వావిళ్ల రామస్వామిశాస్త్రులు అండ్ సన్స్

292 ఎస్ప్లనేడ్

మద్రాసు—1



# విషయసూచిక

# రాసమణికొడుకు

కాళీపద, రాసమణికొడుకు. రాసమణి తల్లి అయినా తండ్రిగా ఉండవలసివచ్చింది. తల్లీతండ్రీకూడా తానే అయిఉంటే పిల్లవాడికి శ్రేయస్కరముకాదు గనుక రాసమణి తండ్రి చేయవలసినపని మాత్రమే చేయ నిశ్చయించుకొన్నది. భర్త, భవానీచరణ్, కొడుకును సరిఅయిన శిక్షణలో ఉంచ లేక పోయేవాడు.

కొడుకంటే భవానీచరణ్‌కు అంతముద్దు ఎందుచేతనో, అంత ముద్దుచేయడానికి అతనుచెప్పే కారణమేమిటో తెలుసు కోవలెనంటే వాళ్లపూర్వపుచరిత్ర కొంచెము తెలుసుకోవలెను. 'శానియాడి' గ్రామములో చాలాకాలమునుండి పేరుపడి వస్తూఉన్న ఒక గొప్పఇంట పుట్టినవాడు భవానీచరణ్. భవానీచరణుని తండ్రి అభయాచరణుని మొదటిభార్య కొడుకు శ్యామాచరణ్. వయస్సుమళ్లినతరువాత అభయా చరణుభార్య కాలముచేసింది. రెండోపెళ్లి కాకముందే కా బోయే మామగారు అల్లునిఎస్టేటులో ఒకతాలుకా తన కూతురుపేర వ్రాయించాడు. అల్లుడు వయస్సుముదిరినవాడు; కన్న[illegible]త్తు కూతురు విధవ కావలసివస్తే అన్నవస్త్రాలకు సవతి కొడుకు ఆధీనములో ఉండవలసివస్తుందేమో అని తండ్రి చేసిన ఏర్పాటు ఇది.

మామగారు అనుకొన్నదానిలో మొదటిభాగం అతి త్వరలోనే సంఘటిల్లింది—మనుమడు, భవానీచరణ్, పుట్టిన కొద్దిరోజులలోనే అల్లుడు కాలముచేశాడు. అల్లుడు తన కూతురుపేర వేరుచేసి వ్రాసినఆస్తిఅంతా ఆమెకు స్వాధీనము అయింది. ఇది తనకళ్లతో సాక్షాత్తు చూచి కొద్దికాలములో మామగారుకూడా నిశ్చింతగా పరలోకప్రాప్తుడయినాడు.

శ్యామాచరణ్ అప్పటికి పెద్దవాడయినాడు. అతనిపెద్ద కొడుకు అప్పటికిఅప్పుడే భవానీకంటె ఒకసంవత్సరము పెద్ద. శ్యామాచరణ్ భవానీని తనపిల్లలతోపాటు పెంచి పెద్దవాణ్ణి చేస్తున్నాడు, భవానీచరణ్ తల్లిడబ్బులోనుంచి ఎన్నడూ ఒక కానీఅయినా తీసేవాడుకాడు. ప్రతిసంవత్సరమూ లెఖ్ఖంతా వ్రాసి ఆమెకు చూపించి ఆమెసంతకముతో రసీదుపుచ్చుకొనే వాడు. ఇదంతా చూచి అందరూ ఆశ్చర్యపడేవారు.

అంత సాధుత్వమూ అంత అస్వార్థతా అనవసరము అని అందరూ అనేవారు. దీనికే చేతకానితనము అంటారు అని విన్నవాళ్లలో చాలామంది అనేవారు. భర్త తనఆస్తిలో కొంతభాగం వేరుచేసి దానిని పూర్తిగా రెండోభార్యచేతిలో పెట్టివేయడము ఆ ఊళ్లో ఎవరికీ ఇష్టములేదు. శ్యామాచరణ్ ఏదైనా ఎత్తువేసి తనసవతితల్లికి తండ్రివ్రాసిఇచ్చినపత్రము చెల్లకుండాచేస్తే ఇరుగుపొరుగువాళ్లందరూ అతని మగ తనాన్ని చూచి మెచ్చుకొనిఉందురు. అటువంటి ఉద్దేశమే

అతనికి ఉండేటప్పుడు దానిని చక్కగా సాధించే ఉపాయము చెప్పేవారుకూడా ఆ ఊళ్లో లేకపోలేదు. కాని శ్యామాచరణ్ తనకు నష్టముకలిగినా సవతితల్లికిమాత్రము ఎటువంటినష్టమూ కలుగకూడదని నిశ్చయించి ఆమెఆస్తిని వేరుగాఉంచి కాపాడుతూ వచ్చాడు.

ఈకారణముచేతనూ, తాను సహజముగా ప్రేమించే స్వభావముగలది అవుటచేతనూ వ్రజసుందరి, శ్యామా-చరణ్‌ను తనకొడుకుగా భావించేది, కొడుకునుప్రేమించినట్లుగానే ప్రేమించేది, కొడుకును నమ్మినట్టుగానే నమ్మేది. శ్యామా-చరణ్ ఆమెఆస్తిని వేరుగాఉంచినందుకు సవతితల్లి అతనిని నిష్ఠూరముగా మాటలుఅంటూఉండేది. "నేను ఈఆస్తిఅంతా పట్టుకొని స్వర్గానికి వెళిపోతానటోయి, బాబూ! చివరకు ఇదంతా మీకు రావలసినదే కదా, జమాఖర్చులన్నీ నాకెందుకూ చూపించడము!" అని అనేకసార్లు వ్రజసుందరి అన్నది. కాని శ్యామాచరణ్ వినిపించుకోలేదు.

శ్యామాచరణ్ తనపిల్లలను మహాకఠినమైనశిక్షణలో ఉంచేవాడు, గాని భవానీమీదమాత్రము ఎటువంటి అధికారమూ చూపించేవాడుకాడు. ఇది చూచి అందరూ శ్యామాచరణ్ భవానీని తనపిల్లలికంటె ఎక్కువముద్దుతో పెంచుతున్నాడని అనేవారు. ఆముద్దువల్ల భవానీకి చదువూ-సంధ్యా లేకుండాపోయింది, డబ్బుతో సంబంధించిన వ్యవహారాలలో చంటిపిల్లవాడికుండే జ్ఞానమైనా లేకుండాపోయింది.

అన్నగారిమీదే భారమంతా వేసి పెద్దవాడయిపోయినాడు. ఆస్తులవిషయాలలో అతనికి ఎటువంటి ఆలోచనా అవసరమం లేకపోయింది. అప్పుడప్పుడు సంతకముమాత్రము పెడుతూ ఉండేవాడు, దేనికని సంతకముపెట్టవలసివచ్చేదో అది తెలుసుకొందామనైనా ప్రయత్నము ఎన్నడూ చేయలేదు—ఎందుచేత చేయలేదు అంటే, ప్రయత్నముచేసినా అతనికి బోధపడదు కనుక.

ఇవతల శ్యామాచరణుని పెద్దకొడుకు, తారాపద, తండ్రితో కలిసి ప్రతివ్యవహారమూ చూస్తూఉండేవాడు; వ్యవహారజ్ఞానములో పండిపోయినాడు. శ్యామాచరణ్ కాలముచేసినతరువాత తారాపద భవానీని ఒకనాడు పిలిచి "బాబా, ఇక మనము కలిసిఉండడము మంచిది కాదు. ఏచిన్న కారణముచేతనైనా మనస్తాపాలు కలగవచ్చును. అప్పుడు పోట్లాడుకొని ఇల్లుపిరగకొట్టుకోవడము బాగుండదు," అని అన్నాడు.

వేరయి తనఆస్తి తానే చూచుకోవలసిన అవసరం రావచ్చును అని ఇంతకుముందు ఎన్నడూ కలలోనైనా అనుకోలేదు భవానీచరణ్. చిన్నప్పటినుండి ఇప్పటివరకు తాను ఎరిగి ఉన్న ప్రపంచము ఒక అఖండవస్తువని భవాని అనుకొనేవాడు, దానిలో ఏదో ఒకచోట అతుకు ఉన్నదనీ, ఆ అతుకు విడదీయవచ్చుననీ ఇప్పుడు హఠాత్తుగా వినగానే భవానీకి మతిపోయింది.

వంశ ప్రతిష్ఠకు భంగము కలుగుతుందని ఆలోచించి తారాపద సంకోచించలేదు, తోబుట్టువుని మనస్సుకు బాధ కలుగుతుందనీ సంకోచించలేదు. అది చూచి భవానీచరణ్ ఇక మరితప్పదు అనుకొని ఆస్తి ఏమో స్వరు వంతులు వేయరాదు అనే అసాధ్యచింతలో పడ్డాడు. పినతండ్రిగారి ఆందోళన చూచి తారాపద చాలా ఆశ్చర్యపడి, "ఏమిటి సంగతి బాబా, ఎందుకు అంత కంగారుపడుతున్నావు? ఆస్తి విభక్తం అయే ఉన్నవి. తాతయ్యగారు తానే స్వయముగా వంతులు వేసేసి ఉంచారే!" అని అన్నాడు.

"నిజముగా! నాకేమీ తెలియదే!" అని మరింత గడబిడపడుతూ అన్నాడు భవాని.

"పోనీ, నీ ఒక్కడికి తెలియకపోతే నేమి?" అని అన్నాడు తారాపద. "దేశము అంతా ఎరుగును, ముందుకు ఎప్పుడైనా మీకూమాకూ మనఃస్పర్థలు కలుగవచ్చునని ఆలోచించి ఆలందీగ్రామము మీవంతుకిచ్చి మిమ్మల్నీ మమ్మల్నీ మొదటినుంచీ తాతగారు వేరుగాఉంచారు. ఇప్పటివరకూ ఆ ప్రకారమే మనవ్యవహారాలు జరుగుతున్నవి."

ఆలాగే అయిఉంటుంది గాబోలు అనుకొన్నాడు భవానీ చరణ్; "అయితే ఈ ఇల్లో మరి?" అని అడిగాడు అంతా విని.

"కావాలంటే మీరు ఉంచుకోవచ్చును," అన్నాడు, తారాపద. "హెడ్ క్వార్టర్సులో ఉన్న మనఇల్లు మాకు ఇస్తే చాలును, ఏలాగో గడుపుకొంటాము."

వంశపారంపర్యముగా వస్తూఉన్న ఆఇల్లు వదలిపెట్టేయ-డానికి తారాపద ఒప్పుకోవడము చూచి ఎంతఔదార్యము అతనిది అని భవానీ ఆశ్చర్యపడ్డాడు. ఆ రెండో ఇల్లు భవానీ-చరణ్ ఎన్నడూ చూడనైనా చూడలేదు. ఆ ఇంటిమీదికి అతనిమనస్సు పోనేలేదు.

భవానీ వెళ్లి తల్లితో ఈకథఅంతా చెప్పాడు. అది విని తల్లి నెత్తికొట్టుకొని అన్నది—"ఓయి బాబు, అదేమిటి ఆమాట! ఆలందీగ్రామము నాఖర్చులకోసమని ప్రత్యేకించి స్త్రీధనముగా ఇచ్చారు, దానిరాబడికూడా అతిస్వల్పము. తండ్రిగారి ఆస్తిలో నీకురావలసినభాగము ఎందుకు ఇవ్వరు?"

"నాన్నగారు ఈగ్రామముతప్ప మరేదీ మనకు ఇవ్వనే-లేదట," అన్నాడు భవాని.

"అలాగంటే నేను ఎందుకు ఒప్పుకొంటాను?" అన్నది తల్లి. "మీనాన్నగారు స్వహస్తముతో వీలు వ్రాసి రెండు ప్రతులలో నాచేతికి ఒకటి ఇచ్చారు, అది నాసందుగుపెట్టెలో ఉన్నది."

పెట్టెతీశారు. అందులో ఆలందీగ్రామము కాగితాలు ఉన్నవి గాని, వీలు లేదు. వీలు ఎవరో దొంగలించారు.

సలహా ఇవ్వదగినవాడు ఆఊళ్లో ఒకడున్నాడు. అతనిని పిలిచారు. అతను వాళ్లగురువుగారికొడుకే, బగలాచరణ్ అతని పేరు, అన్నివిషయాలలోనూ ఆరితేరినవాడు అని అంతా అనే వారు. ఆత్మతోసంబంధించినవిషయాలలో తండ్రిమంత్రోపదేశమూ, తక్కినఅన్నివిషయాలలోనూ కొడుకుమంత్రోపదేశమూ—ఈవిధముగా ఆగ్రామములో ఇహపరాలు తండ్రి-కొడుకులు పంచుకొన్నారు. ఈఏర్పాటువల్ల ఇతరులకు ఎటువంటిలాభనష్టాలు కలిగినా, వాళ్లకుమాత్రము ఇబ్బంది కలగ లేదు.

"వీలు దొరకకపోతేపోనీ, తండ్రిఆస్తి రెండువంతులూ అయితీరాలి," బగలాచరణ్ అన్నాడు. ఆసమయములో రెండోపక్షమువాళ్లు వీలుఒకటి పైకి తీశారు. ఆవీలులో భవానీచరణ్ పేర ఏమీ వ్రాసిఉండలేదు, తండ్రి ఆస్తిఅంతా మనమల పేర వ్రాసేశాడు. అప్పటికి భవానీకి కొడుకు పుట్టలేదు.

భవానీ కోర్టులలోకి దిగాడు. ఆ మహాసముద్రములో అతని ఓడ గడిపేవాడు బగలాచరణ్. యాత్రఅంతా పూర్తిఅయి రేవుకు తిరిగివచ్చారు, ఇనపపెట్టె తెరిచి చూచేసరికి లక్ష్మి మాయమయిపోయింది, లక్ష్మీవాహనమైన గుడ్లగూబ కనబడ లేదు, గాని దానిరెక్కలనుండి రాలిన బంగారు వెంట్రుకలు మాత్రము రెండు కనబడ్డవి. తండ్రిఆస్తి రెండోపక్షము వాళ్లది అయిపోయింది. దావాలన్నీ కాగా తనకూతల్లికీ మిగి

లినవి ఆలందీగ్రామములో కొంతభాగము మాత్రమే. ఆ కాస్తా పట్టుకొని కాలక్షేపము ఎలాగో చేయవచ్చునేమో గాని వంశ మర్యాదలూ, ఇంటిమర్యాదలూ కాపాడుకొంటూ వ్యవహారాలు జరుపుతూఉండడము సాధ్యముకానిపని. పెద్దలుకట్టించిన ఇల్లు తనకురావడమువల్ల రెండోపక్షమువాళ్లను వీగకొట్టినట్టే భావించాడు భవాని. తారాపద, తనపరివారాన్ని తీసుకొని హెడ్ క్వార్టర్సులోని ఇంటికి వెళ్లిపోయినాడు.

శ్యామాచరణుని కృతఘ్నత వ్రజసుందరిని బల్లెముతో పొడిచినట్టు బాధించింది. శ్యామాచరణ్ వీలు దొంగలించి తమ్ముని మోసపుచ్చుతాడని గాని, తననునమ్మిన తండ్రికోరికను మంటకలిపేస్తాడని గాని, వ్రజసుందరి ఎన్నడూ అనుకోలేకపోయింది. "ధర్మదేవత ఇది ఎంతమాత్రము సహించి ఊరుకోదు," అని వ్రజసుందరి బ్రతికిఉన్నన్నాళ్లూ రోజూ పెద్దనిట్టూర్పువిడిచి భవానీతో అంటూఉండేది. "నాకు కోర్టులూ దావాలు ఏమీబోధపడవు గాని, నేను చెపుతున్నాను విను, ఈవీలుమాత్రము శాశ్వతకాలమూ దాంగొని ఉండిపోదు, నిశ్చయముగా అది ఎన్నడో తిరిగి నీకు దొరికి తీరుతుంది."

ఈమాటలు రోజూ తల్లినోట వింటూఉండడమువల్ల భవానీకి వాటిలో నమ్మకము కలిగింది, చేతకానివాడుఅవుట చేత ఆమాటలు అతనికిమనశ్శాంతినికలుగజేసేవి. పతివ్రతఅయిన

సతివాక్యము ఎన్నటికీ నిష్ఫలము కానేరదు. ఎవరి ఆస్తి వాళ్ళదగ్గరికి దానంతట అదే వస్తుంది, ఎటువంటి సందేహమూ లేదు అని సిద్ధాంతము చేసుకొని కూర్చున్నాడు. భవానీ తల్లి కాలము చేసినప్పటినుండీ ఆనమ్మకము మరింత బలపడ్డది— తల్లియొక్క పుణ్యతేజస్సు మృత్యువువల్ల కలిగే ఎడబాటు ద్వారా మరింత కాంతితో ప్రకాశించడము మొదలు పెట్టింది. దారిద్ర్యము భవానీని ముట్టలేకపోయింది. ఇప్పుడు తాను అన్నవస్త్రాదులకు పడుతూఉన్న బాధా, మర్యాదలు జరపడములో ఇప్పటికీ మునుపటికీ ఉన్న వ్యత్యాసమూ రెండురోజుల నాటకము అని భవానీ నమ్మకము—"వీటిలో నిజమేమీ లేదు." మునుపటి 'ఢాకా' పంచలు చిరిగిపోగానే కొత్తపంచలు కొనవలసివచ్చింది, చవుక ముతకపంచలు కొని తనలో తాను నవ్వుకొన్నాడు. దుర్గపూజ మునుపటి వైభవముతో జరగలేదు, తప్పనిలాంఛనాలుమాత్రము జరిపి వచ్చిన వాళ్ళకు నమస్కారము చేసి పంపడమయింది; ఇదిచూచి అందరూ విచారించారు, మునుపటి సంపదమాటలూ వైభవముమాటలూ ఎత్తారు, 'ఇప్పటిలేమి రెండురోజులలో పోయేది, ఆసంగతి వీళ్ళెవరికీ తెలియదు,' అనుకొంటూ భవాని తనలో తాను నవ్వుకొన్నాడు; "ముందుకు రాబోయే వైభవము చూసి అంతా ఆశ్చర్యపడుతారు, రెప్పపాటులేకుండా" అని భవానీనమ్మకము.

భవానీకళ్లకు పొటూత్తు ఇప్పుడు కనబడుతున్నది ఆభవిష్యత్తే, ప్రస్తుతపు దారిద్ర్యము అతనికంటికి అసలు కనబడితే కదూ!

ఈ విషయములలో భవానీకి సలహా ఇచ్చేవాడూ అతనితో వాదనచేసేవాడూ, 'నటు' అనిపేరుగల నౌకరు ఒక డుండేవాడు. ప్రతిసంవత్సరమూ పూజరోజులలో ఆ దారిద్ర్యావస్థలో ఉన్న ప్రభువూ భృత్యుడూ కలిసి ముందుకురాబోయే మంచిరోజులమాట అనుకొనేవారు. వచ్చేసంవతర్సము ఎంత వైభవముగా ఏమేమిటి చేయవలసిఉంటుందో ఆ విషయమై ఇద్దరూకలిసి చాలా ఉత్సాహముతో చర్చిస్తూఉండేవారు. ఎవరెవరిని పిలువవలెను, ఎవరిని పిలవకూడదు, భాగవతమేళము తెప్పించడము అవసరమా కాదా,—ఇటువంటి నానారకాల వాదనలలో గొప్ప మతభేదము ఉండేది వారిద్దరికీ. నటువిహారి సహజముగా లోభి, భవిష్యత్తున జరగబోయే ఉత్సవాల ఖర్చుల పట్టీలలో వాడు కనుపరిచే కృపణతను గురించి బాగా చీవాట్లు తింటూ ఉండేవాడు.

మొత్తముమీద భవానీకి డబ్బువిషయమై ఎటువంటి భయమూ ఉండేదికాదు, తన డబ్బంతా అనుభవించేవారు ఎవరూ లేరు కదా అనే అతనికిఉండే విచారమల్లా—ఇప్పటివరకు అతనికి పిల్లలు లేరు. కన్యకలుగలతండ్రులు భవానీహితమును కోరుతూ అతనిని తిరిగి పెళ్లిచేసుకోమని అనేకమంది సలహా ఇచ్చారు. భవానీమనస్సుకూడా కొంచెము చంచలమయింది;

గాని ఆ చంచలత నవమధువు అనగానే పుట్టే సరదావల్ల కాదు. ధాన్యమువిషయములోనూ నౌకర్లవిషయములోనూ 'పాత మంచి' అన్నట్టుగానే భార్యవిషయములో కూడా పాత మంచి అని భవానీ నమ్మకము. కాని గొప్పఐశ్వర్యము వచ్చి మీదపడబోతున్నప్పుడు సంతానము లేకుండా ఉండడము చాలా దుఃఖకరమైన సంగతి అని భవానీ అభిప్రాయము.

ఆసమయములో భవానీకి పుత్రసంతానం కలిగింది; ఆ ఇంటికి ఐశ్వర్యము తిరిగి పూర్తిగా వచ్చేస్తుందనీ, 'పునాదిలో మొదటిరాయి పడ్డదనీ అంతా అన్నారు. పరలోకములో ఉన్న అభయాచరణే తిరిగి ఈఇంట్లో పుట్టాడు. పిల్లవాడి కళ్లు అతని కళ్లే—పొడవుగా చెవ్వులను అంటుకొంటున్నవి. జాతకము వేసి చూచారు. గ్రహాలస్థానాలనుబట్టిచూచి పిల్లవాడిది తాత గారిజాతకమే, ఆఇంటికి పోయినలక్ష్మి తిరిగి రాకవీలులేదు అని అంతా అన్నారు.

కొడుకుపుట్టినప్పటినుండి భవానీలో ఒకమార్పు కన బడ్డది. ఇప్పటివరకు దారిద్ర్యాన్ని ఒకఆటవస్తువుగా భావించి అతిసరదాగా కాలక్షేపముచేస్తూ ఉండేవాడు, లేమివల్ల అత నికి ఎటువంటిబాధా కలుగలేదు. కాని ఇప్పుడు మునపటివలె దారిద్ర్యాన్ని తోసిపారేయడానికి వీలులేదు. ఇప్పుడు కొడుకు సంగతి ఆలోచించవలెను, తన సంగతికాదు. కానియాండిలో ఖ్యాతిచెందినది తమఇల్లు. ఆ ఇంట్లో ఆరిపోయినదీపాన్ని తిరిగి

వెలిగించడానికి ఆకాశముమీదనుండే తారాగ్రహాలసహాయమువల్ల ఈపృథ్వీమీద అవతరించాడు పిల్లవాడు. వానివిషయమై అతని కర్తవ్యము ఉన్నదికదా! వంశపారంపర్యముగా ఈ ఇంట్లో పిల్లలకు జరుగుతూఉన్న ముద్దూముచ్చటా ప్రాప్తిలేని వాళ్లలో తనజ్యేష్ఠపుత్రుడే మొదటివాడు అన్నమాట భవానీకి రాత్రిగాని పగలుగాని మరుపురాకుండా ఉన్నది. "ఈవంశములో అందరికీ చిన్నప్పుడు జరిగిన ముద్దూముచ్చటా నాకు చిన్నప్పుడు జరగింది, గాని నాకొడుకుకు అలాగు జరిగించలేక పోతున్నాను. దానికి కారణము నేనే," అని అనుకొంటూ భవానీ చాలా దుఃఖించేవాడు. కొడుకు కోసము డబ్బు ఖర్చుపెట్టలేకపోయినా తనకు చేతనైనంతవరకు ముద్దుముచ్చటలంగా పూర్తిచేస్తూ ఉండేవాడు భవాని.

భవానీభార్య రాసమణిధోరణి వేరు. శానియాండి చౌదరీలవంశము కాదు ఆమెది, ఆ ఇంటిమర్యాదలూ లాంఛనాలూ ఏలాగు నిలబెట్టడము అనే ప్రశ్నతోనే ఆమె యెల్లప్పుడూ కూర్చోలేదు. 'ఆవంశగౌరవము ఆయనే ఎరుగును' అనుకొంటూ రాసమణి తనలోతాను నవ్వుకొంటూ ఉండేది. బీదవైష్ణవకుటుంబములో పుట్టిన రాసమణికి ఈకష్టము సహించి ఉండడమే మంచిది అనిపించేది, చౌధరీవంశముయొక్క మాన మర్యాదలగురించి సరిగా ఊహించనైనా లేకపోయేది.

రాసమణి అనేది—"నేను బీదఇంటిపిల్లను, మీదర్జాతో నాకేమీ సంబంధములేదు, నాకాళీపద బ్రతికి బాగుం

డనీ, వాడే నాకు అన్ని ఐశ్వర్యాలకంటె గొప్పఐశ్వర్యము.” వీలు తిరిగి దొరుకుతుందనీ, సంపద హరించిపోయినతరువాత ఎండిపోయిఉన్న ఇసకదిబ్బలమీద, కాళీపదపుణ్యమువల్ల ధన ప్రవాహము తిరిగి వరదలువరదలుగా పారుతుందనీ, రాసమణి ఎప్పుడూ నమ్మలేదు; ఆమాట చెవినైనా పడనియ్యలేదు. పోయిన వీలును గురించి భవానీ మాట్లాడనిమనిషి లేడు, కాని తనమనస్సును నింపిఉన్న ఈ గొప్పసంగతినిగురించి భార్యతోమాత్రము ఎన్నడూ అతను వాదించలేదు. ఒకటి రెండుసార్లు ఆమెతో మాట్లాడి చూచాడు, గాని దానివల్ల అతనిమనస్సుకు తృప్తికలుగలేదు. పూర్వము ఆఇంట్లోఉండిన ఐశ్వర్యముగాని, ముందుకు ఆఇంటికి రాబోయే ఐశ్వర్యము గాని, రాసమణిమనస్సును ఆకర్షించలేదు. కేవలము ప్రస్తుతానికి అవసరమైన సంసారతాపత్రయాలే ఆమె మనస్సును పూర్తిగా కట్టిపెట్టిఉంచేవి.

ఉన్నతాపత్రయాలుమాత్రము తక్కువా? ఎంతో ప్రయత్నముమీద గాని సంసారము గడిచేది కాదు—లక్ష్మి ఇల్లు వదలివెళ్లిపోయినా లక్ష్మీమోసేభారముమాత్రము పూర్తిగా ఇల్లువదలదు, వెళ్లేటప్పుడు కొంత వెనక అట్టేపెట్టి మరీవెళ్లుతుంది. అప్పుడు మనచేతులో ఉపాయాలు ఉండవు, అందుచేతనే మనకుకలిగే అపాయాలు అధికము. ఇంటికిఉండే ఆసరా పోయిందిగాని ఆశ్రితబృందముమాత్రము వదలకుండా

ఉన్నది. చేతిలో డబ్బులేదుకదా అని ఎవరినీ పొమ్మనేరకము కాదు, భవానీ.

ఆ విరిగిపడ్డ ఇంటిని ఆధారము అంతటితోనూ మోసు కొనిపోయేవూచీ రానమణిది, ఆమెకు ఎవరివల్లం ఎటువంటి సహాయమూ దొరికేది కాదు. సంపదఉండేదినాలలో అందరూ కులాసాగా కాలముగడిపేవారు, ఎవరూ ఎటువంటిపనీ చేసి ఎరగరు. చౌధరీవంశమహావృక్షముకింద సుఖముగా వీళ్ళందరూ పడుకొనిఉంటే, నీడ వానంతటఅదే వచ్చి వీళ్ళమీద వ్యాపిం చేది, పండినపళ్లు వాటంతటఅవే వచ్చి వీళ్లనోళ్లలో పడేవి— అందుచేత ఎవరూ ఎట్టిప్రయత్నమూ చేయడము అవసరము లేకపోయేది. వీళ్ళలో ఎవరికైనా ఇప్పుడు ఏదైనా పనిచెపితే వాళ్లను అవమానపరచామని అనుకొనేవారు. వంటఇంటిపొగ కొంచెము దగ్గరికివచ్చేసరికి తలనొప్పి పుట్టేది; ఇటూఅటూ కొంచెము నడిచేసరికి వాతరోగము కాళ్ళల్లో ప్రవేశించేది— ఎంతగొప్ప కవిరాజైనా, ఎటువంటిఘనమైన తైలాలమర్దనవల్ల నైనా వీటిని కుదర్చలేకపోయేవాడు. ఇంతేకాక, మనము ఆశ్రయంఇచ్చి దానికిబదులుగా ఆశ్రితులవల్ల పని రాబట్టుకో వడము వాళ్ళచేత చాకిరీచేయించుకోవడమన్నమాటే అని భవాని అంటూ ఉండేవాడు—మనమిచ్చే ఆశ్రయము యొక్క విలువ దానివల్ల పోతుంది—చౌధరీవంశమువారిపద్ధతి అది కాదు.

అందుచేత పూచీఅంతా రాసమణిమీదనే పడ్డది. ఎన్నోవిధాల ప్రయత్నముచేసి రాత్రింబగళ్లు ఎంతోకష్టపడి లేమి పైకికనబడకుండా గడుపుకొని వచ్చేది రాసమణి. ఈవిధముగా ప్రతివిషయములో కొసురుతూ, లాగులాడుతూ, రాత్రింబగళ్లు దారిద్ర్యముతో పోరాడుతూఉండడమువల్ల ఎటువంటికోమలహృదయానికైనా కాఠిన్యత రాకమానదు. హృదయము ఇంతకఠినముచేసుకొని ఎవరిలాభముకొరకు ఇంత కష్టపడతామో వాళ్ళకే చివరకు మనమీద అసహ్యము కలుగుతుంది. వంటఇంట్లో అన్నమువండడముఒక్కటే రాసమణి పని కాదు. అన్నముదొరికే ఏర్పాట్లుకూడా చాలాభాగము ఆమె చూచుకోవలసివచ్చేది—అయినా, ఆ అన్నమే భుజించి మధ్యాహ్నము హాయిగా నిద్రపోయేవాళ్లు ఆ అన్నాన్ని, అన్నదాతనూకూడా నిందిస్తేనేగాని తిన్నఅన్నము అరిగించుకోలేక పోయేవారు.

కేవలము ఇంటిపనే కాదు రాసమణి చేయవలసినది. అన్నీపోగా మిగిలిన చిన్నచిన్న భూముల లెక్కలన్నీ చూచుకోవడమూ, రావలసినఆదాయము రాబట్టుకోవడమూ, రాసమణిపనే. శిస్తులు వసూలుచేయడములో ఇంతకాఠిన్యము ఇంతకుముందు ఎన్నడూ లేదు. భవానీ రూపాయిలు అభిమన్యుని వంటివికావు, అభిమన్యునిజ్ఞానానికి వ్యతిరేకము వీటిజ్ఞానము—వీటికి పైకిరావడమే తెలుసును, లోపల ప్రవేశించేవిద్య తెలి

యాదు. రూపాయిలనుగురించి ఎన్నడూ ఎవరినీ అడగలేకపోయే వాడు భవాని; రావలసినదానిలో ఒకకానీ వదిలేదికాదు రాసమణి. ఇది చూచి రయితులు ఆమెను నిందించేవారు, గుమాస్తాలూ, నౌకర్లూ ఆమెజాగ్రత్త భరించలేక ఆమెనూ ఆమెవంశాన్నీ తిట్టేవారు. ఆమె కనపరిచే కృపణతా ఆమె కాఠిన్యమూ చూచి ఆ ఇంటిప్రతిష్ఠకు హానికలుగకమానదు అని భవానీ అతిమృదువుగా అప్పుడప్పుడు అడ్డుపడుతూ ఉండే వాడు. అదిఏదీ లక్ష్యపెట్టకుండా రాసమణి తాను నియమించు కొన్నపద్ధతిప్రకారము పనిచేసుకొని పోతూఉండేది, నింద తన నెత్తిమీదనే పట్టుకొనేది—"నేను నిరుపేదల ఇంట్లో పుట్టిన దానను, నాకు ఈ బాబూగిరీ, ఈ పేరుప్రతిష్ఠలూ బోధ పడవు," అని మాటిమాటికీ అంటూ ఉండేది. దానివల్ల ఇంటా బయటా అందరికీ ఆమెయెడల సంతుష్టి కలిగినా నడ్డి బిగించుకొని తుపానువలె తనపనితాను చేసుకొని పోయేది. ఆమెకు అడ్డురావడానికి తగిన సాహసము ఎవరికీ ఉండేది కాదు.

భర్తను ఎటువంటిపనిలోనూ సహాయముచేయమనేది కాదు సరేకదా, పైగా, 'ఇంటికి నేనుపెద్దను' అంటూ వచ్చి అతడు ఏపనిలో ఎప్పుడు చెయ్యిపెడతాడో అని రాసమణి రాత్రింబగళ్లు భయపడుతూనే ఉండేది. "మీరు దీన్నిగురించి ఆలోచించకండి, మీకెందుకు ఈ గొడవ, నేను అన్నీఅంతా చూసుకుంటాను, ఇందులో మీపని ఏమీ లేదు," అంటూ

ప్రొద్దున్న మొదలు సాయంకాలమువరకూ అతనిని నిరు త్సాహపరుస్తూ ఉండడము ఆమెచేయవలసినపనులలో మొదటి పని. భర్తకుకూడా పుట్టినప్పటినుండి అదే అలవాటు గనుక ఆవిషయములో రాసమణికి అట్టే ఆటంకంకలిగేదికాదు. పని పాటుఎరగని అమాయకుడు భవాని, సహజముగా ఇతరుల మీద భారంవేసి ఉండవలసినవాడు. చాలకాలమువరకు సంతానములేదు రాసమణికి. గనుక తనలో ఉండే మాతృవాత్సల్యమూ, పతిభక్తీ, రెండిటినీ భర్తమూలం గానే తృప్తిపరుచుకొనేది. భవానీని వయస్సువచ్చిన కొడు కును చూచినట్టుగా చూచేది రాసమణి. కాబట్టి అత్తగారు కాలముచేసినప్పటినుంచీ ఇంటికి ఆడపెద్దా మొగపెద్దాకూడా ఈమే! కులగురువుగారికుమారుడు మొదలైన ఉపద్రవాల నోట పడకుండా భర్తను కాపాడే ప్రయత్నము చేయడ ములో రాసమణి చాలాకఠినంగా నడుచుకోవలసి వచ్చేది. అందు వల్ల భర్తస్నేహితులంతా ఆమెను చూచి జడిసేవారు. స్త్రీలకు సహజంగాఉండే సంకోచము తన నడవడిలో కనపరచడము రాసమణికి ప్రాప్తించలేదు. మాటలవాడి కొంచెము తగ్గించు కొందామని ఆమెకుచాలాకోరికగా ఉండేది, కాని ఉపాయం లేకపోయేది; పద్ధతులను కొంచెము మెత్తపరచు కొందామని ఎంతకోరినా వీలుఅయేది కాదు.

ఇప్పటివరకు భవాని అతిభక్తిగా భార్యమాట వింటూ

వచ్చాడు. కాని కాళీపద పుట్టినప్పటినుంచీ భార్యమాట మన్నిస్తూ నడవడము అతనికి కష్టమయిపోయింది.

రాసమణి భవానీకొడుకును భవానీకళ్ళతో చూడడము లేదు. భర్తవిషయమై ఆమెకుఉండేధోరణి వేరు—"పాపము, అత నేమి చేయగలరు? తన తప్పేమున్నది, గొప్ప ఇంటిలో పుట్టినవాడ ఆతను!" అని అనుకొనేది. అందుచేత ఇంత లేమిలో కూడా ఎంతతంటాలుపడిఅయినా భర్తఅలవాటు పడిఉన్న సౌకర్యాలకు మాత్రము ఏవీ అడ్డు రాకుండా చూచేది, అతనికికావలసినవన్నీ ఎలాగోకుదిర్చి పెట్టేది. బయటివాళ్ళ విషయములో మహాకఠినముగా ఉండేది, కాని భవానీ భోజనమువిషయములోగాని, అతనితోసంబంధించిన మరి ఏవిషయంలో గాని సాధ్యమైనంతవరకు ఇప్పటికీ పూర్వానికీ ఎట్టి వ్యత్యాసమూ లేకుండా ఉండేటట్టుచూసేది. మరీ ఇబ్బందిగాఉండి ఇంట్లో ఏమీ చేయ లేకపోయినాడు కూడా, లేమివల్లవచ్చిన అవస్థ అది అని భర్తకు తెలియ నియ్యక తన అశ్రద్ధవల్ల జరిగినపొరబాటు అన్నట్టుగా తనను నాలుగుతిట్లు తిట్టుకొని ఏదో కారణము కల్పించి చెప్పేది: "ఆ దిక్కు మాలిన కుక్కవచ్చి వండిన వంటంతా పాడుచేసేసింది," అనేది ఒకొకనాడు. భర్తకోసము తానుకొన్న కొత్తబట్ట పోవడానికి కారణము 'నటవిహారి' అని అంటూ వాడిఅజాగ్రత్తను ఒకనాడు నిందించడము మొదలుపెట్టింది రాసమణి. భవానీ తనప్రియభృత్యునిపక్షమయి వాడిని భార్యతిట్లనుండి రక్షించ

వలెనని చాలా అవస్థపడ్డాడు. పోయినపంచ చాలాచిత్రమయినది—అది గృహిణి ఎన్నడూ కొనలేదు, భవానీ కంట చూడలేదు, "నటు" మాత్రము దొంగలించాడు! ఎటువంటి జంకూలేకుండా ముఖము ఎత్తి భవాని అన్నాడు, "ఆ పంచ కుచ్చిళ్లు పెట్టి 'నటు' నాకు ఇచ్చాడు, నేను అది కట్టుకొన్నాను. తరువాత—"తరువాత ఏమిటయిందో కల్పించి చెప్పడానికి తక్షణమే భవానీకి ఏమీతట్టలేదు. అదిచూచి రాసమణి తానే ఆవాక్యము పూర్తిచేసేసింది, "నాకు తెలుసును, మీరు మన ముందుగదిలో అది విడిచారు, అది అక్కడే ఉండిపోయింది. అక్కడికి ఒకడు వస్తాడు ఒకడు రాడు అని ఉంటే కదూ! ఎవడో తీసుకొనిపోయిఉంటాడు. కొ-త్-త పంచ !"

భవానీచరణుని విషయాలలో రాసమణి ఈవిధముగా గడపుకువచ్చేది. కాని తనకొడుకుకుమాత్రము భర్తతో సమానపదవిని ఇచ్చి ఉపచారాలు చేయనిశ్చయించుకోలేదు. వాడు తనకడుపున పుట్టినవాడు, వాడికి బాబూగిరి కూడదు; శక్తిసామర్థ్యాలు వినియోగించి పాటుపడవలసినవాడు; దుఃఖము సహించిఉండవలసినవాడు; కష్టపడి పనిచేసి పొట్ట పోషించుకోవలసినవాడు. ఇదిలేదు అదిలేదు అని రోజూ అంటూఉంటే శోభించదు అటువంటివాడిలో. కొడుకుతినే తిండివిషయములోనూ, కట్టేబట్టలవిషయములోనూ అతి మామూలుగా లేతప్ప, వేరేదీ కొనేదికాదు. అటుకులూ బెల్లముతో కాలీపద ఫలహారము ముగిసిపోయేది, దళసరి

నూలుదుప్పటితో ముక్కూ నోరూ కప్పుకొని కాళీపద శీత కాలము గడపవలసివచ్చేది. పిల్లవాడిచదువుసంధ్యలలో ఎటువంటిఅశ్రద్ధ కనబడ్డా ఊరుకోకూడదనీ, వాడు కట్టుబాటులో ఉండి చెప్పినమాట వినేటట్టు చూస్తూఉండమనీ రాసమణి మాష్టరుగారితో చెప్పేది.

ఈసందర్భములో కొంత గొడవ అప్పుడప్పుడు జరిగేది. ఆ సత్యకాలపుమనిషి, భవానీ, ఉండిఉండి తిరగబడే వాడు, గాని రాసమణి అది చూచీచూడనట్టుగా ఊరుకొనేది. బల మైన వాళ్ళకులొంగి ఉండడము భవానికి చిన్నప్పటినుండీ అలవాటే, ఇప్పుడూ అలాగే లొంగే మసులుతున్నాడు, గాని క్రొత్తగా లోలోపల ఒక తిరుగుబాటుబుద్ధిపుట్టి అది అతనిమన స్సును వదలకుండాఉన్నది. ఈఇంటిపిల్లవాడయిఉండికూడా కొడుకు అటుకులూ బెల్లమూ తిని ఆకలినివారణచేసుకుంటూ ఉన్నా, ముతకదుప్పటి ముఖమువిూదికి లాగుకొని శీతకాలము గడుపుతూఉన్నా రోజూ చూస్తూఉండి భవాని ఎన్నాళ్లు ఊరుకోగలడు, పాపము!

తన తలిదండ్రులరోజులలో దుర్గపూజ ఉత్సవాల ప్పుడు ఖరీదుగల కొత్త బట్టలు కట్టుకొని ఎంతఉత్సాహ ముతో అనుభవిస్తూఉండేవాడో పూజరోజులలో భవానీకి జ్ఞాపకమువచ్చేది. రాసమణి ఇప్పుడు పూజకు కాళీపదకోసము తెప్పించేబట్టలు మునుపునొకర్లయినా పుచ్చుకొనేవాళ్లుకారు. "ఎటువంటిదిఇచ్చినా కాళీపద ఆనందిస్తాడు, వాడికి పూర్వము

మాట ఏమీ తెలియదు, మీరు ఉత్తధర్మానికి ఎందుకు ఆలాగు బాధపడతారు?" అని భర్తకు నచ్చచెప్పాలని రాసమణి చాలా ప్రయత్నముచేసింది. కాని భవాని మనుస్సుకు దానివల్ల శాంతి కలగలేదు—"పాపము, వాడికి పూర్వముమాట తెలియదని వాడిని మోసపుచ్చుతున్నామే!" అని అనుకొంటూ చాలా దుఃఖిస్తుండేవాడు. దసరాకి మామూలువి చిన్న-చిన్నవస్తువులేవైనా కొని తల్లి పిల్లవాడికి ఇచ్చేసరికి పిల్ల-వాడు అతిసరదాగా గంతులువేసుకొంటూ తండ్రిదగ్గిరికి వచ్చి వాటిని చూపించేవాడు; అవి చూస్తే భవానీకి మరింత బాధకలిగేది; చూడలేక ముఖము అటుతిప్పుకొని ఇల్లు వదలి బయటికి వెళ్లిపోయేవాడు.

భవానీచరణ్ దావావేసినప్పటినుంచీ గురువుగారి ఇంట్లో కొంచెము డబ్బు చేరడముమొదలుపెట్టింది. దానితో తృప్తిపొందక గురువుగారికొడుకు ప్రతిసంవత్సరమూ పూజకు కొన్ని రోజులుముందుగా కలకత్తా వెళ్లి అక్కడనుండి తమాషా తమాషావస్తువులు అనేకంగా తెచ్చేవాడు. వాటిఖరీదు ఆక్టేఉండేది కాదు, గాని ఆఊరివాళ్ల మనస్సులను అవి చంచలంచేసేవి, ఏటేటా రెండుమూడుమాసాలవరకూ జరిగేది ఈసందడి. మాయసిరా ఒకమారు తీసుకువచ్చేవాడు, ఒక-మారు స్ప్రింగు గొడుగులూ, కంపెనీలోచేసిన గాలాపు రువ్వాలూ తెచ్చేవాడు. ఇంకొకమారు మీదపువ్వులూలతలూ అచ్చుగుద్దిన లెటరుపేపర్లు, మరిఒకమారు అంకెలు అక్షరాలతో

అల్లిన చీరలు—ఇటువంటి నానారకాల వింతవింతవస్తువులతో ఆ పల్లెటూరివాళ్లమనస్సులు చంచలముచేసేవాడు. ఈ ఉపకరణాలవల్లతప్ప కలకత్తానగరములో మర్యాద నిలబెట్టుకోలేరని తెలుసుకొని ఈగ్రామస్థులలోకూడా పెద్దవాళ్లమనిపించుకొనేకోరికగలవాళ్లు చాలామంది తమతలలకు మించినఖర్చు చేసి, వీటిని కొని తమమర్యాదను నిలుపుకోవడము మొదలుపెట్టారు.

ఒకమారు బగలాచరణ్ గొప్ప వింతఅయిన ఒకదొరసానిబొమ్మను ఆఊరికి తీసుకువచ్చాడు. మరతిప్పితే ఆబొమ్మ చప్పున కుర్చీమీదనుంచి లేచి గబగబా విసనకర్రతో విసురుకొనేది.

ఎండకుభరించలేక అవిరామముగా విసురుకొంటూఉన్న ఈదొరసానిమీద కోరికపుట్టింది మన కాళిపదకు. కాళిపద తల్లిని బాగాఎరుగును. అందుచేత తల్లిదగ్గిరకి వెళ్ళక తండ్రి దగ్గిరికి వెళ్లి అతనికి జాలిపుట్టేటట్టుగా తనకోరికను తెలియజేశాడు. అది కొనిఇస్తానని తక్షణమే చెప్పి భవానీ కొడుకును సంతోషపరిచాడు, గాని ఆబొమ్మఖరీదు వినగానే అతనిగుండెలో రాయిపడ్డది. డబ్బువసూళ్లు రాసమణే చేస్తూ ఉండేది, డబ్బు ఆమెదగ్గరనే నిలవా ఉండేది, ఖర్చుఅంతా ఆమెచేతిమీదనే జరిగేది. భవాని ముష్టివాడిలాగు ఆఅన్నపూర్ణద్వారముదగ్గిరికి వెళ్ళి నిలుచున్నాడు. మొదట కొంతసేపు ఈబొమ్మతో

సంబంధములేనిసంభాషణ చాలా జరిపాడు, చివరకు ఛటీమని తనమనస్సులోఉండేకోరిక వెళ్ళకక్కేశాడు. రాసమణి అతి క్లిష్టముగా మూడుమాటలలో తెమిల్చేసింది.

"ఏమిటి, మీకేమి వెర్రా ఏమిటి?"

భవాని కొంచెముసేపు ఆలోచిస్తూ ఏమి అనకుండా నిలుచొని చివరకు హఠాత్తుగా, "చూడు, నాకు పెరుగూ పరమాన్నము రోజూ భోజనముతో అవసరము లేదు సుమా!" అన్నాడు.

"అవసరము లేకపోతే?" అని అడిగింది రాసమణి.

"అవి రోజూ తినడమువల్ల పైత్యము చేరుతుందని కవిరాజు అన్నాడు", అని భవానీ అన్నాడు.

"మీ కవిరాజు అంతా ఎరుగును!" అన్నది, రాసమణి ఎగతాళిగా తల ఆడిస్తూ.

"రాత్రి లూచీ* మానేసి అన్నము తింటూఉంటే బాగా ఉంటుందనుకొంటాను, లూచీ జీర్ణముచేసుకోవడము కష్టము," అన్నాడు భవానీ.

"కష్టమయినా ఇంతవరకు మీకు ఏమీ జబ్బుచేయలేదే, పుట్టినప్పటినుండీ లూచీమే తింటున్నారు మీరు!"

భవానీ ఎటువంటిత్యాగానికైనా సిద్ధపడ్డాడు, గాని ఆపక్షముమాత్రము ఏమీ మెత్తపడేమాదిరి కనబడలేదు.

* పూరి.

రాసమణిపద్ధతి చాలాకఠినమైనది. నేతిధరజాస్తీఅయిపోతూ ఉన్నా రోజూచేసే లూచీలసంఖ్యమాత్రము తగ్గకుండా ఉన్నది. రోజూ మధ్యాహ్నము పరమాన్నముఉన్నది గనుక పెరుగులేకపోయినా ఇబ్బందిలేదు. "కానిపెరుగూ పాయసమూ మధ్యాహ్నము తినడము. ఈ ఇంటిఅభ్యాసము,"—గనుక ఎంతఅనవసరమైనా అవి ఉండకతప్పిందికాదు. ఎప్పుడైనాఒకనాడు కర్మము చాలక పెరుగుగాని పాయసముగాని భర్తకు మధ్యాహ్నభోజనముతో లేకపోతే రాసమణికి భరించలేని దుఃఖము వచ్చేది. అందుచేత భవాని ఎంతప్రార్థించినా ఆ నెయ్యి-లూచీ-పెరుగూ-పాయసాలగుండా దూరి ఆ విసనకర్రతోవిసురుకుంటూఉన్నదొరసానిని ఆ ఇంట్లో ప్రవేశింపజేసే మార్గము ఏదీ కనబడలేదు.

భవానీచరణ్ ఒకనాడు గురువుగారికొడుకుదగ్గిరికి వెళ్లాడు. ఆవెళ్లినపనితో సంబంధములేని మాటలు చాలా అయినతరువాత ఆదొరసానిమాట అడిగాడు. భవానీచరణ్ తన దురవస్థసంగతి దాచిఉంచుకోవడము అనవసరము, అది బగలాచరణ్ ఎరుగును, అయినా భవాని అప్పుడు తనదగ్గిరరూపాయలు లేక పోబట్టి ఈ చిన్న ఆటవస్తువుఅయినా కొడుకుకోసము కొనలేకపోతున్నానని సూచావాచా తెలియజేసి సిగ్గుచేత తలవంచుకొని కూర్చున్నాడు. సంకోచమంతా కాళ్లకింద నొక్కిఉంచి కండువాలోనుంచి పాతకాష్మీరుశాలువాకదానిని బయటికితీశాడు. గొంతుకలోనుంచి మాట పైకిరాకుండా

ఉన్నది, అయినా బలవంతాన అన్నాడు, "రోజులు అంతగా బాగు లేవు, నగదు అట్టేచేతిలో లేదు. అందుచేత ఈశాలువు మీదగ్గిర తాకట్టుఉంచి కాళీపదకోసము ఆటబొమ్మ తీసుకువెళ్దామా అనిచూస్తూన్నాను." ఆశాలువుకంటె తక్కువఖరీదుగల వస్తువేదైనా భవాని తెచ్చి ఉంటే బగలాచరణ్‌కు ఏమీ సంకోచము ఉండకపోయేది, కాని ఇదీ!—ఇది తిని జీర్ణము చేసుకోవడము కష్టము, గ్రామస్థులందరూ తిడతారు—అన్నిటి కంటెముఖ్యముగా రాసమణినోటివెంటవచ్చే మాటలు వినడానికిఇంపుగాఉండవు, అని బగలాచరణ్ బాగా ఎరుగును. కనుక భవానీ ఆ శాలువు తిరిగి కండువాలో చాచి నిరాశుడై ఇంటికి వెళ్లిపోవలసివచ్చింది.

కాళీపద రోజూ, "నాన్నా, నా దొరసానిబొమ్మ ఏదీ?" అని అడుగుతుండేవాడు. భవాని నవ్వుముఖముతో రోజూ అంటుండేవాడు, "ఉండు, ఇప్పుడేమిటి! సప్తమిపూజ రానీ!"

రోజూ బలవంతాన నవ్వడముకూడా భవానీకి చాలా కష్టము అయిపోతూ ఉన్నది.

చతుర్థివచ్చింది ఏదోనెపము కల్పించి వేళకానివేళ భవాని ఇంట్లోకి వెళ్లాడు. మాటలసందర్భములలో జ్ఞాపకము వచ్చినట్టుగా హఠాత్తుగా అన్నాడు—"చూడు, కొన్నాళ్ళు బట్టి చూస్తున్నాను, కాళీపదఒంట్లో [illegible] లేదు సుమా! రోజుకిరోజూ ఎండిపోతున్నాడు!"—

"బాగానేవుంది! ఎక్కడ ఎండిపోతున్నాఁడు! వాడు ఎన్నడూ సుస్తీగాఉండడము నేనుచూడలేదే?" అన్నది రాసమణి.

"కనబడలేదూ! ఎప్పుడూ మాట్లాడకుండా ఏలాగు కూర్చుంటాడో చూడు, దేనినిగురించో ఆలోచిస్తూఉన్న-ట్టుగా!" అన్నాడు భవానీ.

"వాడు ఒక్కక్షణము ఊరికే కూర్చుంటే నేను బ్రతికి-ఉందును, వాడికి వేరే ఆలోచన ఏమిటి, ఎప్పుడు ఏమిఅల్లరి చేదామా అనేతప్ప?"

అనగా, కోటకు ఇటుప్రక్కనున్న గోడలలోనైనా బలహీనత కనబడలేదు—భవానీవేసినగుండుదెబ్బకు రాతిగోడ-మీద డాగుఅయినా పడలేదు, నిట్టూర్పువిడిచి తలగో-క్కుంటూ పైకి వచ్చేశాడు భవాని. బయటిఅరుగుమీద ఒంటరిగా కూర్చొని అతిజోరుగా గుడుగుడు పీల్చడము మొదలు పెట్టాడు.

పంచమినాడు భవానీఆకుదగ్గిర పెరుగుగిన్నే, పరమా-న్నమూ, ఉన్నవిఉన్నట్టుగా, ఉండిపోయినవి. రాత్రి *సందేశ్ మాత్రము తిని మంచినీళ్లు తాగాడు, లూచీ ముట్టుకోలేదు; "ఈవాళ ఆకలిఅన్నమాట లేదు," అని అంటూ లేచి పోయినాడు.

* మిఠాయి.

ఈమారు కోటగోడలో ఒక పెద్దకన్నము పడ్డది. షష్ఠి-నాడు తల్లి స్వయముగా తానే వచ్చి మంచిమాటలుచెపుతూ కాళీపదను లోపలికి తీసుకువచ్చింది. కాళీపదముద్దుపేరు పెట్టి పిలుస్తూ అన్నది—"†బేటూ, చూడు తండ్రీ, నువ్వు ఇంతపెద్ద-వాడవుఅయినావుగాని పంతమూ ముద్దూ ఇంకా వదిలావు-కావు, అది నీకు మంచిదేనా తండ్రీ! ఛా ఛా, మనకు ఏదైనా దొరకదు అని తెలిసినప్పుడు అదే కావాలి అని కోరుతూ ఉండడము దొంగతనముచేసినట్లే, ఆమాట నీకు తెలియదూ-నాన్నా!"

ముక్కుతోమాట్లాడుతూ కాళీపద అన్నాడు, "నాకేమీ తెలియదమ్మా నాన్నే అది నాకు తెచ్చిఇస్తానన్నాడు."

నాన్న అనడానికి అర్థముఏమిటో కొడుకుకు నచ్చచెప్ప-డము మొదలుపెట్టింది రాసమణి. తండ్రి అనడములో ఎంత-ప్రేమ ఉన్నదో, ఎంతవేదన ఉన్నదో అది నచ్చచెప్పింది; వాళ్ళ ప్రస్తుతపు దరిద్రస్థితిలో అది కొనిఇవ్వబోతే వాళ్ళకు ఎంత-దుఃఖము కలుగుతుందో, ఎంతఇబ్బంది కలుగుతుందో, అదీ బోధపరిచింది. రాసమణి ఇంతకుముందు ఎన్నడూ కాళీపదకు ఇంత చక్కగా బోధపరచి ఏదీ చెప్పలేదు. చెప్పవలసినదేదో క్లుప్తముగా, గట్టిగా, చెప్పేది. ఇంతకుముందు ఎన్నడూ మెల్లిగా మంచిమాటలతో సలహాఇచ్చే అవసరము ఆమెకు కనబడ లేదు. అందుచేత, తల్లి ఈవాళ అంత బ్రతిమాలుకుంటూ బోధ-

† 'బేటూ' అనగా కొడుకా, దానిని 'బేటు' అని ముద్దుపేరుచేసింది.

పరచడము చూచి కాళీపద చాలాఆశ్చర్యపోయినాడు. పసి వాడే, కాని తల్లిహృదయములో ఒకమెత్తనిజాగాఉన్నది అని ఒకవిధముగా నేడు పోల్చుకొన్నాడు. కాని దొరసానివైపు-నుండి ఒక్కక్షణములో మనస్సును మళ్లించుకోవడము ఆపిల్ల వాడికి ఎంతకష్టమో తెలుసుకోవడము పెద్దవాళ్లకు కష్టము కాదు. అందుచేత ముఖము గంభీరముచేసుకొని కాళీపద ఒక కర్రపుల్లతో మన్ను తవ్వుతూ నిలుచున్నాడు.

రాసమణి తిరిగి మునుపటి కాఠిన్యం వహించి ఎట్టిసయాం-లేనిమాటలతో అన్నది, "నీకు కోపము వచ్చినా సరే, నువ్వు ఏడ్చినా సరే, కూడదు అన్నవస్తువు నీకు దొరకదు." ఇట్లా అంటూ వృథాగా కాలవ్యయం చేయక తనపనితాను చేసుకో వడము మొదలుపెట్టింది.

కాళీపద వీథిలోకి వెళ్లిపోయినాడు. భవాని అరుగు-మీద కూర్చొని ఇంకా గుడుగుడు జోరుగా పీలుస్తున్నాడు. కాళీపద ఇంకా దగ్గరికి రాకముందే భవాని అతనిని చూచి ఏదోపనిఉన్నట్టుగా చప్పున లేచి తొందరతొందరగా వెళ్లిపో తున్నాడు. కాళీపద పరుగెత్తుకొని తండ్రిదగ్గిరికి వెళ్ళి అన్నాడు, "నాన్నా ఆదొరసానిబొమ్మ——"

ఈవాళ భవానీముఖాన మరి నవ్వులేదు. కాళీపదను కౌగలించుకొని, "ఉండు బాబా, నాకు ఒకచిన్నతొందరపని ఉన్నది, అదిచూసుకొని వస్తాను, తరవాత మాట్లాడదాము," అని అంటూ రోడ్డుమీదికి వెళ్లిపోయినాడు. కాళీపదవెనుక

నుంచి చూస్తున్నాడు, తండ్రి కళ్లుతుడుచుకొంటున్నట్టు కనబడ్డది.

ఆసమయములో, దుర్గపూజవాటికి మంచిసనాయి మేళము పురమాయించవలెనని, ఆదగ్గరనే ఒకగొప్పయింటివాళ్లు మేళాల వాళ్ళనందరినీ పరీక్షచేస్తున్నారు. అది శరత్కాలపు ప్రాతః కాలము. సూర్యుడు అప్పుడే ఉదయించాడు. ఆసనాయిపాట వింటే మనస్సు కరిగిపోతూఉన్నది. లోపునదాచుకొన్న కన్నీటి భారముచేత బాధపడుతున్న ఆ ప్రాతఃకాలపు ఎండవలెనే ఉన్నది, జాలిపుట్టించే ఆ సనాయిపాట. కాళీపద రోడ్డువైపు చూస్తూ వాళ్ళగడపదగ్గిర నిలుచున్నాడు. తండ్రి ఎక్కడికీ ఏ పనిమీదా వెళ్ళడము లేదని అతని నడకచూడగానే బోధ-పడుతున్నది—వేసే ప్రతిఅడుగుతోనూ నిరాశాభారాన్ని లాగుకొని వెళ్లుతూఉన్నట్టుగా బహుకష్టముగా అడుగులు వేస్తున్నాడు; తీసినకాలు ఎక్కడ వెయ్యడమో తెలియదనట్టుగా నడుస్తున్నాడు. ఇది వెనకనున్న కాళీపదకు స్పష్టముగా బోధ పడుతున్నది.

కాళీపద తల్లిదగ్గిరికి వచ్చి, "నాకు ఆ విసుకుకొనేదారపాని అక్కరలేదమ్మా," అని అన్నాడు.

తల్లి అప్పుడు అడకత్తెరతో అతివడిగా పోకచెక్కలు కత్తిరిస్తున్నది. కొడుకుమాటలు వినగానే సంతోషముతో పొంగిపోయింది. అప్పుడు తల్లీకొడుకూ ఏమిమాట్లాడు కొన్నారో ఎవరికీ బోధపడదు. అడకత్తెర అక్కడ పడేసింది

రాసమణి. కత్తిరించని చక్కలూ, చక్కలగుండా ఆబుట్టలో వేసి తక్షణమే బయలుదేరి బగలాచరణ్ ఇంటికి వెళ్ళింది.

ఈవాళ భవాని ఇంటికి వచ్చేసరికి చాలాఆలస్యము అయింది. స్నానముచేసి భోజనానికి కూర్చున్నాడు—అతని-ముఖము చూచేసరికి ఈవాళకూడా పెరుగూ పరమాన్నమూ పిల్లికే ప్రాప్తి అని రాసమణి పోల్చుకొన్నది.

అప్పుడు, కాగితముచుట్టబెట్టి తాడుతోకట్టిన అట్టపెట్టెను తీసుకువచ్చి భవానీయెదుట పెట్టింది రాసమణి. భవానీ భోజ-నముచేసి పడుకోడానికి వెళ్లినప్పుడు ఈ రహస్యము బయటికి తీసుకువద్దామని రాసమణి అనుకొన్నది, గాని పెరుగూపాయ-సానికీ కలగబోయే అనుమానము తప్పించడానికని ఇప్పుడే పైకి తీయవలసివచ్చింది. పెట్టెలోనుంచి ఆవోరసాని బయటికివచ్చి వృథా కాలవ్యాపనచేయక తక్షణమే బహుఉత్సాహముతో గ్రీష్మతాపనివారణ ప్రారంభించింది. పిల్లి, పాపము, ఈవాళ పరాభవముపొంది వెళ్లిపోవలసివస్తుంది. భవాని భోజనముచేస్తూ భార్యతో అన్నాడు, "వహావ్వా, ఈవాళ వంట ఎంతరుచిగా ఉంది! పరమాన్నము ఇంత చక్కగా ఎప్పుడూ లేదు, పెరుగు ఎంతబాగా తోడుకున్నదనుకున్నావు!"

సప్తమినాడు కాళీపదకోరిక ఫలించింది—ఎన్నాళ్ళ-నుంచో కోరుతున్న కోరిక అది. ఆవాళరోజుఅంతా కాళీపద ఆ విసనకర్రతో విసురుకోవడమే చూస్తున్నాడు, తనతోటి

వాళ్ళనందరినీ తీసుకువచ్చి వాళ్ళకు చూపించాడు, వాళ్ళలో పుట్టినఈర్ష్య ఇంతాఅంతా కాదు. ఆబొమ్మే కాళీపదకు మరిఒకప్పుడు దొరకిఉంటే రోజంతా ఒకేవరసను ఆ విసుకుకోవడము మాచిచూచి సాయంత్రములోపుగా దానిని ఒకమూల పారేసి ఉండును. కాని ఇది అష్టమినాడు తిరిగి ఇచ్చేయవలెనని తెలియబట్టి కాళీపదకు దానిమీదనుండే ప్రేమ ఏమీతగ్గకుండా ఉన్నది. గురువుగారికొడుకుచేతిలో రెండురూపాయలు పెట్టి రాసమణి ఆబొమ్మను ఒక్కరోజుమాత్రమే ఉంచుకొని మరునాడు ఇచ్చేస్తానని చెప్పి తీసుకువచ్చింది. అష్టమినాడు కాళీపద ఒకపెద్ద నిట్టూర్పువిడిచి ఆబొమ్మను పెట్టెతోసహా తానే బగలాచరణ్ చేతికి అప్పజెప్పి వచ్చాడు. ఈ ఒక్కనాటిసమ్మేళనసుఖస్మృతి చాలాకాలమువరకు కాళీపదమనస్సును విడువలేదు— అతనికల్పనాలోకములో విసనకర్ర విరామములేకుండా ఆడుతూనేఉన్నది.

ఆనాటినుండి తల్లీకొడుకూ ఇద్దరూ ఒకటిఅయి, కలిసి, ఆలోచించి పనిచేయడము మొదలుపెట్టారు. అప్పటినుండి ప్రతిసంవత్సరమూ పూజరోజులలో కొడుకు ఎంతఖరీదైన కట్నాలు కావలెనన్నా భవానీ సునాయాసముగా ఇచ్చేసేవాడు. అది చూచి తనమట్టుకు తనకే ఆశ్చర్యమువేసేది.

ప్రపంచములో వెల ఇవ్వనిదే మనకేవస్తువూ దొరకదనీ, ఆ ఇచ్చేవెల దుఃఖమురూపముగా ఇవ్వవలెననీ, తల్లి హృదయవేదనవల్ల తెలుసుకొన్నాడు కాళీపద. ఈసంగతి

రోజుకురోజూ బాగా తెలుసుకొని మానసికవిషయాలలో చూస్తూచూస్తూఉండగానే కాళీపద పెద్దవాడయిపోయినాడు. కాళీపద ఇప్పుడు అన్నిపనులలో తల్లికి కుడిచెయ్యి. సంసారభారము తానూ కొంతవహించవలెను గాని దానిని మరింత అధికము చేయకూడదు అన్నమాట కాళీపద రక్తములో రక్తము అయిపోయింది—ఇది ఉపదేశమువల్ల అతనిలో ప్రవేశించినబుద్ధి కాదు.

తండ్రి పూచీ తననెత్తిమీదనే పెట్టుకోడానికి సిద్ధముగా ఉండవలెను అన్నమాట జ్ఞాపకము పెట్టుకొని గొప్పపట్టుతో చదవడము మొదలుపెట్టాడు కాళీపద. కాళీపద పోటీపరీక్షలో పాసయి, స్కాలరుషిప్ సంపాదించాడు. అప్పుడు భవానీ, "ఇంతకంటె గొప్పచదువు ఎందుకు, మా కాళీపదకు, తన ఆస్తి చక్కజూచుకోవడము నేర్చుకొంటే అంతే చాలును," అని అనుకోవడము ఆరంభించాడు.

కాళీపద ఒకనాడు తల్లిదగ్గిరికి వచ్చి, "నేను కలకత్తా వెళ్లి పెద్దచదువు చదువుకుంటేనేగాని వృద్ధిలోకిరాలేను అమ్మా," అని అన్నాడు.

"అది నిజమే నాయనా, కలకత్తా వెళ్లేతీరాలి," అన్నది తల్లి.

కాళీపద అన్నాడు—"నాకోసము ఏమీ ఖర్చుపెట్టడముకూడా అవసరముండదు అమ్మా! నా స్కాలరుషిప్‌తోనే నేను గడపుకోగలను; అదికాక ఏదైనా డబ్బువచ్చేపనికూడా చూసుకుంటాను."

భవానీచేత ఒప్పించడము బహుకష్టము అయింది. చక్కచూచుకొంటూఉండదగినంతఆస్తి వాళ్ళకు ఇప్పుడు లేదు అంటే భవానీకి చాలాదుఃఖముకలుగుతుంది అని రాసమణి ఎరుగును! అందుచేత కలకత్తాచదువుకు కారణముగా, "కాళీపద ఎందుకైనా పనికిరావాలా మరి?" అని అన్నది. కాని ప్రయోజకుడు కావడానికి చౌధరివంశమునపుట్టినవాడు ఇంతకు పూర్వము ఎన్నడూ కానియాడిగ్రామమువిడిచి బయటికివెళ్లే అవసరము రాలేదే! విదేశముఅంటే వారు యమపురిని జడిసినట్లుగా జడిసేవారు. అటువంటప్పుడు కాళీపదలాంటి చిన్నకుర్రవాడిని ఒంటరిగా కలకత్తా పంపించవలెననే తలంపు ఎవరి తలలోనైనా మొట్టమొదట ఏలాగుదూరిందో ఎంత ఆలోచించినా భవానీకి బోధపడలేదు. చివరకు ఆగ్రామస్థులందరిలోకి తెలివైనవాడు, బుద్ధిమంతుడు, అయిన బగలాచరణ్ కూడా రాసమణి చెప్పినదానినే ఆమోదించాడు. "కాళీపద ఎప్పుడో ఒకనాడు ప్లీడరీపాసుఅయి వచ్చి ఆపీలుదొంగలించినవాళ్ళకు తగినశాస్తి ఇప్పిస్తాడు, అదితప్పదు, అతనినొసట అదివ్రాసి ఉన్నది, అందుచేత అతను కలకత్తా వెళ్లడము బ్రహ్మతప్పించలేదు," అని అన్నాడు బగలాచరణ్.

ఈమాట వినగానే భవానీ మనస్సుకు గొప్పశాంతి కలిగింది. గామంచాలో కట్టిఉంచిన పాతకోర్టుకాగితాలన్నీ పైకితీసి కాళీపదతో మాటిమాటికీ ఆపీలువిషయమై వాదించడము మొదలుపెట్టాడు. కాళీపద ఇప్పుడు తల్లి మంత్రిఅయి ఆ మంత్రి

పని అతిశ్రద్ధతోనూ, తెలివితేటలతోనూ, జరుపుతున్నాడు; కాని తండ్రి వాదన, అతనిలో తగినఉత్సాహము పుట్టించలేక పోయింది. తన కుటుంబానికి జరిగిన ఈ శాశ్వతాన్యాయము విషయములో కాళీపదకు కలుగవలసినంత ఉద్రేకము కలగలేదు. అయినా తండ్రి చెప్పినదానికంతటికీ సమ్మతినే కనపరచి వెళ్లాడు. కాళీపద కలకత్తా వెళ్లడము, సీతను రక్షించడానికి ఆ వీర-శ్రేష్ఠుడైన రాముడు లంకకు వెళ్లడమే అని భవానీనమ్మకము. కాళీపదచేసేది ఏదోచిన్నపరీక్షపాసయే ప్రయత్నముమాత్రమే కాదు, తన గృహలక్ష్మిని తిరిగి ఇంటికి తీసుకవచ్చే మహా ప్రయత్నము.

కలకత్తా వెళ్లడానికిముందురోజున రాసమణి కాళీపద మెడలో ఒక రక్షాకవచము కట్టింది. కొడుకుచేతిలో యాభయి రూపాయిలనోటుఒకటి పెట్టి—"ఈ రూపాయిలు నీదగ్గిర ఉంచుకో నాయనా, ఆపదకాలములో పనికివస్తాయి," అని అన్నది. ఇంటిఖర్చులలోనుంచి ఎంతో కష్టముమీద మిగిల్చిన ఈ నోటును కాళీపద ఒక పవిత్రమైన కవచమని భావించి దానిని పుచ్చుకొన్నాడు. "ఇది నాకు నా తల్లిఇచ్చిన ఆశీర్వా-దమువంటిది, ఖర్చుచేయకుండా దీనిని ఎప్పుడూ దగ్గిరనే ఉంచుకొంటాను," అని కాళీపద తనలోతాను నిశ్చయించుకొన్నాడు.

భవానీచరణునోటివెంట ఇప్పుడు ఆవీలుచోరీమాట మరి వస్తూఉండడము లేదు, కాళీపదమాటఒక్కటే ఇప్పుడు అతడు

ఎవరితో మాట్లాడినా. ఇంటింటికీ వెళ్లి కొడుకుమాట చెప్తూ గ్రామమంతా చుట్టబెడుతుండడమే అతని పని. కాళీపద దగ్గర నుంచి ఉత్తరము రాగానే అదిపట్టుకొని ఇంటింటికీ వెళ్లి చదివేవాడు. ప్రొద్దున్న మొదలు సాయంకాలమువరకు ముక్కుమీదనుంచి ఆ సులోచనాలు దిగ ననేవి. ఎవరూ ఎప్పుడూ కలకత్తా వెళ్లుతూఉండరు గనుక కలకత్తా గొప్ప, దాని ఘనతా, భవానీ కల్పనాశక్తివల్ల మరింత ఉద్దీప్తమయినవి. “మా కాళీపద కలకత్తాలో చదువుతున్నాడు, కలకత్తాలో వాడికి తెలియనిసంగతి లేదు. హుగ్లీదగ్గర, గంగమీద, ఇంకొకవంతెన కడుతున్నారట—ఈ సంగతీ ఇటువంటివి అనేకమైన గొప్పగొప్పసంగతులూ, మా వాడికి, మనము రోజూ ఇంట్లో అనుకొనే మాటలంత సామాన్యమైనమాటలు అయిపోయినవి! విన్నారా! గంగమీద మరిఒక వంతెనట! ఈవాళే మా వాడి దగ్గరనుంచి ఉత్తరము వచ్చింది, ఆసంగతిఅంతా అందులో వ్రాశాడు”—అంటూ కళ్లజోళ్లు తీసి బాగాతుడుచుకొని ఆ ఉత్తరము ఇరుగుపొరుగువాళ్లకు మొదటినుంచి చివరదాకా మెల్లిమెల్లిగా చదివి వినిపించేవాడు. “చూశారా, ఎప్పుడు ఏమిజరుగుతుందో ఎవరమూ చెప్పలేము! రాను రాను ధూళి కాళ్లతో కుక్కానక్కాకూడా గంగను దాటేసేరోజులు వస్తవి, నేను చెప్పాను చూస్తూఉండండి—కలికాలములో జరగని దేమిఉంటుంది!” గంగాదేవి మాహాత్మ్యము ఈవిధముగా తగ్గించడము చాలశోచనీయమైన విషయమే, దాని

కేమీ సందేహము లేదు. కాని ఈ కలికాలజయవార్తను తన కుమారుడు తనకు వ్రాతమూలముగా తెలియజేయడమూ, తరువాత ఆమూఢగ్రామస్థులకు ఈవార్త తనకొడుకుపుణ్యము వల్ల తెలియడమూ—ఈ సంగతి ఎప్పుడూ మనస్సులో ఉండడమువల్ల భవానీహృదయము ఆనందముతో నిండిఉండేది అందుచేతనే ఈ వర్తమానయుగములో మితిలేని దుర్గతివల్ల మనకు కలుగుతూ ఉన్నదుఃఖాన్ని సునాయాసముగా మరచిపోగలిగాడు. ఎవరు కనబడ్డాసరే, తల ఆడించుకొంటూ— "నేను చెపుతున్నాను నమ్మండి, గంగకి రోజులు దగ్గిరపడ్డవి," అనేవాడు. గంగ ఎండిపోవడం ప్రారంభంకాగానే ఆవార్త కూడా కాళీపదవ్రాసే ఉత్తరముద్వారా అందరికంటె ముందుగా తనకే తెలుస్తుంది, అని భవానీ నమ్మకము.

అవతల, కాళీపద కలకత్తాలో అతికష్టముమీద కాలక్షేపము చేస్తున్నాడు; ఒకరిగదిలో వంతుకు కుదురుకొన్నాడు. పిల్లలకు చదువుచెప్పేవాడు. రోజూ రాత్రి ఎవరివో చిత్తాలూ పద్దులూ సాఫువ్రాస్తూ కూర్చొనేవాడు—ఈవిధముగా కొంచెము డబ్బు సంపాదిస్తూ చదువుజరుపుతున్నాడు. ఏలాగో కష్టపడి ఎంట్రెన్సుపరీక్ష పాసుఅయి తిరిగి స్కాలరుషిప్ సంపాదించాడు. అంతఅద్భుతమైన సంగతి జరిగినందుకు గ్రామస్థులందరినీ పిలిచి గొప్పవిందు చేస్తానని భవానీ చాలాసందడి చేశాడు, ఓడ రేవులోకిచేరిపోయిందన్నమాటే అని అనుకొన్నాడు, ఆ ధైర్యముమీద నిస్సంకోచంగా ఖర్చు-

పెట్టవచ్చునని అతని అభిప్రాయము. కాని రాసమణిలో ఏమీ ఉత్సాహము పుట్టకపోవడమువల్ల వింతమాత్రము జరగ లేదు.

కాళీపద ఇప్పుడు కాలేజీకి సమీపములో ఉన్న ఒక *మెస్‌లోకి బసమార్చాడు. మెస్ ప్రొప్రయిటరు క్రిందిఅంతస్తులో ఎందుకూ ఉపయోగపడని ఒకగదిలో అతనికి బస ఇస్తానన్నాడు—ఏర్పాటు ఏమిటి అంటే, కాళీపద ప్రొప్రయిటరుగారి అబ్బాయికి చదువుచెప్పుతూ ఉండడానికి, అతను కాళీపదకు రెండుపూటలూ భోజనముపెట్టి ఆ చెమ్మగది అద్దె లేకుండా బసగా ఇవ్వడానికీ. ఆ గదికిఉండే గొప్పసుగుణము ఒకటి ఏమిటంటే, అందులో కాళీపదతోపాటు మరిఎవరూ ఉండరు; గాలిచలనము ఏమీ కనబడదు నిజమే, కాని చదువు మాత్రము ఎటువంటిఅడ్డూ లేకుండా నడిచేది. ఇంతకూ, సౌఖ్యంగాఉన్నదా ఇబ్బందిగాఉన్నదా అని ఆలోచించే అవస్థలో లేడు కాళీపద.

ఈ మెస్‌లో డబ్బుయిచ్చి ఉండేవాళ్ళతో కాళీపదకు ఎటువంటి సంబంధమూ లేదు. సంబంధము లేకపోయినా సంఘాతముసుండి ఎవరూ అతనిని తప్పించలేకపోయినారు. పైలోకము యొక్క వజ్రాఘాతము క్రిందిలోకానికి ఎంతదుస్సహామైన బాధనుకలిగిస్తుందో తెలుసుకోవడానికి కాళీపదకు అట్టే రోజులుపట్ట లేదు.

*స్కూలువిద్యార్థులకు బసలిచ్చిభోజనము పెట్టే ప్రైవేటుహోస్టలు.

ఈమెస్ మీదిలోకములోని ఇంద్రునిసింహాసనము అలంకరించిఉన్న మహాపురుషునిపరిచయము మనకు చాలా అవసరము. అతనిపేరు 'శైలేంద్ర'. అతడు గొప్పఇంటి పిల్లవాడు, కలకత్తాకాలేజీలో చదువుకోవలెనంటే, కాలీపదవలె, అతడు మెస్‌లో ఉండనక్కరలేదు, మెస్‌లో తానుకోరుకొని ఉన్నాడు.

స్వగృహంనుండి తమ పెద్దపరివారములోనుండి ఇద్దరాడవాళ్లనూ, ఒక మొగవాడినీ కలకత్తా తీసుకువెళ్ళి ఇల్లు అద్దెకు పుచ్చుకొని వేరుగాఉండమని శైలేన్‌ను ఇంటివాళ్లు చాలా బ్రతిమాలుతున్నారు, గాని అతడుమాత్రము ఒప్పుకోకుండా ఉన్నాడు.

ఇంటివాళ్లు దగ్గిరఉంటే చదువేమీ జరగదు, అని శైలేన్ చెప్పాడు. కాని నిజమైనకారణము అది కాదు. నలుగురితో కలిసి కులాసాగాఉండడము శైలేంద్రకు సరదాయే, కాని ఆ నలుగురూ ఇంటివాళ్లైతే ఉన్నచిక్కు ఏమిటిఅంటే— తాను ఎప్పుడూ వాళ్లతో కూర్చోవాలి, ఒక్కక్షణమైనా సెలవు దొరకదు, వాళ్ళనానారకాలహక్కులూ చెల్లిస్తూ కూర్చోవాలి, ఏదైనా చేస్తే తప్పు ఒకరికీ, చేయకపోతే తప్పు ఇంకొకరికీ, అందుచేతనే మెస్‌లోఉండడమే అన్నిటికంటె ఉత్తమము అని శైలేంద్రునిమతము. మెస్‌లో జట్టుకు కావలసినంత మంది కుర్రవాళ్లు ఉంటారు, గాని భారముమాత్రము తనమీద పడదు. అంతా వస్తూఉంటారు, నవ్వుతూమాట్లాడి

వెళ్లిపోతూ ఉంటారు. నదీప్రవాహములాగు ప్రవహించుకు పోతూఉండడమే ఆజీవితలక్షణము, పోయినతరువాత చూస్తే ఆనవాలేమీ కనబడదు.

నేను బహుమంచివాడను అని శైలేంద్రనమ్మకము—తాను చాలా దయగలవాడు, సహృదయుడు అని అనుకొనే వాడు. అటువంటినమ్మకము ఉండడమువల్ల ఒక లాభము ఉన్నది, మంచివాళ్లము అని మనము నమ్ముతున్నంతసేపు మంచిగాఉందామని పెద్ద ప్రయత్నమువీదీ చేస్తూఉండనక్కర-లేదు. అహంభావము గుర్రాలవంటిది ఏనుగులవంటిది కాదు, దానిని ఖర్చులేకుండా పెంచవచ్చును, మేతవేయకుండానే దానంతట అదేపెరుగుతూఉంటుంది.

కాని శైలేంద్రకు ఖర్చుపెట్టడానికి తగినసామర్థ్యము ఉన్నది, కోరికఉన్నది. అందుచేత తన అహంకారాన్ని ఖర్చు-లేకుండా మేపించి పెరగనియ్యలేదు. చాలాఖరీదుగలతిండి పెట్టి దానిని చక్కగా ముస్తాబుచేస్తూ పెంచాడు.

నిజముగా, శైలేంద్రమనస్సులో దయకు లోటులేదు. మానవహృదయములోని దుఃఖాని తొలగించడమంటే మిక్కిలి ఉత్సాహము అతనికి. కాని అతనిఉత్సాహము బహుభయంకర మైనది, దుఃఖనివారణకొరకు తనదగ్గిరికి రానివాడెవడైనా కన బడితే అతనిని పలువిధాల దుఃఖపెట్టకుండా ఉండలేకపోయే వాడు. అతనిదయ నిర్దయగా మారేటప్పుడు అది ఒకభీషణా కారము ధరించి పనిచేసేది.

మెస్‌లో ఉండేవాళ్ళకు నాటకాలకు తీసుకుపోతూ-ఉండడమూ, మేకమాంసముపులావుతో విందు చేయిస్తూ ఉండడమూ, రూపాయిలు బదులుఇచ్చి తిరిగి అడగ-కుండాఉండడమూ శైలేంద్రచరిత్రలో రోజూ జరుగుతూ ఉన్నఘటనలే. కొత్తగాపెళ్లాడిన యువకులు సెలవులకు ఇండ్లకు వెళ్లేటప్పుడు భార్యలమనస్సులను ఆకర్షించడానికి, ఒకడు మంచిసబ్బుబిళ్ళఒకటీ, ఇంకొకడు చక్కని సెంటుబుడ్డీ, మరిఒకడు కొత్తఫ్యాషన్ జాకెట్టు మొదలైనవి ప్రతివాడూ ఏదోఒకటి తీసుకువెళ్ళచలెనని అనుకొనేవాడు. కాని ఇంటి అద్దె, హోటేలుచార్జీలూ పోగా ఏమీ మిగిలేవికావు. అట్టి వాళ్ళకు ఇప్పుడు మరిఏసిద్ధమైన కించా లేకపోయేది.— వాళ్లు శైలేంద్రునిలోఉండే రసజ్ఞానముమీద భారమంతావేసి అతని దగ్గిరకి వెళ్లి, "ఏది చక్కగాఉంటుందో, ఏది మంచిదో, నీవు బాగా ఎరుగుదువు అంతా నువ్వే చూచి మాకేదో కొని పెట్టాలి," అని అనేవారు. వాళ్లు శైలేన్ను దుకాణానికి తీసుకువెళ్లి ముందుగా పనికిరాని చేపుకవస్తువులు తీయించే వారు. శైలేన్ అది చూచి, "ఛీ ఛీ! ఏమి అభిరుచు లయ్యా మీవి!" అని వాళ్లను చీవాట్లుపెట్టి, అన్నిటికంటె చక్కని వస్తువులు పైకితీయించేవాడు. "వస్తువు పోల్చడమంటే ఆయన," అని అప్పుడు అనేవాళ్లు దుకాణదారులు. కొనడానికి వచ్చిన భర్తలు ఖరీదుమాట వినగానే ముఖము వేలవేసుకొనే

వాళ్లు. ఖరీదు స్వల్పముకాకపోయినా కొనేభారము తానే వహించేవాడు శైలేన్; కూడావచ్చినయువకులు, "అబ్బెబ్బె, మీరా..."అని అభ్యంతరపెట్టబోతూఉంటే అది వినిపించుకోకుండా జేబులోనుంచి రూపాయిలు తీసి దుకాణదారులకు ఇచ్చేసేవాడు శైలేన్.

ఈవిధముగా, శైలేన్ అతనిచుట్టూ ఉండేవాళ్ళందరికీ అన్నివిషయాలలో ఒక ఆశ్రయస్వరూపమయి ఉండేవాడు; తన ఆశ్రయముకోరనివారి గొప్పతనముసహించి ఊరుకోలేకపోయే-వాడు. లోకానికిహితముచేదామని శైలేనుకు భయంకరమైన ఉత్సాహము. కాళీపద, పాపము, ఆక్రింది చెమ్మగదిలో చింకి బనియను ఒకటి తొడుక్కొని, తనమురికిచాపమీద కూర్చొని, పుస్తకముమీద ముఖముపెట్టుకొని, రోజూ, రాత్రి, పాఠాలు కంఠోపాఠంచేసేవాడు—ఎంతకష్టపడిఅయినా స్కాలరుషిప్ సంపాదించి తీరాలి!

కలకత్తాకు వస్తున్నప్పుడు తల్లి తలమీద చెయ్యివేసి దీవించి, "గొప్పవాళ్లపిల్లలతో కలియకుమా, నాయనా, పాడు పరదాలలో పడిపోతావు!" అని చెప్పింది. కేవలము తల్లి చెప్పిందనే కారణమే కాకుండా తానుకూడా దైన్యవ్రతము పట్టడమువల్ల కాళీపదకు గొప్పఇంటిపిల్లలతో చేరడము అసం-భవంభవము అయింది. ఇతనికి శైలెన్‌తో ఎట్టిసంపర్కమూ

లేదు. కాళీపదచిక్కులు ఊహింపజాలనంతవి అయినవి. శైలేనుకు తనమీద దయకలిగే ఏచిన్నపని చేసినా తనచిక్కులన్నీ ఒక్కనిమిషములో విడిపోతవని కాళీపద ఎరగకపోలేదు. ఎంత బాధపడుతున్నా శైలేంద్రునిప్రసాదముకోసము అతనిలో వాంఛపుట్టలేదు. తనలేమి జ్ఞాపకము ఉంచుకొని దారిద్ర్యమనే గాఢాంధకారములోనే బసచేసుకొని కూర్చున్నాడు కాళీపద.

కాళీపద నిరుపేదగా ఉండికూడా శైలేన్ దగ్గిరికి రాలేదు. ఈ పౌరుషము చూచి శైలేన్ సహించలేకపోయినాడు. ఇంతే కాక కాళీపదకట్టుకొనే బట్టలలోనూ, తినేతిండిలోనూ, అతని దారిద్ర్యము పూర్తిగా వెల్లడిఅయి శైలేన్‌కళ్లలో పొడుస్తూ ఉండేది. అతని బట్టాపాతా, అతని చింకిదోమతెరా, రొజాయీ, మేడ ఎక్కుతున్నప్పుడు రోజూ మెట్లమీదినుంచి కనబడేవి—శైలేన్‌కంటికి ఇదిఅంతా ఒక అపరాధములాగు కనిపించేది. ఇదే కాదు. అతని మెడలో ఒకతాయెత్తు ఉండేది, రెండుపూట్లా సంధ్యవార్చేవాడు—ఈఛాందసమంతా మీదిఅంతస్తులోని సంఘంవారికి చాలా నవ్వుపుట్టిస్తూ ఉండేది. శైలేంద్రదళము లోనివాళ్లు ఇద్దరుముగ్గురు ఈ ఏకాంతవాసము చేస్తూఉన్న ఆ అమాయకునిగుట్టు పైకితీదామని మూడునాలుగురోజులు కాళీపదగదిలోకి రాకపోకలు చేశారు. కాని ఆనోరు తెరవని అబ్బాయినోటివెంట మాట రాలేదు. చాలాసేపు

కూర్చోడానికి హాయిగా ఉండే గది కాదు కాళీపదగది. కూర్చోడానికి ఆరోగ్యకరమైన స్థలం కాదు అది. అందుచేత వాళ్లు ఇతని రహస్యము బయలుపెడదామని చేసిన ప్రయత్నము అతిత్వరలో వదులుకోవలసివచ్చింది.

తమ కురమావిందుకు ఈ నిరుపేదను ఒకనాడు పిలిస్తే కృతార్థుడవుతాడని నమ్మి, దయతలచి, వాళ్లు కాళీపదకొకనాడు ఆహ్వానపత్రిక పంపారు. విందులో తినవలసిన పదార్థాలు అరిగించుకోవడము తనకు సాధ్యము కాదు, అటువంటివి తినడము తనకు అభ్యాసము లేదు, అని కాళీపద వాళ్లకు తెలియజేశాడు. ఆజబాబు చూచి శైలేనూ, శైలేనుదళము వాళ్లూ అగ్నిహోత్రులై పోయినారు.

కొన్నాళ్లవరకు తనగదికి సరిగా మీద నేఉండే గదిలో ధూమ్ధామ్ అంటూ శబ్దము రోజూ వినబడుతూఉండేది; అతితీవ్రంగా పాటలు పాడుతుండేవారు. అది జరుగుతున్నాళ్లూ కాళీపదకు చదువు అసాధ్యమయింది. పగటివేళ సాధ్యమయినప్పుడల్లా కాలేజీస్క్వేరులోకి వెళ్లి చెట్టుకిందకూర్చొని చదువుకొంటూఉండేవాడు, బాగారాత్రి ఉండగా లేచి దీపము పెట్టుకొని తెల్లవారినదాకా చదువుకొనేవాడు.

కలకత్తాలాంటిఊరిలో తిండీ, బసా, అనుకూలముగా లేకపోవడముచేతనూ, చదువూ, పనీ, విస్తారముకావడమువల్ల కలిగిన శ్రమవల్లనూ, కాళీపదకు తలనొప్పిరోగము ఆరంభిం-

చింది. మధ్యమధ్యను ఈజబ్బు కనబడేది, బాధవల్ల మూడేసి నాలుగేసి రోజులు గదిలో పడిఉండవలసివచ్చేది. ఈ సంగతి తండ్రికి తెలిస్తే తనను కలకత్తాలో ఉండనియ్యడు అని కాళీపద బాగాఎరుగును—వినగానే అతిగాబరాపడుతూ తండ్రి కలకత్తాకు పరుగెత్తివచ్చినా రావచ్చును. 'మనపల్లెటి గ్రామములో ఉండేవాళ్లు ఊహించనైనా ఊహించలేరు, అంతసౌఖ్యముగా మా కాళీపద కలకత్తాలో ఉన్నాడు' అని భవానీ అనుకొనేవాడు. ఊరిప్రాంతములోఉన్న అడివి ప్రదేశములో చెట్లూచేమలూ, పొదలూడొంకలూ, వాటంతటఅవే పెరుగుతున్నట్టుగా కలకత్తాలో మనుష్యులు బ్రతుకుతుండవచ్చును, సుఖజీవనానికి కావలసిన ఉపకరణాలన్నీ అక్కడిగాలితోపాటు వాటంతటఅవేవస్తూఉంటవి, అక్కడి వాళ్లందరికీ అవి ఉచితముగా దొరుకుతుంటవి, అని భవాని నమ్మకము. ఈ భ్రమను కాళీపద పోగొట్టలేదు. ఎంత జబ్బుగాఉన్నప్పటికీ తండ్రికి ఉత్తరమువ్రాయడము మానేవాడుకాడు. కాని ఒకమారు తలబాధతో పడిఉన్నప్పుడుకూడా శైలేంద్రసమాజము రాక్షసబృందమయి అనేకరకాల ఉపద్రవంకలుగజేశారు. ఆనాడు కాళీపదకు కలిగినబాధకు అంతములేదు. చాపమీద పడుకొని ఇటూఅటూ దొర్లుతున్నాడు; రెండోమనిషిలేని ఆ గదిలో పడి కొట్టుకొంటూ మధ్యమధ్యను 'అమ్మా' అంటూ ఉన్నాడు, నాన్నమాట అనుకొంటున్నాడు. దారిద్ర్యమువల్ల కలిగే అవమానమూ, బాధా, ఎంత అధికమవుతుండెనో అంత

అధిక పట్టుదలతో అతడు తనతల్లిదండ్రులను ఆ దారిద్ర్యము నుండి విముక్తులనుచేయవలెనని తనలో తాను ప్రతిజ్ఞ చేసుకొంటూ ఉండేవాడు.

తనను ఒకమూలను అణిచిపెట్టిఉంచుకొని సాధ్యమైనంతవరకు మీదివాళ్ళకంటపడకుండా కాలముగడుపుకుందామని కాళీపద చాలా ప్రయత్నించాడు. అయినా వాళ్ళ దౌర్జన్యము కొంచమైనా తగ్గలేదు. చీనాబజారులోకొన్న చేవుక జోళ్లు తొడుక్కొనేవాడు కాళీపద. ఒకనాడు ఆ జోళ్లలో ఒకదానిని దాచేసి దానికి బదులుగా చాలాఖరీదుగల సీమజోడు ఒకదానిని ఉంచి వెళ్లిపోయినారు. జతకానిజోళ్లు తొడుక్కోడానికి వీలులేక కాళీపద ఆనాడు ఉత్తకాళ్లతో స్కూలుకు వెళ్లవలసివచ్చింది. ఆమర్నాడు గోడారివాడిదగ్గిరకి వెళ్లి ఏదో కొంచెము ఇచ్చి పాతజోళ్లజత ఒకటితెచ్చుకొని దానితో కాలక్షేపముచేస్తూ వచ్చాడు. మరఒకనాడు మీదిసంఘము లోని కుర్రవాడొకడు హఠాత్తుగా కాళీపదగదిలోకి వచ్చి, "పొరపాటువల్ల నా సిగరెట్ కేసు మీరుతీసుకవచ్చేసినట్లు ఉన్నారండీ, నాగదిలో కనబడడములేదు," అన్నాడు. కాళీపద చికాకుపడి, "మీగదిలోకి నేను రానేలేదు," అని అన్నాడు. కాని ఆ కుర్రవాడు, "ఇదిగో!" అంటూ గదిలో ఒకమూలనుంచి చాలాఖరీదుచేసే సిగరెట్ కేసుఒకటి తీసి వేరు మాటలేకుండా మేడమీదికి వెళ్లిపోయినాడు.

ఎస్. ఏ. బాగా పాసుఅయి మంచి స్కాలరుషిప్ సంపాదించగలిగితే వేరే మెస్‌కు పోవలెనని కాళీపద నిశ్చయించుకొన్నాడు.

మెస్‌లోకుర్రవాళ్లందరూ కలిసి ప్రతిసంవత్సరమూ సరస్వతీపూజ గొప్పగా చేస్తూఉండేవారు. ఖర్చులలో ప్రధాన భాగము శైలేనే వహించేవాడు. అయినా ప్రతి కుర్రవాడూ ఇంతోఅంతో చందా వేయడము మామూలు. కాళీపదకు సిగ్గుతెప్పిద్దామని క్రిందటిసంవత్సరము అతనిని చందా అడ-గలేదు. ఈసంవత్సరము అతనికి చీకాకుపుట్టించేఉద్దేశంతో చందాపుస్తకము తెచ్చి అతనిముందర పెట్టారు. కాళీపద వాళ్లదగ్గిరనుంచి ఎన్నడూ ఎటువంటి సహాయమూ పొంద-లేదు. సదా జరుగుతూఉన్న వాళ్ల ఆటపాటలలో చేరి ఆనందించే సౌభాగ్యము అతను కోరలేదు. అయినా వాళ్లు అతనిదగ్గిరికి చందా ఇయ్యమని వచ్చినప్పుడు, తనలోతాను ఏమను-కున్నాడో తెలియదు, అయిదురూపాయిలు తీసి వాళ్ల-చేతిలో పెట్టాడు. శైలేన్‌సమాజమువాళ్లలో ఒక్కడైనా అయిదురూపాయిలు ఇచ్చిఉండలేదు.

కాళీపద దారిద్ర్యమూ, అతనికృపణతా చూచి అందరూ అతనిని చాలా అవమానపరుస్తుండేవారు. అటువం-టిది, ఈవాళ అతను అయిదురూపాయిలు చందా ఇయ్యడము చూచి ఎవరూ సహించలేకపోయినారు. "అతనిస్థితి మనము

ఎరగనిది కాదే, అతనికి అంతబడాయి ఎందుకో? అందరికంటె మీదను ఉందామని గాబోలు అతని ఉద్దేశము," అని వాళ్లంతా అనుకొన్నారు.

ఈసంవత్సరము సరస్వతీపూజ చాలా ఆడంబరముగా జరిగింది. కాళీపదఇచ్చిన అయిదురూపాయిలూ లేకపోయినా ఎటువంటిలోటూ లేకపోను. కాని అయిదురూపాయిలు ఉన్నా లేక పోయినా ఒక్కటే నాకు, అనే అవస్థలో లేడు కాళీపద. పై వాళ్లఇంట్లో అతనిభోజనము, ఏనాడూ వేళకు దొరికేది కాదు. అంతేకాక వంటబ్రాహ్మడే అతనికి దేవుడు కావడముచేత వడ్డించినది బాగున్నదనిగాని బాగులేదనిగాని, తిండిచాలును అనిగాని చాలదు అనిగాని అనడానికి వీలులేక పోయేది. అందుచేత ఫలహారానికోసమని చేతిలో ఎప్పుడూ ఏమైనా ఉంచుకోవలసివచ్చేది. దానికొరకు దాచుకొన్న సంచయమే ఈ ఐదురూపాయిలు. ఆ ఐదురూపాయిలూ దేవీ విగ్రహముతోపాటు గంగలో కలిసిన ఎండుపువ్వులరాసులలో అంతర్థానమైపోయినవి.

కాళీపదకు తలనొప్పిరుగ్మత బాగా హెచ్చయిపోతూ ఉన్నది. ఈమారు పరీక్షలో ఫేల్ కాలేదు గాని, స్కాలర్ షిప్ మాత్రము రాలేదు. అందుచేత తనచదువు కొంచెము తగ్గించుకొని మరిఒక *ట్యూషన్ తీసికోవలసివచ్చింది. ఆమెస్‌లో

*స్కూలుకుర్రవాళ్లకు ఇంటివద్దర చదువుచెప్పడము.

అతనికి ఇంతబాధగాఉన్నా, అద్దె లేకుండాదొరికిన ఆ బసను వదిలి మరిఒకచోటికి వెళ్లవీలులేకపోయింది.

ఈనెలవులాఖరున కాళీపద మరి ఈమెస్‌కు రాడని మీదిఅంతస్తునివాసస్థులు నిశ్చయించారు. కాని ఆరోజేవచ్చే-సరికి కిందిగదితాళము యథాప్రకారము తీసిఉన్నది. ఎప్పటి-వలె కాళీపద తిరిగి హాజరయిఉన్నాడు. ధోవతి కట్టుకొన్నాడు, మునుపటి పాతచెక్కుకోటు మునపటిలాగే తొడుగుకొన్నాడు. రైలుకూలీఒకడు కాళీపదటిన్‌ట్రంకూ, పాతపంచతో కట్టిన పెద్ద మూటఒకటీ తీసుకువచ్చి గదిదగ్గిర దింపాడు. ఆ కూలికీ కాళీపదకూ చాలాసేపు వాదనజరిగింది. చివరకు డబ్బులు పుచ్చుకొని కూలీ పోయినాడు. నిమ్మకాయతోనూ మామిడికాయతోనూ పెట్టిన ఊరగాయా, నోటికుచికని చేసిన అనేకరకాల పచ్చళ్ళూ, గుండలూ, చిన్నచిన్న మట్టిపిడతల-లోనూ, గిన్నెలలోనూ పెట్టి కాళీపదకు తల్లి ఇచ్చింది—అవన్నీ కలిపి కట్టినదే ఆ పాతపంచమూట.

మేడమీదికుర్రవాళ్ళు, కుతూహలముకొద్దీ, కాళీపద లేనప్పుడు గదిలోకి వెళ్లి అన్నీ పరీక్షచేసి వచ్చేవాళ్లు. అది కాళీపద ఎరుగును. అతనికి మరే భయము లేదుగాని తన తల్లిదండ్రులప్రేమను సూచించేవస్తువులలో ఏవైనా, తనను వెక్కిరిస్తూ అవమానపరుస్తూఉన్న ఆకుర్రవాళ్ళ చేతులలో పడిపోతవేమోఅనిమాత్రము భయపడుతూ ఉండేవాడు. తల్లి

ఇచ్చిన వస్తువులు కాళీపదకు అమృతమువంటివి, లేమితోనిండి ఉన్న తనఇంటి సొత్తు అది, నాగరికతలేని తనపల్లెటూరిఇంటి ప్రేమతో నిండఉన్నధనము. ఆ చిన్నపిడతలన్నీ ఒకకుండలో పేర్చి, మట్టిసిబ్బి మూతవేసి, ఆ మూతను మైదాతో అతికించి కాళీపదకు ఇచ్చింది తల్లి. అందులో నాగరికత లక్షణాలేవీ లేవు, పట్టణపు చిహ్నాలేవీ లేవు. అది గాజీజాడీకాదు, పింగాణీ జాడీ కాదు. కాని ఈ నాగరికులు, ఈపట్టణపుకుర్రవాళ్లు, దానిని అవమానపరుస్తారని ఊహించినంతమాత్రాన కాళీపదకు పట్టరాని దుఃఖమువచ్చేది. కాళీపద మొదటిమారు ఇవన్నీ తెచ్చుకొన్నప్పుడు తనకర్రమంచముకింద పెట్టి ఎవరికీ కనబడకుండా పాతన్యూసుపేపర్లతో కప్పి ఉంచేవాడు. పైగా ఈసారి గదికికూడా తాళము వేస్తున్నాడు. ఐదునిమిషాలు గది విడిచి బైటకు వెళ్లవలసివస్తే తాళము వెయ్యనిదే వెళ్లేవాడు కాడు.

ఇది ప్రతివాడూ కనిపెట్టాడు. శైలేన్ అన్నాడు— "రత్నాలూ కెంపులూ కూడబెట్టినట్టున్నాడు, గదిలోకి ఎవరైనా వెళ్లేసరికి ఆదొంగ కళ్ళవెంట నీళ్లు కారిపోతూఉన్నవి, మాటిమాటికీ గదికి తాళముపడుతూ ఉన్నది.—బ్యాంక్ ఆఫ్ బెంగాల్ జ్ఞాపకమువస్తుంది ఆమనిషి వ్యవహారము చూస్తే, మనమీాద నమ్మకము లేదు అతనికి. అతని పాతచెక్కకోటు మీాదనుండి మన మనస్సులను మరలించుకోలేమని గాబోలు ఆతనిభయము. రాధూ, ఒక్కపని చేయాలిరా అబ్బాయి,

ఆతనికి ఒక కొత్తకోటు కొనిఇస్తేనేగాని కథ జరిగేటట్టు లేదు—రోజూ ఒకచేకోటు చూస్తూఉండడము నాకు బహు కష్టముగాఉన్నది."

కాళీపదకు మెస్‌యజమాను ఇచ్చినగది చౌడుపట్టిపోయి ఉన్నది, అతిచెమ్మ, నేలనిండా గోతులు, పట్టపగలే చీకటి. శైలేన్ ఎన్నడూ అందులో అడుగుపెట్టలేదు, మేడ ఎక్కు-తున్నప్పుడు మెట్లమీదనుంచి చూచేవాడు, అసహ్యముచేత ఒళ్లుముడుచుకొనేవాడు. ముఖ్యముగా రాత్రివేళ ఆగదివైపు చూచేసరికి శైలేన్‌కి ఊపిరి తిరిగేదికాదు. ఆ గాలిలేనిగదిలో, ఒంటరిగా, మిణుకుమిణుకుదీపముదగ్గిర, ఒంటిమీద బట్ట లేకుండా, పుస్తకముమీద ముఖముపెట్టుకొని, చదువుతుండేవాడు కాళీపద. శైలేన్ తనబృందముతో ఒకనాడు—"కాళీపద ఏ ఏడుగురురాజుల మణిమాణిక్యాలు దొంగలించి తీసుక వచ్చాడో మీరు ఈమారువెదికి బయిటపెట్టాలి," అని అన్నాడు. అది వినగానే అంతా చాలాసరదాపడ్డారు.

కాళీపదగదితాళము అతిస్వల్పఖరీదుగలది. దానివల్ల కలిగే అడ్డు బహుసామాన్యము.—అది ఏతాళముచెవితో-నైనా తీసేయవచ్చును. ఒకనాడు సాయంకాలము, కాళీపద కుఱ్ఱవాడికి చేదువుచెప్పడానికి మామూలుప్రకారము వెళ్లిన సమయము చూచుకొని ఇద్దరుముగ్గురుకుఱ్ఱవాళ్లు మిక్కిలి

ఆమోదముతో ఆ గదితాళముతీసి లాంతరుపట్టుకొని గదిలో ప్రవేశించారు. తక్కినవుర్ర వాళ్లు చూస్తూ సరదాగా నవ్వుతున్నారు. మంచముక్రిందనున్న ఆకుండను పైకి లాగారు, అందులోనుంచి మామిడితాండ్రా, ఉరగాయా, పచ్చళ్లూ, బయటపెట్టారు. కాని అంతరహస్యముగా దాచేవలసినంతవిలువైన వస్తువేదీ వాటిలో వాళ్లకు కనబడలేదు.

ఇదీఅదీ వెదుకుతూఉండగా తలగడకిందను రింగులో గుచ్చిన తాళముచెవిఒకటి దొరికింది, ఆచెవితో అతని టిన్ పెట్టె తెరిచారు; అందులో మాసిపోయిన బట్టలుకొన్నీ, పుస్తకాలూ, నోటుబుక్కులూ, కత్తెరఒకటీ, ఒకచిన్నకత్తీ, కలమూ—మొదలైనవన్నీ కనబడ్డవి. పెట్టె తాళమువేసేయబోతూఉండగా అట్టడుగున చిన్న రూమాలుమూట ఒకటి కంటపడ్డది. రూమాలు విప్పారు. లోపల చింకిగుడ్డలోకట్టినది ఏదోకనబడ్డది. అది విప్పారు. అందులో కాగితముపొట్లము ఒకటి ఉన్నది! అది విప్పితే ఇంకొకటి, లోపున మరిఒకటి—ఆలాగు నాలుగయిదు ఉన్నవి. అన్నిటికీలోపల యాభైరూపాయిలనోటు ఒకటి బయలుపడ్డది.

ఆనోటు చూచి వాళ్లు నవ్వు పట్టలేకపోయినారు. ఆనోటువల్లనే ఇంతగాబరాపడుతూ క్షణక్షణానికీ గదికి తాళము వేస్తున్నాడు, అందువల్లనే ప్రపంచములో ఎవరినీనమ్మలేకుండా

ఉన్నాడని వాళ్లు బోధపరుచుకొన్నారు. శైలేంద్రప్రసాద పోషితులైన ఆవిద్యార్థిగణము కాళీపద కృపణత చూచి అసహ్యించుకొన్నారు. అతను ఎవరినీ నమ్మకపోవడముచూచి చాలా ఆశ్చర్యపడ్డారు.

ఆసమయములో కాళీపదదగ్గుతున్నట్టుగా రోడ్డుమీద నుండి వినబడ్డది, తొందరతొందరగా పెట్టె మూసి నోటు పట్టుకొని దొంగలు మేడమీదికి పారిపోయినారు. ఒక్కడు మాత్రము వెనుకనుఉండిపోయి గాబరాగాబరాగా గదికి తాళము వేశాడు. ·

ఆ నోటు చూచేసరికి శైలేన్‌కి పట్టలేనినవ్వు వచ్చింది. శైలేన్‌కి యాభై రూపాయిలు ఒకలెక్కలోనిదికాదు. కాని కాళీపద వ్యవహారాలనుపట్టిచూస్తేమాత్రము అతనిపెట్టెలో యాభై రూపాయిలు ఉంటవని ఎవరూ అనుకోరు. పైగా ఆనోటుకోసము ఇంతజాగ్రత్తా! "చూదాము, ఈ రూపాయిలు పోయినవని తెలిస్తే ఏమిచేస్తాడో, ఈ అద్భుతమైన మనిషి," అని అన్నారు అంతా.

ప్రైవేటుచెప్పి తొమ్మిదిఘంటలరాత్రికి తనగది చేరు కొన్నాడు కాళీపద, బాగా అలసిపోయిఉన్నాడు. గది ఏస్థితిలో ఉన్నదో చూడలేదు. భయంకరమైన తలనొప్పి ఆవాళ, తల పడిపోతున్నది. ఆ నొప్పితీవ్రము చూస్తే కొన్నాళ్లు చీకాకు పెట్టేటట్టుగానే ఉన్నది.

మర్నాడు బట్టఒకటి తీసుకొందామని మంచముకింది నుంచి టిన్ పెట్టె బయటికి లాగాడు. చూచేసరికి పెట్టెతాళం తీసి ఉన్నది. కాళీపద సహజముగా చాలాజాగ్రతమనిషి, అయినా పెట్టెకు తాళము వేయడము మరిచిపోతే మరిచిపోయి ఉండవచ్చును అనుకొన్నాడు, గదిలో దొంగదూరిఉంటే గది తాళము వేసిఉండకపోను అనుకొన్నాడు. పెట్టె తెరిచి చూచాడు, బట్టలన్నీ కలగాపులగముగా పడిఉన్నవి; కాళీపద గుండె బద్దలయిపోయింది. సామానంతా పైకితీసి చూచాడు. తల్లిఇచ్చిన యాభైరూపాయిలనోటు కనబడలేదు, అదికట్టిన కాగితముముక్కలూ, బట్టపీలికలూ, రూమాలూ మాత్రము ఉన్నవి. ఆ బట్టలన్నీ ఒక్కొక్కటి పైకి తీసి గట్టిగా ఝాడించాడు. నోటు ఎందులోనుంచీ పడలేదు. అవతల, మెట్లమీద కుర్రవాళ్లు ఇద్దరుముగ్గురేసి ఏదోపనిమీద తిరుగుతున్నట్టుగా మీదికీ కిందికీ వెళ్లుతూ, ఆ గదివైపుచూస్తున్నారు. మీది అంతస్తులో నవ్వు ప్రవాహమై గట్లుతీసి పారుతున్నది.

కాళీపద నోటుఆశ వదులుకొన్నాడు. సామాను సర్దుకోడానికి ఒంట్లో బలములేదు, భరించలేనితలబాధ, చచ్చినవాడిలాగు మంచముమీద పడిఉన్నాడు. తనతల్లి హృదయవేదనతో అచ్చుఒత్తినవోటు అది. మనస్సు కఠినముచేసుకొని ఎన్నో అవసరాలను అణగదొక్కి కొంచెముకొంచెముగా తల్లికూడబెట్టిన ధనము అది. కాళీపద మొదటిలో తల్లి దుఃఖాన్ని బోధపరచుకోలేక, దానిని కేవలము అధికముచేస్తూ

ఉండెను. ఆఖరుకు ఒకనాడు తల్లి కొడుకును పిలిచి రోజూ తాను భరిస్తూవున్న దుఃఖములో అతనిని వంతుదారినిచేసింది. ఆనాడు కొడుకు పొందినగౌరవము ఇంతాఅంతా కాదు; అటువంటి సుఖము ఇప్పటివరకు కాళీపదకు మరిదేనివల్లనూ కలగలేదు—లోపలనుండి తన ప్రాణము పలుకుతూఉన్న వాణి ఉన్నది ఆ నోటులో. ఆ నోటులోఉన్న దానికంటె గొప్పఆశీర్వాదము కాళీపదకు ఇంతకుపూర్వమెన్నడూ దొరకలేదు. తల్లిహృదయంలోని అడుగందని ప్రేమసముద్రాన్ని సర్వదా మథిస్తూఉన్న అమూల్యమైన దుఃఖముతో చేసిన ఉపహారము అది. అటువంటిదానిని దొంగలించుకొనిపోవడమువల్ల ఘోర శాపము ఒకటి తనమీదపడినంత దుఃఖము కలిగింది కాళీపదకు. ప్రక్కనున్న మెట్లమీద అడుగులచప్పుడు ఈవాళ ఒకేవరసను వినబడుతున్నది. పనిలేనిదే మేడఎక్కడమూ దిగడమూ ఈవాళ ఎడతెరిపిలేక జెరుగుతున్నది. నిప్పంటుకొని ఊరు తగలబడిపోతూఉంటే ఆ తగలబడిపోతూఉన్న ఇళ్ళప్రక్కను, ప్రజ హాహారుమని శబ్దముచేస్తూ, పారుతున్న నదీప్రవాహమువలె, పరుగెత్తుతుంటారు—అటువంటిదే ఆ మెట్లమీద నేడు జెరుగుతున్న హడావిడి.

మీదది హాస్యకోలాహలము నేడు ఒకేవరుసగా వినబడడమువల్ల అకస్మాత్తుగా కాళీపదకుతట్టింది, ఇదంతా దొంగల పనికాదు అని. శైలేంద్రదళమువాళ్ళు వెంకితనానికి నోటు తీసుకొనిఉంటారని గ్రహించాడు. దొంగలు తీసుకుపోయినా

అతనికి అంత బాధించకపోను. ధనమదగర్వితులై నయువకులు తనతల్లిపై చెయ్యెత్తినంత దుఃఖముకలిగింది కాళీపదకు. కాళీపద ఇన్నాళ్లూ ఆ మెస్‌లో ఉన్నాడు గాని ఒకనాడైనా ఆ మెట్లమీద అడుగు పెట్టలేదు. ఒంటిమీద ఇప్పుడు చింకిబనియను, కాళ్ళకు జోళ్లు లేవు, తలనొప్పి బాధవల్లా, మనస్సులో పుట్టిన ఉద్రేకము వల్లా ముఖము ఎర్రగాఅయిపోయిఉన్నది. మేడ ఎక్కాడు. ఈవాళ ఆదివారము, స్కూలుకుబయలుదేరే హడావిడి లేదు. కుర్రవాళ్ళందరూ, కొందరు కుర్చీలమీదా, కొందరు బెత్తు స్టూల్లమీదా వరండాలోకూర్చొని హాస్యాలాడుకొంటు న్నారు. కాళీపద వాళ్లమధ్యకువచ్చిపడి, గద్గదస్వరముతో, బహుఉద్రేకముతో నానోటు నాకు ఇచ్చేయండి," అని అన్నాడు.

కాళీపద బ్రతిమాలుకొంటూ అడిగిఉంటే, కృతా-ర్థుడు అయిఉండును, సందేహములేదు. కాని ఒంటిమీద తెలివి లేకుండా రౌద్రుడయి అడగడము చూచేసరికి శైలేన్‌కి పిచ్చె త్తింది; దర్వాన్‌దగ్గరఉంటే కాళీపదను చెవిపట్టుకొని పైకి ఈడ్చుకుపొమ్మని ఆ దర్వాన్‌తో చెప్పిఉండును, సందేహము లేదు. అందరూ లేచి నిలబడి, "ఏమిటి మీ రనేది! ఏమినోటు!" అంటూ అంతా ఒక్కకంఠంతో గర్జించారు.

"నా పెట్టెలో నోటు మీరు తీశారు," అన్నాడు కాళీపద.

"ఏమిటవీ! మమ్మల్ని దొంగలంటారా?"

కాళీపదచేతిలో ఆక్షణములో ఏదైనా ఉంటే ఒకొక్కడిని పట్టుకొని అందరితలలూ పగలగొట్టిఉండును. అతని ధోరణి చూచి నలుగురైదుగురుకుర్రవాళ్ళు అతనిచేతులు గట్టిగా పట్టుకొన్నారు. వలలోచిక్కుకొన్నపులిలాగు కాళీపద గర్జించడము మొదలుపెట్టాడు.

ఈ అన్యాయానికి తగిన ప్రతీకారము చేదామంటే కాళీ-పదకు ఎటువంటిప్రమాణమూ లేదు. ప్రమాణము ఉన్నా శక్తిలేదు—ఎవరు విన్నా మతిలేని మాటలు పోనిత్తురూ అనే-స్తారు. అతనిమీద మరణబాణము వదిలినవాళ్ళు అతని గర్వము చూచి సహించలేక చస్తున్నారు.

కాళీపదకు ఆరాత్రి ఏలాగు గడచిందో ఎవరికీ బోధపడ లేదు. శైలేన్ నూరురూపాయిలనోటుఒకటితీసి, "ఆపశువు ముఖానకొట్టండి," అంటూ తన సహచరులమీద పారేశాడు.

"నీకేమి వెర్రా!" అని స్నేహితులు అన్నారు, "ముందు ఆ పొగరు కొంచెము అణగనీ—మనందరికీ ఒక రిటన్ ఎపాలొజీ *ఇయ్యనీ తరవాత ఆలోచింతాము," అన్నారు.

*Written apology వ్రాతమూలముగా కోరినక్షమాపణ.

కొంచెము సేపయినతరువాత అంతా పడుకోడానికి వెళ్లి-పోయినారు, నిద్రరావడానికికూడా అట్టేసేపు పట్టలేదు. ఉదయం నిద్ర లేచేసరికి ఎవరికీ కాళీపదమాట జ్ఞాపకమే లేదు. వాళ్లల్లో కొందరు మెట్లుదిగుతూఉండగా కాళీపదగదిలోనుంచి మాటలు వినబడ్డవి—కాళీపద ప్లీడర్ని సలహాకై తీసుకువచ్చి అతనితో మాట్లాడుతున్నాడు గాబోలు అని అనుకొన్నారు. తలుపు, లోపలనుంచి గడియవేసి ఉన్నది. తలుపుమీాద చెవి పెట్టి విన్నారు, కోర్టుమాటలూ, 'లా' మాటలూ, వినబడలేదు. మాటతో మాటకు సంబంధంలేని కలవరింతలాగు వినబడ్డది.

మీాదికి వెళ్లి శైలేన్‌తో ఆ మాట చెప్పారు. శైలేన్ దిగివచ్చి ఆ తలుపుదగ్గిర నిలబడ్డాడు. కాళీపద అంటున్న-మాటలు స్పష్టముగా వినబడడములేదు, ఉండుండిమాత్రము "నాన్నా" "నాన్నా" అని కేకలు వినబడుతున్నవి.

భయము వేసింది. ఆనోటు పోయిందని దుఃఖమువల్ల పిచ్చెత్తిపోయినాడేమోఅని జడిశాడు శైలేన్; బయటనుంచి రెండుమూడుమార్లు," కాళీపదబాబూ,"అని పిలిచాడు. లోపు-నుంచి జబాబు లేదు, బడబడ మని వేలాపనమాత్రము వినబడు తున్నది. శైలేన్ గొంతుకఎత్తి తిరిగి పిలిచాడు—"కాళీ-పదబాబూ, తలుపు తియ్యండి, మీా యాభైరూపాయిల-నోటు దొరికింది," అని అన్నాడు, తలుపువిడలేదు. లోపలి

గోణగోణమాత్రము ఆగలేదు. ఈకథ ఇంతదూరము వరకూ వెళ్లుతుందని శైలేన్ ఎన్నడూ ఊహించలేదు. అతని నోటివెంట అనుతాపవాక్యాలేమీరాలేదు గాని మనస్సులో మాత్రము బాధపుట్టింది. "తలుపు విరగకొట్టేదాము," అన్నాడు శైలేన్ స్నేహితులతో. ఒకొక్కడు ఒకొక్కమో. స్తరు అన్నారు—"పోలీసువాళ్ళను తీసుకువద్దాము," "ఔను, పిచ్చెత్తి హఠాత్తుగా ఏమైనా చేస్తే!" "నిజమే నిన్నను ఏమి-చేయబోయినాడో చూడండి!" "అవును బాబూ, మనతరము కాదు!"

"ఎవరైనా ఒకరు తక్షణము వెళ్లి అనాదిబాబు డాక్టర్‌ను తీసుకురండి," అని అన్నాడు శైలేన్. అనాదిబాబు ఇల్లు అక్కడికి దగ్గరే. డాక్టర్ వచ్చి తలుపుదగ్గిర చెవిపెట్టి విన్నాడు. విని, "ఇది జ్వరవికారములాగు కనబడుతున్నది," అని అన్నాడు.

తలుపువిరగగొట్టి లోపల ప్రవేశించారు. పక్కఅంతా-కలగాపులగమయి సగము మంచముమీద సగం కిందా పడిఉన్నది. కాళీపదకూడా కిందే పడిఉన్నాడు, ఒంటి-మీద తెలివి లేదు, ఇటూఅటూ దొర్లుతున్నాడు, కాళ్లూ చేతులూ ఉండిఉండి కొట్టుకొంటున్నాడు, ఏక కలవరిస్తు న్నాడు, కళ్లురెండూ తెరిచేఉన్నవి, ఎర్రగానిప్పులలాగు కనబడుతున్నవి, పగిలి వాటిలోపలనుంచి రక్తము బయటికి వస్తున్నదన్నట్లు కనిపిస్తున్నవి.

డాక్టరు అతని ప్రక్కను కూర్చొని చాలాసేపు పరీక్షచేసి. శైలేన్‌ని అడిగాడు—"ఇతనికి కావలసినవాళ్లు మీ రెరిగిన వాళ్లు, ఎవరైనా ఉన్నారా?"

శైలేన్ ముఖాన రక్తము లేదు. "ఏమండీ, ఎందుకు ఆలాగు అడుగుతున్నారు?" అని అడిగాడు.

"సంగతి తెలియజేయడము మంచిది, లక్షణాలేవీ బాగు లేవు," అన్నాడు డాక్టర్.

శైలేన్ అన్నాడు, "ఇతనితో మాకు ఆట్టే పరిచయము లేదు. బంధువులమాట మాకేమీ తెలియదు, కనుక్కుంటాము. ఈలోపున చేయవలసిన దేదో చెప్పండి."

"మేడమీద ఒక మంచి గది చూచి ఇతనిని తక్షణమే ఈ గదిలోనుంచి తీసుకువెళ్లిపోవాలి, రాత్రీపగలూ దగ్గిర ఎవరైనా ఉండి అతనికి సేవచేస్తూఉండే ఏర్పాటుచేయాలి," అన్నాడు డాక్టర్.

శైలేన్ జబ్బుమనిషిని తనగదిలోకి తీసుకువెళ్లాడు. తన జట్టువాళ్లను దగ్గిర మూగవద్దని చెప్పి ఆ గదిలోనుంచి పంపించేశాడు. కాళీపద తలమీద ఐస్‌భ్యాగ్ *పెట్టి దగ్గిర కూర్చొని తనచేతితో తానే విసరడము మొదలుపెట్టాడు.

మేడమీది సంఘమువాళ్లు వేళాకోళము చేయవచ్చును, లేక అవమానపరచవచ్చును అనే భయముతో కాళీపద తన

*మంచుతో నింపిన రబ్బరు సంచి.

తల్లిదండ్రులసంగతి కొంచెమైనా వాళ్ళకు తెలియనియ్యలేదు. తన ఉత్తరాలు తానే స్వయముగావెళ్లి పోస్టాఫీసులో వేసి వచ్చేవాడు; తనకు వచ్చే ఉత్తరాలు పోస్టాఫీసు పై విలాసానికే తెప్పించుకొని తానే స్వయముగా వెళ్లిపుచ్చుకొనేవాడు.

కాళీపదస్వస్థలము ఎక్కడో తెలుసుకొందామని అతని పెట్టె మరిఒకమారు తెరిచారు! పెట్టెలో రెండు ఉత్తరాల కట్టలు కనబడ్డవి. ఒకదానిలో తల్లిఉత్తరాలు, రెండోదానిలో తండ్రిఉత్తరాలు. తల్లిఉత్తరాలు చాలాతక్కువ, తండ్రి వ్రాసినవి మాత్రము అనేకము.

శైలేన్ ఉత్తరాలు పట్టుకొని మేడమీదికి వచ్చాడు; తలుపు గడియవేసి, జబ్బుమంచము ప్రక్కను కూర్చొని ఒకొక్కటి చదువుదామని మొదటి ఉత్తరము తీశాడు. ఉత్తరాలు ఎక్కడనుంచి వచ్చినవో ఆ విలాసము చూచి నిర్ఘాంతపోయినాడు—'శానియాడి చౌధరీగృహము'- క్రింద సంతకము చూచాడు—'భవానీచరణదేవశర్మ'—భవానీచరణచౌధరి!

శైలేన్ ఉత్తరముక్రిందపెట్టి స్తబ్ధుడయి కాళీపదముఖమువైపు చూస్తూ కూర్చున్నాడు. కొన్నాళ్ళక్రిందట ఒకనాడు తన బృందములోవాడు ఎవడోఒకడు కాళీపదముఖములో తన ముఖముపోలిక కొంచెము ఉన్నదని అన్నాడు. శైలేన్‌కి ఆమాట రుచించలేదు, తక్కినవాళ్లుకూడా విని నవ్వేశారు.

దానిలో కొంతనిజము లేకపోలేదు అని శైలేన్‌కి ఈవాళ బోధపడ్డది. తనతాత శ్యామాచరణ్‌కు, భవానీ అనే తమ్ముడుండేవాడని శైలేన్ ఎరుగును. కాని తన తండ్రి కాలములో జరిగిన కథలుమాత్రము వాళ్ళఇంట్లో ఎప్పుడూ చెప్పుకొంటూఉండలేదు. భవానీచరణుకు కొడుకున్నాడనీ, ఆకొడుకుపేరు కాళిపద అనీ అతనికి తెలియనే తెలియదు. ఈ కాళీపద తనపినతండ్రా!

అప్పుడు మెల్లిమెల్లిగా శైలేన్‌కి జ్ఞాపకమువచ్చింది. అతని నాయనమ్మ, అనగా శ్యామాచరణుభార్య, బ్రతికిఉన్నంత కాలమూ అతిప్రేమతో భవానీమాట చెపుతూఉండేది. భవానీచరణ్ పేరుఎత్తేసరికి ఆమెకళ్ళవెంట నీళ్లువచ్చేవి. భవాని ఆమెకు మరిదిఅవుతాడు గాని అతడు తనకొడుకుకంటె వయస్సులో చిన్న. భవానీని ఆమె తనకొడుకులాగే పెంచి పెద్దవాడినిచేసింది. తనకొడుకూ, భవానీ వేరుఅయిపోయినప్పటినుండీ భవానీసమాచారము ఏమైనా తెలుస్తుందేమోఅని నాయనమ్మప్రాణము కొట్టుకుపోయేది.నాయనమ్మ తనకొడుకులతో అనేకసార్లు అన్నది—"భవానీ అమాయకుడనీ, అతిసాధువనీ పోల్చుకొని మీరు అతనిని మోసపుచ్చారు—నాకు తెలుసును. మామగారికి అతనంటే ఎంతో ప్రేమ,మామగారు అతనికి అస్తేమీ ఇయ్యకుండా ఉంటారని నేను ఎన్నటికీ నమ్మను." ఆ మాటలు వినేసరికి కొడుకులకు మహాకోపము వచ్చేది నాకుకూడా

కోపమువచ్చేది. ఆమాట ఇప్పుడు జ్ఞప్తికి వస్తూఉన్నది. తల్లి ఆలాగు భవానీపక్షము మాట్లాడమువల్ల కొడుకులకు భవానీమీద ద్వేషము పుట్టింది. భవానీ ఇప్పుడు ఇంత దారిద్ర్యావస్థలోఉన్నాడని శైలేన్‌కు తెలియదు. కాళీపద అవస్థ చూచి అంతా పోల్చుకొన్నాడు. కాళీపదకు ప్రలోభము కలిగేటట్టు ఎంతప్రయత్నముచేసినా, కాళీపద శైలేన్ బృందములో చేరలేదు. ఆ మాట ఈవాళ జ్ఞాపకము తెచ్చుకొని తనకు చాలాగౌరవము కలిగింది అనుకొన్నాడు, శైలేన్. కర్మముచాలక కాళీపద శైలేన్ అనుచరబృందములో చేరి ఉన్నట్టయితే ఈవాళ శైలేన్ సిగ్గుపడవలసి ఉండును.

శైలేన్‌సంఘమువాళ్లు కాళీపదను ఇన్నాళ్ళూ పీడిస్తూ వచ్చారు, అవమానపరుస్తూవచ్చారు. అటువంటి శత్రువాళ్ళ మధ్యను తనపినతండ్రిని ఉంచడానికి శైలేన్‌కి ఇప్పుడు ఏమీా ఇష్టంలేకపోయింది. డాక్టర్ సలహాతీసుకొని కాళీపదను అతి జాగ్రత్తగా మరిఒక మంచి ఇంటికి తీసుకువెళ్లిపోయినాడు.

శైలేన్ వ్రాసినఉత్తరము అందగానే భవాని ఒకరిని జెట్టుతీసుకొని తక్షణమే కలకత్తావచ్చాడు. రాసమణి చాలా గాబరాపడ్డది, అతికష్టముమీాద తాను కూడబెట్టిఉంచిన సొమ్ములో చాలాభాగము భర్త కలకత్తా వెళ్లుతున్నప్పుడు అతనిచేతిలో పెట్టి, 'ప్రమాదముగాఉంటే నాపేర వ్రాయండి, తక్షణమే వస్తాను', అని చెప్పింది. చౌధరీవంశపుపద్ధతులకు

కేవలము విరుద్ధము—అందుచేత కబురు వినగానే రాసమణి కొడుకును చూడడానికి వెళ్ళలేకపోయింది. రాసమణి రక్ష-కాళీకి ముడుపుకట్టింది, గ్రహాచార్యులను పిలిపించి స్వస్తి వాచనముచదివించే ఏర్పాటు చేయించింది.

కాళీపదస్థితి చూచేసరికి భవానీకి మతి పోయింది. అప్ప-టికి కాళీపదకు ఇంకా బాగా తెలివిరాలేదు. తండ్రినిచూచి "మాస్టరుగారూ," అని పిలిచాడు. విని భవానీగుండె బద్దలై-పోయింది. కాళీపద ఉండుండి 'నాన్నా' 'నాన్నా' అని కలవ-రిస్తుండెను—భవానీ కొడుకుచెయ్యి పట్టుకొని, అతనిముఖ-ముదగ్గిర తనముఖము పెట్టి, "ఇదుగో, నాన్న; నేను వచ్చాను నాయనా, చూడు నావేపు," అని అన్నాడు. కాని తండ్రిని పోల్చుకోనట్లు చేష్టలవల్ల స్పష్టము.

డాక్టర్ వచ్చి చూచి అన్నాడు—"జ్వరము మునపటి-కంటె కొంచెము తగ్గింది, జబ్బు తిరుగుముఖము అయిందను కొంటాను." కాళీపదజబ్బు బాగుకాదని భవాని ఎన్నటికీ నమ్మ లేదు. చిన్నప్పటినుంచీ అంతా అంటూవచ్చారు, "కాళీపద పెద్ద అయి ఏదో గొప్పపనిఒకటి సాధించితీరుతాడు," అని. కేవలము లోకులనోటివెంట వినడమువల్ల భవానీలోపుట్టిన నమ్మకము కాదు ఇది, ఆ నమ్మకము అతని స్వభావములోని ఒకభాగము—కాళీపద బాగుఅయితీరవలెను అది అతనినొసట వ్రాసిఉన్న వ్రాత అని తండ్రి నమ్మకము.

అందుచేత డాక్టర్, 'కొంచెముబాగున్నది,' అని చెప్ప గానే భవానీకి 'చాలాబాగున్నది' అన్నట్టు వినబడేది. రాస మణికివ్రాసిన ఉత్తరాలలో అనుమానమేమీ లేకుండా వ్రాసే వాడు.

శైలేంద్రవ్యవహారముచూచి భవాని మిక్కిలి ఆశ్చర్య పడ్డాడు, అతడు తమకు దగ్గిరవాడు, పరమమిత్రుడు, కాడని ఎవరైనా అనగలరూ! కలకత్తాలో అంతపెద్దచదువు చదువు-తున్న గొప్పఇంటిపిల్లడైనా శైలేన్ ఆలాగు భక్తిశ్రద్ధలు కన పరచడము చూచి అటువంటివాడు మరి ఎక్కడా ఉండడను కొన్నాడు భవానీ మొదట, తరువాత కలకత్తాలోఉండే విద్యార్థులంతా అదేమోస్తరుకాబోలు అని అనుకొన్నాడు. "అవును, కాక మరేమిటి, మా ఊరికుర్రవాళ్ల శిక్షణేమిటి వాళ్ల సహవాసమేమిటి !" అని తిరిగి తనలోతాననుకొన్నాడు. కాళీపదకు జ్వరము కొంచెము తగ్గడము ఆరంభించింది, మెల్లిమెల్లిగా చైతన్యముకూడా వస్తున్నది, మంచేము ప్రక్కను తండ్రి కూర్చున్నాడని పోల్చుకోగానే ఉలికిపడ్డాడు కాళీపద. తన కలకత్తాఅవస్థ తండ్రిదగ్గిర ఇక మరి దాగదని తెలుసుకొని కంగారుపడ్డాడు. అన్నిటికంటె అతనికిఉండే పెద్ద భయము ఏమిటంటే పల్లెవాసిఅయిన తన తండ్రిని ఆ పట్టణపు కుర్రవాళ్లు పరిహాసముచేస్తారేమో అని. కాళి కళ్లు బాగా తెరిచి నాలుగువైపులా చూచాడు, ఇప్పుడు తాను ఉన్నది

ఏగదో పోల్చుకోలేకపోయినాడు, కనబడుతున్నది కలా నిజమా అని అనుమానించాడు.

బాగా ఆలోచించడానికి తగినశక్తి ఇప్పుడు అతనిలో లేదు; జబ్బుమాట విని తండ్రి వచ్చి ఒక మంచి బసలోకి తనను తీసుకవచ్చాడు అని ఊహించాడు. ఏలాగు తీసుకు వచ్చాడు, ఖర్చులకు రూపాయిలు తండ్రి ఎక్కడనుంచి తీసుకువచ్చాడు, ఈ లెక్కను ఖర్చుపెడుతూఉంటే ముందుకు ఎటువంటిచిక్కులలో పడవలసివస్తుందోకదా!—ఈలాంటి నానాప్రశ్నలనుగురించి ఆలోచించే సమయముకాదు ఇది. ఇప్పుడు అన్నిటికంటె ముందుజరగవలసినది తాను బాగయి లేవడము—తాను బాగయేవ్రూచీ సమస్తపృథ్విపై ఉన్నట్టు కాళీపదకు ఇప్పుడు తోచింది.

భవాని గదిలోలేనప్పుడు ఒకరోజున శైలేన్ పళ్లు కొన్ని ఒక పళ్లెములో పేర్చి తీసుకవచ్చి కాళీపదదగ్గిర నిలుచున్నాడు. కాళీపద నిశ్చేష్టుడయి అతనిముఖమువైపు చూస్తూ, ఇది తనను వేళాకోళముచేయడానికి తీసుకవచ్చాడా అని అనుమానించి తండ్రిని ఏలాగైనా అతనిచేతులలో నుంచి తప్పించవలెనని అనుకొన్నాడు. మొట్టమొదట శైలేన్ ఆ పళ్లు టేబిలుమీద పెట్టి కాళీపదకాళ్లకు దండము పెట్టి, "నేను మహాఘోరమైన అపరాధముచేశాను, నన్ను క్షమించు" అని వేడుకొన్నాడు.

కాళీపదకేమీ బోధపడలేదు, కంగారుపడ్డాడు; శైలేన్ ముఖమువంక చూచాడు, అందులో ఎటువంటి కపటమూ లేదు! కాళీపద మొట్టమొదట ఆ మెస్‌లోకివచ్చినప్పుడు యౌవనదీప్తితో ప్రకాశిస్తూఉన్న శైలేన్ ముఖశ్రీ అతనిని చాలా ఆకర్షించింది, గాని తాను నిరుపేద గనుక సంకోచించి ఎన్నడూ ఆతనిదగ్గిరికి వెళ్ళలేదు. ఇద్దరూ సమశ్రేణివాళ్లయి ఉండి కాళీపద సహజముగా అతనితో కలిసిమెలసి ఉండగలిగితే అతడికి చాలా ఆనందముగానే ఉండిఉండును. కాని ఇప్పుడు అతడు కాళీపదకు అంతదగ్గిరవాడైనా వాళ్ళిద్దరి మధ్యనూఉన్న దూరము అపారమైనది కావడముచేత అది దాటేఉపాయమేదీ కాళీపదకు కానరాలేదు. శైలేన్ మెట్లుఎక్కుతున్నప్పుడూ దిగుతున్నప్పుడూ అతని కండువాకుండే సుగంధము కాళీపద చీకటిగదిలోనికి వచ్చేది. అటువంటప్పుడు చదువుతున్నపుస్తకము ప్రక్కనుఉంచి చిరునవ్వుతో వికసిస్తూన్న ఆలేతముఖాన్ని చూస్తేనేగాని కాళీపద ఉండలేకపోయేవాడు. అటువంటప్పుడు ఒక్కక్షణకాలముపాటైనా ఆ మూలనున్న చెమ్మగదిలోకి, దూరాన ఉన్న సౌందర్యలోకములోనుంచి ఐశ్వర్యరశ్మి వచ్చిపడేది. తరువాత శైలేన్‌యొక్క నిర్దయా, దారుణ్యమూ కాళీపదను ఏలాగుబాధిస్తూవచ్చినవో అందరికీ తెలిసినవిషయమే. ఈవాళ చేతిలో ఆపల్లెము పట్టుకొని శైలేన్ మంచముదగ్గిర నిలుచొనేసరికి కాళీపద నిట్టూర్పువిడిచి ముఖముఎత్తి, అతనిచక్కని ముఖమును బాగా కళ్లువిప్పి

చూచాడు. కాళీపద క్షమించడము మాట ఏమీ అనలేదు, ఆ పళ్లు ఒక్కొక్కటి తీసి తినడము మొదలుపెట్టాడు—చెప్ప వలసినదేదో దీనిమూలముగానే చెప్పాడు, కాళీపద.

పల్లెటూరి సరళ స్వభావము తన తండ్రిది. ఆ సత్య కాలపురుషునిషిలోనూ శైలేన్‌లోనూ క్రమక్రమముగా అన్యోన్యప్రేమ పెరుగుతూఉండడము కాళీపద ఆశ్చర్య పడుతూ రోజూ చూస్తూఉండేవాడు. శైలేన్ భవానీని 'తాతగారు,' అని పిలుస్తూ'ండేవాడు, ఇద్దరూ హాస్యాలాడు కొంటూఉండేవారు. ఆ హాస్యాలు ముఖ్యముగా దగ్గరలేని 'నాయనమ్మ'ను గురించేను. హాస్యలోకమునుండి దక్షిణవా యువు వచ్చి భవానీమనస్సును చిన్ననాటికథలతో నింపి, ఇన్నా ళ్లకు అతనిలో పులకరింపు పుట్టించింది.

కాళీపద అజాగ్రత్తగాఉండడము చూచుకొని నాయనమ్మపంపిన ఆవకాయలూ, పచ్చళ్లూ మధ్యమధ్య ఫల హారముచేస్తూవచ్చాననని సిగ్గేమీ లేకుండా భవానీఎదుట శైలేన్ ఒప్పుకొన్నాడు. ఈదొంగతనముమాట వినగానే కాళీపదమనస్సులో ఒకవిధమైన ఆనందము పుట్టింది—తన తల్లి అతనికొరకు చేసిన వస్తువులలోని ప్రేమువిలువ పోల్చుకోగల వాళ్లందరిచేతనూ వాటిని తినిపిద్దామనే కాళీపద కోరిక. ఆనాడు ఆ జబ్బుగది కాళీపదకు ఒక ఆనందసభవలె కనబడ్డది. ఆనాడు అతనికి లభించిన ఆనందము వంటిది జీవనములో అతనికి అతిస్వల్పముగా ప్రాప్తించింది.

"ఆహా ఈవాళ అమ్మ ఇక్కడ ఉంటేనా!" అని మాటిమాటికీ కాళీపద తనలోతా ననుకొంటున్నాడు, కుతూహలముతో వికాసముపొందిన ఆ చెక్కని యువకుని చూస్తే తనతల్లి ఎంత ముద్దుచేసునో అని తనలోతాను ఊహిస్తూ కూర్చున్నాడు.

ఆ జెబ్బుగదిసభలో ప్రవహిస్తూఉన్న ఆనందానికి మధ్య-మధ్య అడ్డుగావస్తూఉండే ప్రసంగము ఒకటిమాత్రము ఉండేది. కాళీపదలో తనలేమినిగురించి ఒక గర్వము ఉండేది—తాము ఒకప్పుడు మహాధనికులము అని బడాయికొట్టుకోవడమంటే సిగ్గుపడవలసినవాడు కాళీపద. "మేము నిరుపేదలము," అని ఎట్టి సంకోచమూ లేకుండా చెప్పేవాడు, ఆసంగతిని ఎటువంటి 'గాని'నైనా పెట్టి దాచేడానికి కాళీపద ఒప్పుకొనేవాడు కాడు. భవానీచరణ్, తమపూర్వపుఐశ్వర్యముమాట హాఠాత్తుగా మధ్యమధ్యను ఎత్తుతుండేవాడని కాదు పై దానిఅర్థము. కాని భవానీకి మంచిరోజులంటూ ఉండేవి, అతని యౌవనావస్థ బహు గొప్పగా గడిచింది. అప్పటికింకా విశ్వాసఘాతమువలన లోకముయొక్క కురూపము అతనికి కనపడలేదు. పైగా అప్పుడు ఇంటికిపెద్ద రమాసుందరి, అన్న-శ్యామాచరణునిభార్య, ప్రేమతోనిండిఉన్నహృదయము ఆమెది. ఆమె గృహిణిగా ఉన్నప్పుడు ఆ ఇంటివాళ్లందరూ లక్ష్మితోనిండియున్న ఆ భాండాగారద్వారముదగ్గిర నిలబడి ఆ సాధ్వీమణి ప్రేమరసాన్ని అమితంగా తాగేవాళ్లు. ఆ గతించిన సుఖదినములస్మృతే భవానీజీవనసంధ్యకు బంగారువన్నెనిస్తూ

న్నది. కాని ఈ చిన్ననాటి ఆనందములోనికీ సుఖములోనికీ ఆ చొరిపోయిన వీలువార్త ఎలాగో వచ్చిదూరేది. వీలుమాట రాగానే భవాని బహుఉద్రేకముతో లేచేవాడు. ఆ వీలు నోరుకు తుంది అనే నమ్మకము ఇప్పటికీ భవానిని వదలలేదు. దొరకక పోవచ్చునేమో అనే సందేహమే అతనికిలేదు. పరమపతివ్రత అయిన తనతల్లిమాట నిష్ఫలము కానేరదు! ఈ ప్రసంగము రాగానే కళీపదమనస్సుకు కష్టముకలిగేది. ఇది తన తండ్రియొక్క ఒకపిచ్చి నమ్మకము. తల్లీకొడుకూ ఇద్దరూకలిసి ఎవరూలేనప్పుడు భవానీపిచ్చిమాటలకు అసమ్మతి కనపరుస్తుండేవారు. కాని శైలేన్ ముందర తండ్రి పిచ్చి ఈవిధముగా బయలుపడడము చూస్తే కాళీపదకు చాలా కష్టముగాఉండేది. "లేదు నాన్నా, అది నీ ఉత్తకోరికేగాని మరేమీ కాదు!" అని కాళీపద అనేకసార్లు అన్నాడు, గాని దానిఫలము కాళీపద అనుకొన్నదానికి వ్యతిరేకము అయేది, తాను అకారణముగా ఆశిస్తూ కూర్చోలేదని నచ్చచెబుతూ భవానీ అనేకమయినప్రమాణాలు చూపించి తా నెరిగినదానిలో ఒక్కముక్క విడవకుండా పూర్తిగా చెప్పేవాడు. కథ ప్రారంభమయినతరువాత తండ్రిని ఆపడము కాళీపదతరము కాదు.

ఈ ప్రసంగము వచ్చినప్పుడల్లా శైలేనుకు ముఖ్యముగా చాలాకష్టముగా ఉన్నదని కాళీపద కనిపెట్టాడు. శైలేన్ కూడా కొంతఉద్రేకముతో భవానీవాదనను ఖండించ ప్రయత్నముచేస్తుండేవాడు. అన్నివిషయాలలోనూ భవాని

ఇతరులఅభిప్రాయాలతో ఏకీభవించడానికి సంసిద్ధుడే, కాని ఈ విషయములలోమాత్రము ఓడిపోవడానికి ఒప్పుకోవలసినవాడు కాడు. చదువ్రాత తెలిసినది అతని తల్లి, ఆమె తనచేతులతో తానే స్వయముగా ఆపీలును, తక్కినపత్రాలతో, సందుగు పెట్టెలో ఉంచి అది ఇనపబీరువాలోపెట్టి తాళమువేసింది; తరువాత ఆ బీరువా అతనిముందరనే తీసింది. అందులో పత్రాలన్నీ, ఉన్నవిఉన్నట్టుగానే, ఉండెను, ఆపీలుమాత్రము లేదు—ఇది చోరీ కాక మరిఏమిటి?" "అయితే నేమి నాన్నా, నీ ఆస్తి అనుభవిస్తూన్న వాళ్లు నీబిడ్డలన్నమాటే కదా, వాళ్లు నీఅన్న కొడుకులుకారూ! ఆడబ్బు మీనాన్నగారి వంశములోనే ఉన్నది, దానివల్లు ఏమి తక్కువ ఆనందమా?" అని తండ్రిని శాంతిపరుస్తూ కాళీపద అనేకమార్లు అన్నాడు. ఈమాటలన్నీ చాలాసేపు సహించి ఉండలేక, శైలేన్, గదిలోనుంచి వెళ్లిపోయేవాడు. భవాని బహు డబ్బుకాంక్షగల మనిషి అని శైలేన్ అనుకొంటాడేమోఅని కాళీపదకు చాలా బాధగాఉండేది. తనతండ్రిఉండేవైపుకు డబ్బుయొక్క వాసనైనా రాదు అనేసంగతి శైలేన్‌కి నచ్చచెప్పగలిగితే కాళీపదకు ఎంతోమనశ్శాంతి కలిగిఉండును!

ఈపాటికి, శైలేన్ తానెవరో కాళీపదభవానీలకు తెలియచేసే ఉండును, గాని ఈ చోరీపీలు వచ్చి మధ్యఅడ్డుపడేది. తన తండ్రీ తాతా కలిసి ఆ పీలు దొంగలించారని శైలేన్ మనస్సు ఒప్పుకోకుండా ఉన్నది, గాని భవానీకి తనతండ్రి

ఆస్తిలో సరియైనవంతు రాకపోవడము గొప్పఅన్యాయము కాదనిమాత్రము అనలేకపోయేవాడు, ఆ విషయమయి ఎటువంటి వాదనా కూడదు అని నిశ్చయించుకొన్నాడు. ఆప్రసంగము వస్తే శైలేన్, ఏమీ మాట్లాడకుండా కూర్చుండే వాడు, కొంచెముసేపు కూర్చొని ఏదోనెపంమీద బయటికి వెళ్లిపోయేవాడు.

ఇప్పటికీ, కాళీపదకు మధ్యాహ్నము కొంచెము జ్వరము తగిలి తల నొప్పిగా ఉండేది. కాని అతడు దానిని ఒక జబ్బుకింద లెక్కపెట్టలేదు. తిరిగి చదువుఆరంభించాలని చాలా కష్టార్తిగా ఉన్నది కాళీపదకు. ఒకమాటు స్కాలర్‌షిప్ పోయింది, ఈ మాటుపోతే కథ మరి నడవదు; శైలేనుకు తెలియకుండా చదువు మొదలు పెట్టాడు. డాక్టర్ చదువుకూడదని గట్టిగా చెప్పినా, ఆమాట లక్ష్యపెట్టక చదువుప్రారంభించాడు.

ఒకనాడు కాళీపద భవానీతో అన్నాడు, "ఇక నువ్వు ఇంటికి వెళ్లిపో నాన్నా; అమ్మఒక్కర్తే ఉన్నది నాఒంట్లో మరేమీ జబ్బులేదు!"

శైలేన్‌కూడా అన్నాడు, "ఇక మీరు వెళ్లిపోవచ్చును, మరేమీ భయములేదు, మరి రెండురోజులలో బాగా తేరి పోతాడు. ఇంతకూ మేమంతా ఇక్కడ ఉన్నాము కదూ"

"అది నిజమే, కాళీపదనుగురించి గాబరాపడడము అనవసరమే. నేను కలకత్తా రావడమే అనవసరమని నాకిప్పుడని

పిస్తూ ఉన్నది, కాని మనస్సు మనస్సు కదా ఒప్పుకుంటుందీ! పైగా మీ 'నాయనమ్మ' ఏదైనా అనుకొన్నతరువాత వదలే మనిషి కాదు!" అని అన్నాడు భవాని.

"ముద్దు చేసిచేసి పాడుచేసేశావు నాయనమ్మను," అని శైలేన్ నవ్వుతూ అన్నాడు.

"సరే నాయనా, ఇంటికి మనుమరాలు రాదా, అప్పుడు చూదాము నీ అధికారము ఎంతతీవ్రముగా ఉంటుందో!" అని నవ్వుతూ 'తాతగారు' జబాబు చెప్పారు.

కేవలము రాసమణిసేవవల్ల సురక్షితముగా ఉన్న జీవుడు భవాని. రాసమణిసంరక్షణ లేకపోవడమువల్ల కలకత్తాలో ఎన్ని సదుపాయాలున్నా, ఎన్ని వింతలూ, తమాషాలూ ఉన్నా భవానికిమాత్రము సౌఖ్యము లేదు. అందుచేత భవానిని ఇంటికి వెళ్లిపోమని అంతగా బ్రతిమాలే అవసరము లేకపోయింది.

భవాని ప్రొద్దున్నే సామానంతా మూటకట్టుకొని 'కాలీ' పదగదిలోకి వెళ్లేసరికి పిల్లవాడి ముఖము ఎఱ్ఱగాకనబడ్డది. దగ్గరికి వెళ్లే ఒంటిమీద చెయ్యివేసి చూచాడు. ఒళ్లుఅగ్గినిప్పు; కాలీపద అర్ధరాత్రిదాకా కూర్చొని లాజిక్ కంఠోపాఠంచేస్తుండెను. తరువాత మరి నిద్రపట్టలేదు.

అబ్బాయి జబ్బు పూర్తిగా పోలేదు. బలహీనతపైని కొంచెముపరిశ్రమచేయుగానే జబ్బుతిరగవేసింది. డాక్టరు చూచి చాలావిచారించి శైలేన్‌ని బయటికిపిలిచి, "జబ్బుసమాచారం

ఏమీ బాగుండలేదు," అని అన్నాడు. శైలేన్ లోనికివచ్చి భవానితో, "చూడుతాతా, నీకా కావలసినంత కష్టముగా ఉన్నది, రోగికా కావలసినంత సుఖము లేదు, ఇక మరి ఆలస్యము చేయకుండా నాయనమ్మను తీసుకువస్తే బాగుంటుందను కొంటాను" అని అన్నాడు.

జబ్బుమాట శైలేన్ ఎంతదాచిఉంచినా భవానీకి గొప్ప భయముకలిగింది, అతనికాళ్లూ చేతులూ వణకడము మొదలు పెట్టినవి. "ఏదిబాగుంటుందని తోస్తే ఆలాగే చేయి బాబూ," అని అన్నాడు.

రాసమణికి ఉత్తరము వెళ్లింది, ఉత్తరము అందగానే బగలాచరణుని సాయముతీసుకొని బయలుదేరి కలకత్తా వచ్చింది, సాయంత్రము కలకత్తాచేరి, జీవముతో ఉండగా కొడుకును రెండుమూడు ఘుంటలు మాత్రము చూడగలిగింది. కొడుకుఒంటిమీద తెలివిలేదు, "అమ్మా" "అమ్మా" అని కలవరిస్తున్నాడు. ఆ మాటలువచ్చి బాణాలవలె తల్లిహృదయానికి తగులుతున్నవి.

భర్త ఈబాణాలదెబ్బలకు, సహించి బ్రతికి ఉండలే డనే భయముచేత రాసమణి తనదుఃఖాన్ని పైకిరానియ్యడము లేదు. ఇప్పుడు తనకొడుకు కూడా భర్తలో లీనమయిపోయి నాడు. తనభారమూ భర్తభారమూ కూడా రాసమణి తన

మీదనే వేసుకొన్నది. "నేను మరి భరించలేను," అని లోపల నుంచి ప్రాణముఅంటూ ఉన్నది; కాని భరించక తీరిందికాదు.

అర్ధరాత్రివేళ. విరామము లేకుండా బాధిస్తూ ఉన్న దుఃఖమువల్ల అలసి, అప్పుడే కళ్లుమూసుకొన్నది రాసమణి. కాని భవానీచరణుకు ఏమీా నిద్రరాకుండా ఉన్నది. పరుపు మీద కొంచెముసేపు ఇటూఅటూ దొర్లి, 'దయామయహరీ' 'దయామయహరీ!' అని అంటూ లేచిపోయినాడు. కాళీపద కలకత్తా వెళ్లకముందు, పల్లెటూరి స్కూలులో ఉండేటప్పుడు, ఇంట్లోను ఒకమూలనున్న గదిలో కూర్చొని చదువుకొంటుండే వాడు. వణుకుతూ చేతిలో దీపము పట్టుకొని ఎవరూలేని ఆ గదిలోకి వెళ్లాడు భవాని. రాసమణి కొడుకుకొరకు తన చేతితో తానే అంచుఅల్లిన దుప్పటి ఇంకా మంచము మీద ఉన్నది; ఆ దుప్పటినిండా చాలాచోట్ల సిరామార్కులు ఇంకా అలాగునే ఉన్నవి; మురికి గోడలనిండా మసిబొగ్గుతో గీసిన జామిట్రీబొమ్మలు; మాసినఅట్టలతోనున్న పాతనోటుబుక్కులు కొన్ని, కాగితాలు చాలా పోగా మిగిలిఉన్న థరుడు రాయల్ రీడరు ఒకటీ, మంచేముమీద ఒకమూలను ఇంకాపడి ఉన్నవి. ఆహాహా! అతని చిన్నప్పటి స్లిప్పర్లజతలో ఒకటి ఇంకా ఆ గది లోనే ఒకమూలను పడిఉన్నది. ఇన్నాళ్లూ అది ఎవరికంటా పడలేదు, ఎందుచేతనో! అది ఇప్పుడు అన్నిటికంటె పెద్దదయి కంటపడుతున్నది—ఈచిన్న జోడు అతని కంటపడకుండా

వెనుక దాచుకోగలిగేటంత పెద్దవస్తువేదీ ఈపృథ్విలో లేనేలేదు గాబోలు!

కిటికీలో దీపముపెట్టి భవానీ ఆ మంచముమీద కూర్చు న్నాడు. అతని శుష్కనేత్రాలలోనుంచి ఒక్కనీటిబొట్టు రాలలేదు, గాని హృదయము దుఃఖముతో నిండిపోయింది; ఊపిరి అందడములేదని అనిపించింది, గుండెపగిలేటంత బలముతో గాలిని లోపలికి పీలిస్తేనే తప్ప ప్రాణం నిలవదేమో అనిపించింది భవానికి. గదికితూర్పువైపునన్న తలుపు తెరిచి ఇనపకమ్ములు పట్టుకొని బయటివైపు చూస్తూ నిలుచున్నాడు.

చిట్టచీకటి. టిప్ టిప్ మని చినుకులు పడుతున్నవి. ఎదు టను ప్రహరీగా ఏర్పడిఉన్న అడివిచెట్లు; ఆమధ్యను, గదిప్రక్క నుండే చిన్నజాగాలో మొక్కలు మొలిపించి చిన్నదొక పూల తోట వేదామని కాళీపద ప్రయత్నము చేస్తుండెను; అతనే స్వయముగావేసి పెంచుతూఉండిన జూమకాలత వెదురుదడి మీాద దట్టముగా అల్లుకొని ఇప్పటికీ ఉన్నది, అది ఇప్పుడు పువ్వులతో నిండిఉన్నది.

ఆ బాలకుడుపెంచిన పూలతోటవైపు చూచేసరికి ఈ వాళ భవానీగుండె బద్దలయిపోతున్నది. ఆశించవలసినది ఇక మరేమీాలేదు — ఎండాకాలములో[illegible]గు దుర్గాపూజారాత్రి లోనూ కాలేజీకి సెలవులు ఇస్తారు, కాని, [illegible]

వెళ్లడమువల్ల ఇల్లు శూన్యమయిపోయిందో, అతడు మరి ఎన్నడూ, ఏనెలవులలోనూ, ఈ ఇంటికి మరి రాడు. "ఒరే నాయనా!" అని కేకవేస్తూ అక్కడే నేలమీద చతికిలపడి పోయినాడు భవాని. తండ్రియొక్క దారిద్ర్యాన్ని పోగొడదా మని కాళీపద కలకత్తా వెళ్లాడు. కాని ఆ వృద్ధుణ్ణి జగత్తులో నుండే నిరాధారులందరిలో నిరాధారునిగాచేసి వెళ్లిపోయి నాడు! బయట వర్షము దట్టమవుతున్నది. ఆసమయాన నేలరాలిఉన్న ఆకులమీద అడుగుల చప్పుడు వినబడ్డది. భవానీగుండె దబ్ దబ్ మని కొట్టుకోవడము మొదలుపెట్టింది. ఎన్నడూ ఆశించరాని ఆశకూడ ఆశించాడు భవానీ: కాళీపద పూలతోట చూదామని వచ్చాడా అనుకొన్నాడు. కాని వర్షముపడుతున్నది, కాళీపద తడిసిపోతాడే! ఆ అసంభవ మైనతలంపులతో మనస్సల్లకల్లోలమయింది. అంతలో ఎవరో ఆ గదిదగ్గిరికి వచ్చి కిటికీ వెలుపల నిలుచున్నాడు—తలమీద కండువా ముసుగు, ఎవరో పోల్చుకోవడము కష్టము, గాని కాళీపదకూడా అంతే పొడవు! "వచ్చావు నాయనా!" అంటూ, భవాని లేచి తొందరతొందరగా తలుపు తీశాడు, ఆ; పూలతోటలోనికి వచ్చి ఆగదిఎదుట నిలబడ్డాడు. అక్కడ ఎవ్వడూ కనబడలేదు. ఆవర్షములో తోటంతా తిరిగి వెదికాడు, గాని ఎవ్వడూ కానరాలేదు. ఆ అర్ధరాత్రివేళ, చిట్టచీకటిలో, పగి లిన గొంతుకతో, "కాళీపదా!" అని పెద్దకేక వేశాడు— జబాబు రాలేదు. ఆ కేక విని ఆవులసాలలో పడుకొని ఉన్న

"నటూ" లేచి గాబారాగాబరాగా వచ్చి ఎంతోకష్టముమీద భవానిని ఇంట్లోకి తీసుకువచ్చాడు.

నటు మర్నాడు ప్రొద్దున్న గది తుడవడానికి వెళ్లాడు. ఆ గదిలో గజాలకుదగ్గిరగా ఏదో పొట్లాము పడిఉంటేచూచాడు. అది తెచ్చి భవనీచేతిలో పెట్టాడు. ఆ పొట్లాము విప్పి చూచేసరికి లోపున పత్రములాంటిది ఏదోఒకటి కనబడ్డది భవానీకి, సులోచనాలు తీసి తగిలించుకొని చదివాడు; కొంచెము చదివి తొందరతొందరగా రాసమణిదగ్గిరికి వచ్చాడు, ఆమె దగ్గిర నిలుచొని ఆపత్రము విప్పి ఆమెకళ్లఎదుట పట్టుకొన్నాడు.

"అదేమిటి ?" అన్నది రాస్‌మణి.

"ఆ వీలు !" అన్నాడు భవాని.

"ఎవరు ఇచ్చారు ?"

"రాత్రి వచ్చాడే, అతను, ఉంచేసి వెళ్లిపోయినాడు."

"ఎందుకూ, ఇది ?" అన్నది రాస్‌మణి.

"మన కిప్పుడు ఎందుకు ఇది ?" అని అంటూ ఆ వీలును భవానీ ముక్కముక్కలుగా చించి పారేశాడు.

ఈ వార్త ఆగ్రామమంతటా వ్యాపించిపోయింది. అప్పుడు బగలాచరణ్ తలఆడించుకొంటూ, అన్నాడు, "నేను అనలేదూ, కాళీపదమూలముగా ఈ వీలు పైకివస్తుంది అని ?"

మిఠాయిదుకాణదారుడు, రామ్‌చరణ్ అన్నాడు— "గాని తాతగారూ, రాత్రిపదిఘంటలరైలులోదిగిన చక్కని-

బాబు ఒకఆయన, నా దుకాణముదగ్గిరికి వచ్చి చౌధరిలఇల్లు ఎక్కడ అని అడిగాడు, దారి చెప్పాను నేను. అతని చేతిలో ఏదో ఒకకట్టలాంటిది చూచాను,—

"పోదూ!" అంటూ అతనిమాట కొట్టిపారేశాడు, బగలాచరణ్.

1911

# కాబూలీవాలా

నాకూతురు, "మిని" వయస్సు అయిదేళ్లు. అది ఒక్క నిమిషము కూర్చోలేదు మాటలాడకుండా. ఈ భూమిమీద జన్మగ్రహణ చేసిన తరువాత ఒకసంవత్సరముమాత్రము భాష నేర్చుకొంటూ ఏలాగో గడిపిఉంటుంది. అటుతరువాత మేలుకొనిఉన్న సమయంలో ఒక్కనిమిషమైనా మాటలాడడముమాని వృథాపుచ్చలేదు. తల్లి కేకలువేసి అనేకసార్లు మినినోరుమూసే సేది, గాని అటువంటిపని నాచేత అయేదికాదు. మిని ఏమీ మాట్లాడకుండాకూర్చుంటే అది బహు అస్వాభావికముగా నాకు కనబడేది, అదిచూచి నేను అట్టేసేపు సహించి ఉండలేక పోయేవాడను. అందుచేత మాఇద్దరికీ మిక్కిలి ఉత్సాహముతో సంభాషణ జరుగుతూఉండేది.

ఆ నాడుఉదయము నేనువ్రాస్తున్ననవలలో పదిహేడవ పరిచ్ఛేదము ప్రారంభింతామని పుస్తకము తీశాను. మిని గదిలోకి వచ్చి, ఆరంభించింది—"నాన్నా, మనదర్వాన్, రామదయాల్, 'కోడి'కి 'కావా' అన్నాడు—వాడికి ఏమీ తెలియదుకదూ, నాన్నా?"

లోకములోఉన్న భాషలకు ఉండే భేదాభేదాలవిషయమై కొంతజ్ఞానము మినికి అప్పుడు ఇవ్వావలెనో లేదో ఇంకా

నేను నిశ్చయించకముందే ఆమె వేరే ప్రసంగములోకి దిగి—"నాన్నా చూడు, ఆకాశముమీద ఏనుగు తొండముతో నీళ్లు కొడుతుంటే వర్షము కురుస్తున్నదని, 'భోలా' అన్నాడు —భోలా ఏమిదొంగమాటలు ఆడుతాడనుకున్నావు నాన్నా! ఏక పేలాపన రాత్రీపగలూ; ఉత్-త్త పేలాపనే!"

ఆ విషయములో నాయభిప్రాయము తెలియజేసేవరకు ఉండకుండా హఠాత్తుగా "నాన్నా, అమ్మ నీకు ఏమవుతుంది ?" అని అడిగింది.

'మరదలు' అవుతుంది అని నామనస్సులో నేను అనుకొన్నాను, గాని పైకిమాత్రము, "మినీ భోలాతో ఆడుకో అమ్మా, వెళ్లు, నాకు కొంచెము పనిఉన్నది," అని అన్నాను.

నేను ఆలాగు అనగానే నాకాళ్లదగ్గిర కూర్చొని కాళ్లు చాచుకొని గట్టిగా పాడుకొంటూ "కాళ్లాగజ్జా కంకణమ్మా" ఆడుకోవడము ఆరంభించింది. అప్పుడు పదిహేడవపరిచ్ఛేదములో ప్రతాపసింహ కాంచనమాలను పట్టుకొని అంధకారములో కారాగృహముయొక్క మీదికిటికీలోనుంచి క్రిందనున్న నదీప్రవాహములోకి దుబుక్కున ఉరుకుతున్నాడు.

రోడ్డుకుప్రక్కనే మాఇల్లు. మిని, కాళ్లాగజ్జా కంకాణమ్మా చప్పున ఆపి, కిటికీదగ్గిరికివచ్చి నిలుచొని, "కాబూలీవాలా,

ఓ కాబూలీవాలా!" అని పిలిచింది. రోడ్డువెంబడి కాబూలీ వాడొకడు మెల్లిగా నడుస్తూ వెళ్లుతున్నాడు, పొడవుగా ఉన్నాడు, మడతలు మడతలుగా ఉన్న మాసిపోయిన ఒదులు వరాయి, తొడుక్కున్నాడు, భుజముమీదనుంచి చర్మముసంచి వేలబడుతున్నది, తలకు పెద్ద పగిడీ, చేతిలో రెండు ద్రాక్షపళ్ల పెట్టెలు. అతనినిచూడగానే నాకన్యారత్నము హృదయములో ఎటువంటి భావోద్రేకము కలిగిందో చెప్పడము కష్టము, గాని గట్టిగా కేకలువేసుకొంటూ మిని ఆ కాబూలీవాలాను పిలవ డము మొదలుపెట్టింది. మెడను సంచి వేలవేసుకొని వాడు లోపలపాజేరవుతాడు, నా పదిహేడవపరిచ్ఛేదముపని నీళ్ల ధారే అని నేను నిశ్చయించుకొన్నాను.

మినికేక విని కాబూలీవాలా నవ్వుముఖముతో మినిని చూచి మా ఇంటివైపు అడుగులు వేయడము మొదలు పెట్టాడు. మిని గాబరా గాబరాగా, ఊపిరి అందదు అన్నట్టుగా ఇంట్లోకి పరుగెత్తింది, జాడలేకుండ ఎక్కడో మాయమయిపో యింది, ఆసంచిలో వెతికితే తనలాంటి పిల్లలు ఇద్దరు ముగ్గురు దొరుకుతారని ఒకగట్టి నమ్మకము ఉన్నది కాబోలు మిని మనస్సులో.

కాబూలీవాలా నవ్వుముఖముతో నాగదిలోకి వచ్చి సలాముచేసి నిలుచున్నాడు. ఇవతల ప్రతాపసింహ కాంచన మాలలు చాలా చిక్కైనఅవస్థలో ఉన్నారు. అయినా ఆ మని

షిని లోపలికి పిలుచుకువచ్చి ఏమీ కొనకుండా పంపడము మర్యాద కాదని నాకు తోచింది.

ఏదో కొంచెము కొన్నాను. తరువాత నాలుగు మాటలూ వచ్చినవి. అబ్దర్ రహ్మాన్ దేశాలసరిహద్దుల విషయమై చెపుతూ ఇంగ్లీషువాళ్లను గురించీ, రషియా వాళ్లను గురించీ కథలు ప్రారంభించాడు.

చివరకు లేచి నిలబడి వెళ్లిపోబోయే ముందర, "మీ అమ్మాయి ఏదీ బాబూ?" అని అడిగాడు.

మినిభయానికి కారణము లేదు. అది పోగొట్టుదామని మినిని తీసుకురమ్మని ఇంట్లోకి కబురుపంపి తెప్పించాను. మిని నాఒంటిని అంటిపెట్టుకొని అనుమానిస్తూ కాబూలీవాలా ముఖమువైపూ అతని సంచివైపూ, చూస్తూ నిలుచున్నది. కాబూలీ ఆసంచిలోనుంచి కిసిమీస్‌పళ్లూ, పిస్తాకాయలూ తీసి పిల్లకు ఇవ్వబోయినాడు. మినిసందేహము రెండింతలయింది. కాబూలీ ఇస్తున్నవి పుచ్చుకోక, నా రెండు కాళ్లమధ్యకు దూరి నామోకాళ్లనుకౌగలించుకొన్నది. కాబూలీవాలాతో మొదటి పరిచయము ఈ విధముగా జరిగింది.

ఇది అయినకొన్నాళ్లకు, ఒకనాటి ఉదయము ఏదో బయటికి వెళ్లవలసిన పని ఉండి బయలుదేరుతున్నాను. మిని మా ముందుగడపకు ఎదుటనున్న బెంచీమీద కూర్చొని అనర్గళముగా మాట్లాడుతున్నది. కాబూలీ మిని కాళ్లదగ్గిర కూర్చొని

నవ్వుముఖముతో ఆ మాటలు వింటున్నాడు. మధ్యమధ్య సగము కాబూలీమాటలు కలిపి మిని చెప్తున్న విషయాలలో తన మతభేదము తెలుపుతున్నాడు. అయిదు సంవత్సరాలూ తాను సంపాదించిన జ్ఞానము వెల్లడిచేస్తూ ఉండగా ఇంత ఓపికతో వినేవాడు, నాన్నతప్ప, మినికి ఇంకెవ్వరూ దొరకలేదు. మినివంక చూదునూ, దాని చీరచెంగునిండా కిస్‌మిస్‌పళ్లు. "అవన్నీ దానికి ఎందుకు ఇస్తున్నావు? మరిఎప్పుడూ అలాగు ఇవ్వకు," అని నేను కాబూలితో అన్నాను, అంటూ జేబులో నుంచి అర్ధరూపాయిఒకటి తీసి అతనికి ఇచ్చాను. వాడు ఏమీ సందేహించకుండా అది పుచ్చుకొని సంచిలో వేసుకొన్నాడు.

ఇంటికి తిరిగివచ్చేసరికి ఆ అర్ధరూపాయివల్ల పుట్టిన పెద్ద గందరగోళం జరుగుతున్నది—తల్లికీ పిల్లకూ అతితీవ్రముగా మాటలు జరుగుతున్నవి.

"అర్ధరూపాయి నీకు ఎక్కడిదే?" అని తల్లి తిడుతూ అడుగుతున్నది.

"కాబూలీవాలా ఇచ్చాడు," అని మిని అంటున్నది.

"కాబూలీవాణ్ణి నువ్వు ఎందుకు అడిగావు?"

"నేను అడగలేదు, వాడే ఇచ్చాడు," అంటూ మిని ఏడుపు ఆరంభించబోతున్నది.

అంతలో నేను మినిని ఆపదనుంచి తప్పించి బయటికి తీసుకొచ్చాను.

కాబూలీవాలాను మిని కలుసుకోవడము ఇది రెండో మారు కాదని విన్నాను. ఈలోపున రమారమి ప్రతిరోజూ వచ్చి బాదమ్, పిస్తా లంచము ఇచ్చి మిని చిట్టి హృదయాన్ని చాలాభాగము లోబరచుకున్నాడు వాడు.

ఆ ఇద్దరి ఇష్టాగోష్ఠిలో రెండుమూడు హాస్యాలు మామూలుగా జరుగుతుండేవి—రహ్మత్ కనబడగానే మిని నవ్వుతూ అడిగేది, "కాబూలీవాలా, ఓకాబూలీవాలా, నీసంచిలో ఏమిటి ఉన్నది?"

రహమత్ నవ్వుతూ ఒక అనవసరమైన అర్ధానుస్వారతో "హాఁతి" *అనేవాడు.

ఆ సంచిలో ఏనుగు ఉన్నదనే పరమరహస్యమే వాళ్లిద్దరిలో సంతోషము పుట్టడానికి కారణము. ఇది మహాసూక్ష్మమైన రహస్యమని చెప్పలేము, నిజమే; గాని అది ఇద్దరికీ అపరిమితానందం కలిగించేది. ఇంతేకాక, ఆశరత్కాలపు ఉదయాన బాగా వయస్సు ముదిరిన వాడొకడూ వయస్సురాని పసిబిడ్డ ఒకర్తే—ఇద్దరూ కూర్చొని ఆలాగు హాస్యాలాడుకొంటూ ఉండగా చూడడము నాకూ సరదాగానే ఉండేది.

వాళ్ల హాస్యాలలో ఇంకొకటి ఏమిటి అంటే-"చిట్టీ, నువ్వు ఎప్పుడూ అత్తవారింటికి వెళ్లకూ!" అని కాబూలీవాలా అంటూ ఉండడము.

* హాఁతి = ఏనుగు

హిందువులఇళ్లలో, పుట్టినప్పటినుంచీ 'అత్తవారిల్లు' అనే మాటకు అలవాటుపడి ఉండడము పిల్లలకు సహజమే, గాని మా ఇంట్లోని పూర్వాచారాలు కాకపోవడముచేత అత్తవారి ఇంటి సంబంధమైనజ్ఞానము మాపిల్లకు ఇంకా కలగలేదు. అందుచేత రహ్మత్ కోరేదేమిటో మినికి బాగాబోధపడేదికాదు. కాని దేనికీ జవాబుఇవ్వకుండా ఊరుకోవడము మినిస్వభావానికి కేవలము విరుద్ధము. కాబట్టి కాబూలీ ఉపయోగించిన మాటలే ప్రయోగించి, "నువ్వు అత్తవారింటికి వెళ్లుతావా?" అని అడిగేది.

తనకుకూడా అత్తవారియిల్లుఅంటూ ఒకటి ఉన్నదన్నట్టుగా రహ్మత్ చేతులుబిగించి తనపెద్దపిడికిలిని మీదికిఎత్తి భయపెడుతున్నట్టుగా ఆడించేవాడు.

అదిచూచి, 'అత్తవారు' అనేపేరుగల తాను ఎరగని మనిషి ఎవడో ఒకడున్నాడని అనుకొని, మిని వానిదుర్దశను ఊహించి, పకపక నవ్వడము మొదలుపెట్టేది మిని.

నిర్మల శరత్కాలము. పూర్వము ఇటువంటి రోజులలోనే రాజులు దిగ్విజయయాత్రకు బయలుదేరేవారు. నేను కలకత్తా వదలి ఎన్నడూ ఎక్కడికీ వెళ్లలేదు, అందుచేతనే పృథ్వినంతటినీ చుట్టబెట్టి వస్తూఉండేది నా మనస్సు. బయటి ప్రపంచమే నా నిజమైనఇల్లు అనిపించేది నాకు, అక్కడినుండి బహిష్కరింపబడి ఇంటిమూలలను శాశ్వత ఖయిదీగాఉన్న

పరవాసిని నేను. బయటిప్రపంచముకొరకు నా మనస్సు ఎల్లప్పుడూ కొట్టుకుపోతూఉండేది. విదేశముమాట వినేసరికి నామనస్సు గంతులు వేసుకొని పరుగెత్తుతుండేది. అదేవిధముగా విదేశస్థుడు ఎవడైనా నాకంటికి కనబడగానే ఎక్కడో ఒక అరణ్యములో నదీపర్వతాలమధ్యను ఒక చిన్నకుటీరము ఉన్నట్టూ, నేను అక్కడ స్వేచ్ఛగా బహుఉల్లాసముతో జీవనయాత్ర చేస్తూ ఉన్నట్టూ నాకు ఊహాపుట్టేది.

•

బయటి ప్రపంచముయొక్క ఆకర్షణ ఈవిధంగాఉండేది. కాని నాజీవితము ఒకలేతచెట్టు మాదిరి, అతినాజూకు— హాయిగా పెరుగుతూఉన్న ఇంటిమూలనుంచి బయటికితీసుకు వచ్చినట్టయితే ఎండదెబ్బకు నిలవలేనిది. అందుచేత ఉదయము వేళ నాచిన్నగదిలో టేబిలుదగ్గిర కూర్చొని ఆ కాబూలీ వాలాతో మాట్లాడుతూ నా దేశాటనకార్యము కొంత నెరవేర్చుకొంటూ ఉండేవాడను—రెండుప్రక్కలా ఎక్కడానికిశక్యము కాని ఎర్రని పర్వతశ్రేణులు, రాళ్ళమధ్యను సన్ననిదారి, ఆదారి వెంట సామాను మోస్తున్న పెద్దఒంటెలబారుఒకటి ప్రయాణము చేస్తున్నది. పెద్దపెద్ద పగిడీలుచుట్టుకొనిఉన్నవర్తకులు ఒంటెల మీది కూర్చున్నారు, కొంతమంది నడుస్తున్నారు, కొంతమంది చేతులలో బల్లేలూ, మరికొంతమంది చేతులలో చెకుముకితో ముట్టించే పూర్వకాలపు తుపాకులూఉన్నవి - మేఘగర్జనలాంటి స్వరముతో మెల్లిమెల్లిగా అన్నిభాషలమాటలూ కలిపి తన

దేశపు కథలు ఆకాబూలీవాలా చెప్పుతూఉండేవాడు; వింటూ ఉంటే ఆ దృశ్యము నాకంటికి కట్టినట్టుగా ఉండేది.

మినితల్లి చాలాపిరికిమనిషి. రోడ్డుమీద ఏదోచిన్న శబ్దము అయితే లోకములోఉన్న తాగుబోతులంతా కలిసి తనఇంటిలో ప్రవేశించబోతున్నారాఅని భయపడుతుంది. దొంగలూ, బందిపోటువాళ్లూ, తాగుబోతులూ, పాములూ, పులులూ, మన్యపుజ్వరాలూ, గొంగళీపురుగులూ, బొద్దింకలూ, దోరలూ,—మొదలైనవాటన్నిటితో ప్రపంచము నిండిఉన్న దని మినితల్లి భయము. ఇంతకాలము ఆమె ఈపృథ్వీమీద నివాసముచేస్తూఉన్నా ('ఇంతకాలము' అంటే ఆట్టేకాలమని కాదు నేను అనేది) మినితల్లికి ఆభయం వదలలేదు.

రహమత్-కాబూలీవాలావిషయములో ఆమెకు సంశయము లేకపోలేదు. అతనిమీద ఒక కన్నువేసిఉంచమని నాతో అనేకసార్లు అన్నది. గట్టిగా నవ్వి ఆమెభయము చెదరగొడదామని నేను ప్రయత్నిస్తే వరసగా మూడునాలుగు ప్రశ్నలు వేసేది—"ఎవరూ, ఎప్పుడూ, ఎవరిపిల్లలనూ, దొంగలించుకుపోలేదా ? కాబూల్ దేశములో పశువులలాగునే మనుష్యులను అమ్మడము కొనడము జరుగుతూఉండడము లేదా ? పెద్దరాక్షసిలాంటి కాబూలీవాడు ఒక చిన్నపిల్లను దొంగలించుకు పారిపోవడము కేవలం అసంభవమా?"

అసంభవమేమీ లేదుఅని ఒప్పుకోవలసివచ్చింది, గాని అటువంటిది నమ్మదగినమాటకాదు. అయితేనేమీ, నమ్మేశక్తి

ప్రతిమనిషిలో ఒకేమోస్తరుగా ఉండదు, అందుచేత మిని తల్లిలో ఆ నమ్మకము ఆలాగునే ఉండిపోయింది. ఆలాగనిచెప్పి మాత్రము రహ్మతును మాఇంటికి రావద్దని చెప్పలేక పోయినాను.

రహ్మత్ ప్రతిసంవత్సరమూ మాఘమాసప్రాంతములో స్వదేశానికి వెళ్లుతూఉండేవాడు. ఆరోజులలో చాలా కష్టపడి తిరిగి తనకురావలసినబాకీలన్నీ వసూలుచేసుకొంటూ ఉండేవాడు. ఇంటింటికీ తిరగవలసివచ్చేది, అయినా మధ్యమధ్య వచ్చి మినిని చూచివెళ్లుతూఉండేవాడు. వాళ్లిద్దరిలో ఏదో కుట్రజేరుగుతున్నదని చూచేవాళ్ళకు అనిపిస్తుంది. ఏనాడైనా ఉదయము రాలేకపోతే సాయంత్రము తప్పేవాడుకాడు. లొడలొడలాడుతూఉన్న ఒదులుచొక్కాపరాయీ తొడుక్కొని, మెడలో సంచివేలవేసుకొని, ఆపెద్ద రాక్షసిలాంటివాడు అ చీకటిఅంధకారములో, ఆ గదిమూలను కూర్చొని ఉండగా చూస్తే, నిజేముగానే, ఎవరికైనా భయము వేయక మానదు.

కాని నవ్వుతూ "కాబూలీవాలా, ఓ కాబూలీవాలా!" అనుకొంటూ పరుగెత్తుకొని వచ్చి మిని అతనిదగ్గర కూర్చొనేది; ఈడూ జోడూకాని ఆ ఇద్దరూ కూర్చొని ఆ పాతహాస్యాలు ఆడుకొంటూఉంటే విని నామనస్సు సంతోషముతో పొంగిపోతూఉండేది.

ఒకనాడు ఉదయము నాగదిలో కూర్చొని ప్రూఫ్‌షీట్ దిద్దుతున్నాను. శీతకాలము సెలవుపుచ్చుకొని వెళ్లిపోబోయే సమయము అయింది. అప్పుడే రెండుమూడురోజులయిఉంటుంది చలి గజగజవణికించేస్తున్నది ఆఖరి రెండురోజులూ ఇలాచేసి మరీ వెళ్తుంది శీతకాలము. ఉదయము ఎండ కిటికీలోనుంచి వచ్చి టేబిలుక్రిందనున్న నాకాళ్ళమీద పడుతూఉండడము వల్ల నాకు చాలాహాయిగా ఉన్నది. సుమారు ఎనిమిదిఘంటలు అయిఉంటుంది, మెడలకు కంఫర్టర్లు చుట్టుకొని ప్రొద్దున్నే షికారుకు వెళ్లినవాళ్లు ఇళ్లకు తిరిగివస్తున్నారు. అటువంటప్పుడు రోడ్డుమీద ఏదో పెద్దగోల జరుగుతున్నట్టు వినబడ్డది.

అటుతిరిగి చూతునూ—మన రహ్మతును ఇద్దరు కానిస్టేబులు పట్టుకొని తీసుకువస్తున్నారు. వాళ్ళవెనుక తమాషాచూస్తూ పరుగెత్తుతున్న కుర్రవాళ్ళమూక కనబడుతున్నది. రహ్మత్ బట్టనిండారక్తము. ఒకకనిస్టేబుచేతిలో రక్తముకారుతున్న కత్తిఒకటి ఉన్నది. నేను బయటికివచ్చి కనిస్టేబులను ఆపి, ఏమిటి సమాచారమని అడిగాను.

కొంత కనిస్టేబులు చెప్పినదానివల్లా, మరికొంత రహమత్ చెప్పినదానివల్లా సమాచారము తెలుసుకొన్నాను—మా పొరుగుఇంటిపెద్దమనిషిఒకడు రామ్‌పూర్ శాలువఒకటి రహమత్ దగ్గిర కొన్నాడు, రహ్మతుకు దానిఖరీదులో కొంత బాకీఉన్నాడు. బాకీఉంచికూడా బాకీ లేదు అని ఆపెద్దమనిషి

అబద్ధము ఆడుతూ, పైగా అనవసరముగా మాటలు మిగల నాడేసరికి రహ్మత్ కత్తితో ఒకటి వేశాడు.

ఆ అబద్ధాలకోరును రహమత్ నానారకాలుగా తిట్టుతూ ఉండగా మా మిని, "కాబూలీవాలా! ఓ కాబూలీవాలా!" అని అంటూ ఇంట్లోనుంచి పైకివచ్చింది.

రెప్పపాటులో రహ్మత్ ముఖాన నవ్వు కనబడ్డది. రహమత్ భుజాన సంచి లేదు. అందుచేత సంచిలో ఉన్న దానినిగురించి వాళ్లు మామూలుగాఆడే హాస్యాలాపనకు ఈవాళ అవకాశము చిక్కలేదు, కాని "నువ్వు అత్తవారి-ఇంటికి వెళ్లుతావూ?" అని మాత్రం మిని ఛటీమని అడిగింది.

"అక్కడికే వెళ్లుతున్నాను!" అని రహమత్ నవ్వుతూ జబాబిచ్చాడు.

ఆ జబాబువల్ల మినికి నవ్వురాలేదు అని రహమత్ కని-పెట్టి తనచేతులు చూపిస్తూ, "అత్తవారిని కొట్టిఉందును, గాని ఏమిచేయగలను చేతులు కట్టేశారు!"

ప్రమాదమైనదెబ్బ కొట్టాడనే అపరాధము స్థిరపరిచి కాబూలీవాలాపై కొన్నిసంవత్సరాలు కఠినశిక్ష విధించారు.

రహ్మత్ మాట తరువాత మరి నేను తలపెట్టలేదు, మరిచిపోయినాననేచెప్పవచ్చు. స్వేచ్ఛగా కొండలపైనీ, అడవుల లోనూ సంచారంచేస్తూ ఉండవలసినమనిషి ఖైదుగోడలమధ్య సంవత్సరాలతరబడి ఏవిధముగా గడపగలడు అనేప్రశ్న నిత్య కృత్యాలలో పడి కొట్టుకొంటున్న నా మనస్సుకు తట్టలేదు.

తరువాత, చంచలస్వభావముగల మినివ్యవహారము చూస్తే ఆమెతండ్రికే సిగ్గువేసింది. తనపాతస్నేహితుని పూర్తిగా మరిచిపోయి, తరువాత, మొట్టమొదట, మాగుర్రపువాడు "నబీ"తో స్నేహము చేసింది; క్రమక్రమముగా పెద్దఅవుతున్న-కొలది మొగవాళ్ళజట్టువిడిచి తనఈడు ఆడపిల్లలతో జట్టు-కూడింది. రానురాను చివరకు నా వ్రాసుకొనేగదిలో మినిదర్శనము తండ్రికే దొరికేదికాదు. ఒకమోస్తరు మినితో నేను జట్టువిప్పేశాను అనే చెప్పవచ్చును.

చాలాసంవత్సరాలు గడచిపోయినవి. తిరిగి శరత్కా-లము వచ్చింది. మినిపెళ్లి నిశ్చయము అయింది, దుర్గపూజసెల-వులలోపుగా పెళ్ళికాబోతున్నది. మాయింటికి ఆనందమయిన మా 'మిని' మా మూడులోకాలనూ అంధకారములోముంచి కైలాసవాసునితో కలిసి యాత్ర చేస్తుంది పతిగృహానికి. ప్రాతః కాలము అతిమనోహరముగా ఉన్నది. వర్షాలచే కడిగి శుభ్రము చేయబడిన ఆ పసిఎండ వెలిగారముఅద్దిన బంగారమువలె ప్రకాశిస్తున్నది. ఆ ఎండ కలకత్తాసందులలోఉన్న మురికిఇటికఇళ్లపై పడి, వాటిమీదకూడా తనలావణ్యాన్ని వెదచల్లుతున్నది.

ఈవాళ తెల్లవారుఝాము మొదలు మాఇంట్లో సనాయి వాగుతున్నది. ఆ పాట నాహృదయములోని ఏమూపయి నాకు లోపలినుంచి వినబడుతున్నది. పాడుతూఉన్న భైరవిరాగము మనస్సును కరిగిస్తున్నది, దగ్గరపడుతూఉన్న మా ఎడబాటు

వార్తను ఆ శరత్కాలపు ఎండతోపాటు ప్రపంచమంతటా వ్యాపింపజేస్తున్నది. ఈవాళ మా మినిపెల్లి.

ఉదయమునుండీ చాలాహడావిడిగా ఉన్నది. అనేకులు స్నేహితులూ, బంధువులూ, వచ్చిపోతూన్నారు. అంగణములో రాటలుపాతి పందిరివేశాము; హాలులోనూ వరండాలలోనూ లస్టర్లూ గ్లోబులూ కడుతున్నారు; నానారకాల శబ్దము గందర గోళము — ఆ శబ్దాలకూ ఆ కేకలకూ మితి ఉన్నట్టుగా లేదు.

నా వ్రాతగదిలో కూర్చొని నేను ఖర్చులు లెక్క వేస్తూ-న్నాను; హఠాత్తుగా రహ్మత్ నాగదిలోకి వచ్చి సలాము చేసి ఎదుట నిలుచున్నాడు.

మొదట అతనిని నేను పోల్చుకోలేకపోయినాను— భుజాన సంచిలేదు, మునుపు పెద్ద జోట్టు ఉండేది, ఆ జోట్టు లేదు. ఇప్పుడు ముఖములో మునపటి కాంతి లేదు. చివరకు అతని నవ్వుచూడగానే పోల్చుకొన్నాను.

"ఓహో రహ్మత్! ఎప్పుడు వచ్చావు?" అని అడిగాను.

"నిన్ననే జైలులోనుంచి విడుదల అయింది," అని అన్నాడు.

మాట చెవినిపడగానే గుండె కొట్టుకోవడము మొదలు పెట్టింది. ఖూనీచేసినవానిని నేను ఎన్నడూ సాక్షాత్తుచూడ-లేదు. ఇతనిని చూచేసరికి మనస్సు ముడుచుకుపోయింది. ఈ

శుభదినమునాడు ఈమనిషి ఇక్కడనుంచి వెళ్లిపోతేనే బాగుం. డును అని నాలో నేననుకొన్నాను.

"మాఇంట్లో ఈవాళ శుభకార్యము ఒకటి జరగబోతున్నది, నేను కొంచెము తొందరపనిలో ఉన్నాను, నీవు ఈ. వాళకు వెళ్లాలి," అని అన్నాను.

రహ్మత్ తక్షణమే తిరిగాడు. వెళ్లిపోదామని, ద్వారముదాకా వెళ్లి కొంచెము ముందూ వెనకాఅయి, "చిట్టిని ఒకమాటు చూడడానికి వీలులేదూ?" అని అడిగాడు.

మిని మునపటిలాగే ఉన్నదని గాబోలు అతని అభిప్రాయము. మునపటిలాగు, "కాబూలీవాలా ఓ కాబూలీవాలా!" అని పరుగెత్తుకొని వచ్చి పూర్వము మోస్తరుగానే హాస్యాలాడుకొంటూ అతనిదగ్గిర కూర్చుంటుంది, అప్పటికీ ఇప్పటికీ ఏమీ భేదము ఉండదు అని అనుకొనిఉంటాడు. మునపటి స్నేహామే మనస్సులో పెట్టుకొని ఒకద్రాక్షపళ్లగుత్తి, కాగితములోకట్టి కొంచెముకొంచెము కిస్మిస్‌పళ్లూ, బాదమ్, పిస్తా, తీసుకు వచ్చాడు—సంచి దగ్గిరలేదు, వాళ్ల దేశపువర్తకుడెవడినోఅడిగి అవి తెచ్చి ఉంటాడు. "మా ఇంట్లో ఈవాళ పెళ్లి, చూడడానికి ఎవరికీ వీలుఉండదు," అని అన్నాను.

అతని మనస్సుకు చాలాకష్టము కలిగి ఉండాలి—కదలకుండా ఆలాగే నిలబడి రెండునిమిషాలయిన తరువాత నావైపు చూచి, "బాబూ సలామ్!" అంటూ గడపదిగాడు.

నాకు చాలా బాధకలిగింది, తిరిగి పిలుద్దామా అని అనుకొంటున్నాను, అంతలో రహ్మత్ తనంతట తనే తిరిగి వచ్చాడు.

దగ్గిరికి వచ్చి, "ఈకిస్‌మిస్, బాదమ్ చిట్టికోసము తీసుకు వచ్చాను, చిట్టికి ఇచ్చేయండి," అని అన్నాడు.

అవి పుచ్చుకొని వాటిఖరీదు ఇవ్వబోయినాను. రహ్మత్ చేప్పున నాచెయ్యి పట్టుకొని, "క్షమించండి డబ్బులు ఇవ్వకండి—ఈ ఉపకారము ఎప్పటికీ మరిచిపోడు కాబూలీవాలా!" అని నన్ను ప్రతిమాలు కొన్నాడు.

"మీపిల్లలాంటిదే నాకూ ఒకకూతురు మాదేశములో ఉన్నది. మా చిట్టిముఖము మనస్సులో పెట్టుకొని మీచిట్టి చేతులో నాలుగుపళ్లు పెడదామని ఇక్కడికివస్తూ ఉంటాను, పళ్లుఅమ్మడానికి రాను," అని రహ్మత్ అన్నాడు.

ఆలాగు అంటూ తనఒదులుచొక్కాలో చెయ్యిదూర్చి ఎక్కడినుంచో చిన్న మురికికాగితము ఒకటి బయటికి తీశాడు. అతిజాగ్రత్తగా మడత విప్పి దానిని రెండుచేతులలో పట్టుకొని టేబిలుమీద పెట్టాడు.

ఆకాగితముమీద చిన్నచెయ్యి అచ్చు అద్ది ఉన్నది. అది ఫోటోగ్రాఫుకాదు, రంగులతోవ్రాసిన పటముకాదు; చేతికి మసిరాసి ఆచెయ్యి కాగితముమీద అద్దగాఅయిన గురుతు అది. ఆచెయ్యిఅచ్చు తెచ్చుకొన్నాడు కాబూలీవాలా కూతుర్ని తలపుకు తెచ్చే ఈ గురుతును, ఈ స్మరణచిహ్నాన్ని,

తనగుండెమీద ఉంచుకొని ప్రతిసంవత్సరమూ పళ్లు అమ్మడానికి కలకత్తా వస్తూ ఉంటాడు—ఆ చిన్న ముద్దుచెయ్యి దేశ సంచారముచేసే ఇతని విరాట్ హృదయములో అమృతము చిలకరిస్తుంటుంది.

అది చూచేసరికి నాకళ్లు నీళ్లతో నిండిపోయినవి. అప్పుడు అతడు ఒక పళ్లు అమ్ముకొని తిరుగుతుండే కాబూలీవాలా అనీ, నేను ఒకగొప్పవంశములో పుట్టిన హిందువుడననీ మరిచిపోయినాను. అతనుఏమో నేనూ అదే అని నాకు అప్పుడు బోధపడ్డది. అతనూ బిడ్డనుకన్న తండ్రే, నేనూ బిడ్డనుకన్నతండ్రినే అని అప్పుడు తెలుసుకొన్నాను. పర్వతనివాసిఅయిన అతని చిట్టి పార్వతిహస్తచిహ్నము చూడగానే మా మినిమాట నాకు జ్ఞాపకమువచ్చింది. మినిని పిలుచుకురమ్మని లోపలికి కబురుపంపాను. ఇంట్లోవాళ్లు చాలా అభ్యంతరపెట్టారు, కాని నేను అదంతా వినిపించుకోలేదు. పసుపుపూసిన చీరకట్టుకొని, ముఖాన పెద్దబొట్టు పెట్టుకొని, పెళ్లికూతురు వేషమూ తానూ తయారయింది మిని. సిగ్గుపడుతూ సిగ్గుపడుతూ గదిలోకి వచ్చి నాదగ్గిర నిలుచున్నది.

మినిని చూచి కాబూలీవాలా కొంచెము గడబడపడ్డాడు, మునుపటిహాస్యాలు మరి నడవలేదు. చివరకు అతను నవ్వుతూ, "చిట్టీ, నువ్వు అత్తవారింటికి వెళ్లుతావ్వా!" అని అడిగాడు.

మిని ఇప్పుడు అత్తవారిల్లంటే ఏమిటో ఎరుగును. అం దుచేత మునపటిలాంటి జబాబు ఇవ్వలేకపోయింది. రహ్మత్ ప్రశ్నవిని మిని సిగ్గుతో ముఖము ఎర్రచేసుకొన్నది, ముఖము అటు తిప్పి నిలబడ్డది. మిని కాబూలీవాలాను మొట్టమొదట కలుసుకొన్నరోజునాటి మాట నాకు జ్ఞాపకమువచ్చి ఎంతో దుఃఖము కలిగింది.

మిని లోపలికి వెళ్లిపోయింది. రహ్మత్ పెద్దనిట్టూర్పు విడిచి నేల చతికిలపడిపోయినాడు. తనకూతురుకూడా ఈపా టికి మినిలాగు పెద్దదయిపోయిఉంటుంది. తాను ఇంటికి వెళ్లి తిరిగి కొత్తగా పరిచయము ప్రారంభించవలెను అని హఠాత్తుగా రహ్మతుకు తట్టింది, మునుపటి తనచిట్టికూతురు మరి ప్రాప్తిం చదు అని రహ్మతుకు తెలిసిపోయింది, ఈ ఎనిమిదిసంవత్సరా లలో ఇంటికి ఏమి సంభవించిందో అదికూడా ఎరుగడు. ఉద యాన ఆ చక్కని శరత్కాలపు ఎండలో సనాయిపాట వినబడు తున్నది. ఆఫ్గనిస్థాన్‌ను గురించీ, అందులో ఉండే ఒక పర్వత శ్రేణిని గురించీ, ఆలోచిస్తూ కలకత్తాసందులోనున్న ఆ ఇంట్లో కూర్చున్నాడు కాబూలీవాలా.

నేను నోటుఒకటి పైకితీసి అతనికి ఇచ్చాను, "రహ మత్, నువ్వు మీ దేశము వెళ్లు నీ కూతురుదగ్గరికి, మీసమా వేశసుఖమువల్ల మామినికి శుభం అవుగాక!" అని అన్నాను.

ఆ రూపాయలు దానముచేయడమువల్ల పెళ్లిసందడి లోని ఒకటిరెండుఏర్పాట్లు తగ్గించుకోవలసివచ్చింది—ఎలెక్ట్రిక్ దీపాలు అనుకున్నన్ని పెట్టలేకపోయినాను, బ్యాండ్ మేళము వదులుకొన్నాను—ఆడవాళ్లు కొంచెము గొణుగుకున్నారు, కాని ఆ శుభదినము మంగళకాంతులతో మరింత శోభితమై ప్రకాశించింది.

1892



# *భాయి ఫోఁటా

శ్రావణమాసము ఈవాళ వట్టిపోయిందా అనిపిస్తున్నది, ఆకాశాన ఏమూలా మేఘము కనబడలేదు.

ఉదయము ఏలాగుగడుస్తున్నదో నాకు ఆశ్చర్యముగా ఉన్నది. మాతోట గోరంటకంచెకు సమీపములోఉన్న దిరిసినచెట్టుఆకులు జిలబిల్లాడుతున్నవి. నేను వాటివైపుచూస్తూ కూర్చున్నాను. మహాప్రళయముమధ్యను నా బస ఇప్పుడు— అది దూరానఉన్నంతసేపు దానిమాట అనుకొంటే శీతకాలములో అర్ధరాత్రి వేళనుకూడా ఒళ్ళంతా చెమట పట్టిపోయేది, నడివేసవిలో మట్టమధ్యాహ్నమప్పుడు కాళ్ళూ చేతులూ చల్లనయిపోయేవి. కాని ఇప్పుడు ఎట్టి భయమూ విచారమూ లేదు.

అందుచేత నా ఎదుటనున్న సీతాఫలముచెట్టుకొమ్మమీద తొండఒకటి పురుగులు పట్టుకొంటూఉంటే తదేకధ్యానముగా అటువైపు చూడగలుగుతున్నాను.

* బంగాళాదేశములో కార్తికమాసములోపడే ఒక పండగ. ఆనాడు అక్కచెల్లెళ్లు అన్నదమ్ములను తమ ఇళ్ళకు తీసుకువచ్చి విందుచేసి శుభము కోరుతూ వాళ్లనొసట బొట్టుపెట్టడము బంగాళీదేశస్థుల ఆచారము.
ఫోఁటా=బొట్టు.

ఉన్నదంతా పోగొట్టుకొని ఊళ్లవెంబడి తిరుగుతూ ఉండడము అంతకష్టమైనపనికాదు. కాని మావాళ్లు మూడు తరాలనుండి మహాగౌరవముగా కాలముగడుపుకు వచ్చారు; నేను వచ్చేసరికి మాగౌరవము ముక్కలయి, గుండ పిండిఅయి పోయింది. ఆమాటే తలచుకొంటూఉండడమువల్ల రాత్రిగాని పగలుగాని నాకు శాంతిలేదు; అనేకసార్లు ఆత్మహత్య చేసుకొని పోవలెననికూడా బుద్ధిపుట్టింది. కాని ఇప్పుడు ముసుగూ మాతా అన్నీ పక్కకుతోసేసి చిత్రాలలోనూ, ఉత్తరాలకట్టల లోనూ, ఎన్నాళ్ళనుంచో దాంగొనిఉన్న పాపకృత్యాలు, దావాలద్వారా, వార్తాపత్రికలలోకిఎక్కి, కిలకిల్లాడుతూ గుహా గహ్వారాలలోనుంచి బయటకువస్తూఉన్న నల్లని పురుగులపుట్ట వలె, నలుదిక్కులా వ్యాపించేసరికి ఇన్నాళ్లూ నానెత్తిమీద కూర్చొనిఉన్న భారము నేలపడిపోయింది. పూర్వులఖ్యాతి నిలుపుకొంటూ రావలెననే పూచీ వదిలింది, నేను తలలు కొట్టే బాపత్తు అని అందరికీ తెలిసిపోయింది—సుఖపడ్డాను.

ప్లీడరూప్లీడరూ పోట్లాడి అంతా బయిటికి లాగేస్తారు అనే భయములేదు, నేనుచేసిన పాపములన్నిటిలోకీ గొప్ప పాపము కోర్టుద్వారా బయటకువచ్చేమార్గములేదు. ఎందు చేతనంటే నామీద ఫిర్యాదులు చేయగలవాళ్లు అందరూ పోయినారు, మిగిలిఉన్నవాడను నేను ఒక్కడనే. అందుచేతనే

ఆవృత్తాంతము నలుగురికీ తెలియజేతామనే ఉద్దేశముతో ఈవాళ నేనే కలము చేతపుచ్చుకోవలసివచ్చింది.

మా తాతగారిపేరు ఉద్ధవదత్త. తన యజమాని దురవస్థలో ఉన్నప్పుడు మాతాత తన డబ్బంతాపెట్టి అతనిని కాపాడాడు. అందువల్ల మాదారిద్ర్యమే ధనవంతులధనముకంటె గొప్పవస్తువు అయింది. మాతండ్రి, సనాతనదత్త, 'డిరోజియో' శిష్యుడు—త్యాగుడుకావలసినంత ఉండేది నిజమే, గాని అంతకు పదిరెట్లు ఉండేది అతనికి నిజముఅంటే వెర్రి. అమ్మ మాఅందరికి ఒకనాడురాత్రి, 'మంగలివాడికథ' చెపుతూ ఉండగా నాన్న విన్నాడు. ఆమర్నాటినుండి చీకటిపడ్డతరువాత మాలో ఎవరూ ఇంట్లోకి వెళ్ళకూడదు అని నాన్న ఆజ్ఞాపించాడు. అప్పటినుంచి మా పడకకూడా ముందుగదిలోనే—మా చదువు గదిలో. ఆ గదిగోడలనిండాఉండే మ్యాపులు అబద్ధముఅంటే ఏమిటో ఎరగవు. ఆ మ్యాపులు దయ్యాలకథలూ భూతాలకథలూ ఎరగవు, అవి సప్తసముద్రాలకథలను దగ్గిరికి రానిచ్చేవి కావు, పదమూడునదులకథలను దూరానే ఉంచేవి. మాట ఖరారువిషయములో మానాన్నకు చాలా పట్టుదల, నాలుగు వైపులా గాలి అతిపరిశుభ్రముగా ఉండాలి అతనికి. ప్రతిచిన్న విషయములోకూడా మమ్మల్ని కట్టుబాటులో ఉంచేవాడు. ఒకనాడు హాకర్ ఎవడో వచ్చి మా అన్నకు ఏదో చిన్నవస్తువొకటి అమ్మాడు. ఆవస్తువుకట్టి ఉన్న తాడూకాగితాలతో అమర్నాడు నేను ఆడుకొంటూ

ఉండగా నాన్న చేరాచాడు, వాటిని ఖరీదు ఇచ్చికొనలేదు, అవి వాడికి తక్షణము ఇచ్చేసిరా అన్నాడు. ఆ కాగితము ముక్కలూ తాడూ ఆ హాకరికి ఇచ్చేదాకుని నేను ఊరంతా పరుగెత్తవలసి వచ్చింది.

మేము సాధుత్వము అనే జైలులో పెరిగి పెద్దవాళ్ళము అయినాము. మేము 'మనుష్యులము' అయినామని అనకూడదేమో! నియమాలు, మాజైలుచుట్టూ ఉండే ఇనపకడ్డీలు. మేముతప్ప పృథ్వీమీదఉన్నవాళ్లంతా మనుష్యులే—మేము మనుష్యులముకాము, మేము నిదర్శనరూపమైన వస్తువులము మాత్రమే. మేముఆడే ఆటలులో ఎటువంటి ఉల్లాసమూఉండేది కాదు. మాలో హాస్యపరిహాసాలు సున్న, మాకథలు రసము లేనివి; మాటలు అతిస్వల్పము, నవ్వు సంకుచితము. మా పనులు కలితీలేని నిర్దవస్తువులు. దీనివల్ల మాబాల్యలీలలకు కలిగిన లోటును నలుగురివల్లా పొందినస్తోత్రముతో నింపుకొనే వాళ్లము. 'దత్తు'లఇంటిపిల్లలు సత్యయుగమునుంచి దారితప్పి వచ్చి ఇక్కడపడ్డారు అని స్కూల్‌మాస్టర్ మొదలు బజారు లోనున్న చిల్లరదుకాణదారునివరకు ప్రతివాడూ అంటూఉండే వాడు.

రాళ్లుపేర్చిచక్కాచేసిన రోడ్డులోకూడా ఎక్కడో చిన్న సందు దొరికేసరికి ప్రకృతి తన ఆకుపచ్చని జయపతాకము మీదికి ఎత్తుతుంది. నా పసిజీవితములో ప్రతిరోజూ ఏకాదసే! కాని నా ఉపవాసాలమధ్య ఒక చిన్నసందు ఏర్పడ్డది. ఆ

సందులోనుంచి అమృతముయొక్క రుచి కొంచెము నాకు ప్రాప్తించింది.

ఎటువంటి నిర్బంధమూ లేకుండా మేము వచ్చిపోగలిగిన ఇళ్లు వనాలుగో ఉన్నవి. అఖిల్ బాబుగారిఇల్లు ఆనాలుగింటిలో ఒకటి. ఈయన బ్రహ్మసమాజస్థుడు. నాన్నకు ఈయనంటే చాలానమ్మకము. ఈయనకు ఒకకొమార్తె ఉన్నది. ఆమెపేరు అనసూయ. ఆమె నాకంటె ఆరేళ్లు చిన్న. ఆమెమీద అధికారము నాదే !

ఆమె లేతముఖానఉండే కనుబొమ్మలు ఇప్పటికీ నాకు జ్ఞాపకము వస్తూఉన్నవి, అవి బహుగాఢమైన నలుపుగలవి, ఎంతతీక్ష్ణమైనవెలుతురైనా ఆ కనుబొమ్మలఛాయద్వారా ఆమె కళ్ళలోనికి ప్రవేశించేసరికి అతికోమలము అయిపోయేవి. ఆమె ఎవరివైపైనా చూస్తూఉంటే ఎంతోప్రేమ కనబడేది ఆమె ముఖములో. జడవేసికొన్న జుట్టు వీపుమీద వేలాడుతుండేది. ఆజుట్టూ, ఆమె రెండుచేతులూ నాకు ఎప్పటికీ మరుపురావు. ఆమెచేతులలో ఒకవిధమైన అందమూ, మృదుత్వమూ, ఉండేవి; ఇంకెవరిచెయ్యో పట్టుకొని ప్రయాణముచేదామనే కోరిక ఆచేతులలో కనబడేది. తనలేతచేతిని విశ్వాసపూర్వకముగా మరిఒకరి చేతిలోపెట్టి ప్రయాణముచేదామనే కోరికతో దారి వైపు చూస్తూఉన్నట్లుండేది.

నాకంటికి, ఆమె ఆలాగు అప్పుడు కనబడేది అనిచెపితే నేనుచెప్పేది బహుశా సరిగా నిజము కాదేమో! కాని అనేక

విషయాలలో మనస్సుకు ముందుగా ఏవో ఊహాలు తట్టు తుంటవి—మనకు వాటినిగురించి పూర్తిగా తెలియకముందే మన మనస్సులో వాటి ప్రతిబింబాల ఛాయలవలె అనేకముగా పడుతూఉంటవి—ఎప్పుడో ఒకనాడు ఎక్కడనుండో వచ్చి వెలుతురు మనలోపల పడేసరికి ఆబొమ్మలు మనకంటికి స్పష్ట ముగా కనబడతవి.

అనసూయను కాపాడగల కఠినమైన పహరా ఏదీ ఉండేది కాదు, ఆమె బహుసులభంగా ఏదిపడితేఅది నమ్మేసేది. 'అను' వాళ్ళ ముసలిదాసీదగ్గర దయ్యాలనుగురించీ, భూతాలను గురించీ చాలా జ్ఞానము సంగ్రహించినది. మా చేదువుగదిలో చెత్తఅంతాతోసేసే మూలను ఉండడానికి అర్హతలేని దాజ్ఞానం. మా గది జ్ఞానభాండాగారము. దానిగోడలను నింపిఉన్నవి మ్యాపులు! ఇంతే కాదు, ఆ ముసలిదాసీదగ్గిర నేర్చుకొన్న కథలకు అను తనఊహావల్ల మరికొంత కలిపేది—వాటికి ఒక దారీ తెన్నూ ఉండేదికాదు. ఇటువంటి విషయాలలో అనువాద కేవలము దబాయించి అధికారము చలాయించవలసివచ్చేది. "అదంతా నిజముకాదు, దానివల్ల ఎంతోపాపము, తెలుసునా అనూ!" అని నేను చెపుతూండేవాడను. నా మాట వినగానే అను కనుబొమ్మలనీడ, భయమువల్ల, మరింత నల్లగాఅయి పోయేది. అనుకు చంటిచెల్లి ఒకతె ఉండేది, ఆచెల్లి ఏడుపు చల్లారుద్దామని ఎన్నోకథలు ఆమె కల్పించేది. ఆ పిల్లను మరి పించి పాలుపట్టాలి; ఆదగ్గిరఉన్న పక్షినిదేనినో తోలుతున్నట్టుగా

గట్టిగా 'హేవ్ కాక,' అనేది, అక్కడ ఏమీలేనిదే. బహుగంభీరంగా చెప్పేవాణ్ణి అలా అనకూడదు అని. "నువ్వుఆడే ప్రతి అబద్ధమూ దేవుడు వింటున్నాడు తెలుసునా! భగవంతుణ్ణి తక్షణమే క్షమాపణకోరుకో!" అనినేను అంటూఉండేవాడను.

ఈలాగు అనేకవిషయాలలో నేను ఆమెమీద అధికారము చలాయిస్తూఉండేవాడను, ఆ అధికారము ఆమె పూర్తిగా అంగీకరించేది. తాను అపరాధిని అని ఆమె ఒప్పుకొంటూఉన్నకొలది నాలో ఆనందము అధికమవుతూఉండేది. నేను అనేకకఠినమైన కట్టుబాట్లద్వారా మంచిపిల్లవాడనయి నాను. కనుక ఆ శిక్షణంతా ఇతరులమీద ప్రయోగించి వాళ్ళను మంచివాళ్లను చేసే అవకాశము నాకు దొరికినప్పుడు, నేను చిన్నప్పుడు చెల్లించినఖరీదు తిరిగి నాచేతికివచ్చినట్టుగా ఆనందించేవాడను. తనకంటె నేను చాలాగొప్పవాడను అని అను నమ్మేది తనకంటెమాత్రమేకాదు, లోకములోఉండే అనేకమందికంటె కూడా గొప్పవాడను అని నమ్మేది.

పెద్దవాడను అవుతున్నాను, స్కూలువదలి కాలేజీలోకి వచ్చాను. అనును నావంటి మంచిపిల్లవాడికి పెళ్లిచేదామని అఖిల్ బాబుభార్యకోరిక. పిల్లలుఉండే ప్రతితండ్రీ నామీద కన్నువేసే ఉంటాడు అని నేనుకూడా నమ్మేవాడను. కాని బి. ఎల్. ప్యాసయి కొత్తగా 'మున్సిఫ్' ఉద్యోగము సంపాదించాడట ఎవరో, అనూను అతనికిచ్చి పెళ్లిచేయడానికి

నిశ్చయించారని విన్నాను. మేము నిరుపేదలము. అందుచేతనే మేముచేసేపనులవిలువ చాలాఅధికము అని నేను అనుకొనే-వాడను. కాని ఆడపిల్లలుగల తండ్రుల ఆలోచనధోరణి వేరు.

పూజ అయిపోయింది, సరస్వతీదేవి ప్రతిమ నీళ్ళల్లో మునిగి, ఏమూలనో, అట్టడుగున, అన్నిటిదిగువను, చేరుకొని ఉంటుంది. చిన్నప్పటినుండీ నేను అన్నిటికంటె బాగాఎరిగి ఉన్నప్రాణము ఒక్కరోజులో ఆ అపరిచితమానవసముద్రములో మునిగి మాయమయిపోయింది. ఆనాడు నాకుగలిగిన బాధ నామనస్సుకే తెలియాలి. కాని ఉత్సవము అయిపోయి, ప్రతిమ మునిగిపోయినతరువాతకూడా నామనస్సులోఉన్నది దేవివిగ్రహమా? కాదు కాదు. నా స్వాభిమానానికి ఆనాడు పెద్దదెబ్బతగిలింది, అందుచేత నామనస్సులో మరింత పెద్ద కెరటాలను సృష్టిచేశాను. అనును ఎల్లప్పుడూ చిన్నదానినిగానే ఉంచాను, ఆనాడూ ఆమెను నాతోసరిపోల్చిచూచి మరింతచిన్న దానిని చేశాను. నా గుణాలకు తగిన పూజ ఆ నాడు జరగక పోవడం -ఈ ప్రపంచములో జరగబోయే అన్ని అశుభాలకంటె గొప్ప అశుభమని భావించాను.

కానీ!

కాని, బోధపడ్డది - ప్రపంచములో మంచివాళ్ళమయి ఉన్నంతమాత్రాన ఏమీ లాభములేదు అని బోధపడ్డది, డబ్బుగడించవలెను అని నిశ్చయించుకొన్నాను. నాడబ్బు చూచి

అఖిల్‌బాబు, "ఆహా ఎంత మోసపోయినాను!" అనుకొని వాలి—అంతడబ్బు గడించాలని దీక్షపట్టి కూర్చున్నాను, దానికితగిన ప్రయత్నములో పడ్డాను.

ఇటువంటిప్రయత్నాలు సఫలముకావలెనంటే ముఖ్య-ముగా కావలసినది ఆత్మవిశ్వాసము, తనను తాను నమ్మడము. ఆవిషయంలో మాత్రము నాకు ఎట్టిలోటూలేదు. ఆ నమ్మకానికి అంటురోగాలకుఉండేగుణము ఒకటిఉన్నది. తననుతాను నమ్మేవాడిని లోకులుకూడా నమ్ముతారు. చేయబూనుకొన్న పని చక్కగా చేసేబుద్ధి, సాధారణముగా అందరిలో ఉండేదాని-కంటె, నాలో బాగాఉన్నది; అది నాకు స్వాభావికము అని నలుగురూ అనుకోవడము మొదలుపెట్టారు.

వర్తకతత్వగ్రంథాలతోనూ, పత్రికలతోనూ, నా బీరువాలు నిండిపోయినవి, నా టేబులునిండిపోయింది. ఇల్లు మరామతుచేయించాను. ఎలెక్ట్రిక్‌లైటు స్విచ్చిలతోనూ పంకాలమీటలతోనూ గోడలు నింపాను. బజారుధరలూ, బజారుధరల గూఢతత్వమూ, ఎక్స్చేంజి రహస్యమూ, ప్లానింగూ, ఎస్టిమేటింగూ,—ఈ సమస్తవిషయాలలో పండిపోయినాను, ఎవరూ నాతో చాలలేరు అన్నంతపాండిత్యము సంపాదించాను.

రాత్రింబగళ్లు అనేకతరహాల పనులనుగురించి మాటలాడుతుండేవాడను, గాని పనిలోకిమాత్రం ఇంకాదిగలేదు—

ఈవిధముగా చాలాకాలము గడిపాను. నాభక్తులు ఏదోఒక స్వదేశీకంపెనీని పెట్టి అందులో నన్ను చేరమనేవారు. మనదేశములో ఏర్పరుస్తూఉన్న ప్రతికంపెనీలోనూ ఏదోఒకలోపము ఉంటూఉన్నది, సరిగా నడిచేపాటిసత్తువ ఒకదానిలోనూ ఉండేది కాదు, అది వాళ్లందరికీ బోధపరిచేవాడను. అంతేకాక, సత్యముతప్పకుండా నడుచుకోవలెనన్నవాడు వాళ్ళతో చేరడము కూడదనిపని. "ఏదో పని పెట్టుకొన్నతరువాత, 'సత్యమే' 'సత్యమే' అంటూ లగాముబిగించి కూర్చుంటే వీలు లేదు, ఏకాస్తో మధ్యమధ్య వదలుతుండాలి," అనేవాళ్లు నాస్నేహితులలో అప్పుడప్పుడు కనబడకపోలేదు—కాని ఆలాగు అన్న తరువాతమాత్రం అట్టి స్నేహితులతో ఎటువంటిసంబంధమూ ఉంచుకొనేవాణ్ణికాను.

చక్కనిప్లాన్లూ, ఎస్టిమేట్లూ, ప్రాస్పెక్టస్‌లూ, తయారుచేసేశక్తి నాలో ఉన్నదన్న కీర్తి బాగాసంపాదించాను. ఈ కీర్తి నేను చచ్చేవరకూ నిష్కళంకముగా ఉండి ఉండును. కాని విధివశాత్తు ప్లానులనుంచి పనులలో దిగవలసి వచ్చింది. దానికి మొదటికారణము ఏమిటిఅంటే, మా నాన్న కాలము చేయడముచేత, ఇంటిభారమంతా నానెత్తిమీద పెట్టుకోవలసి వచ్చింది. ఇదికాక ఇంకొక కారణముఉన్నది, ఆ కథే ఇప్పుడు నేను చెప్పబోయేది.

నాతో, చదువుతుండే వాడు 'ప్రసన్న' అని ఒకకుర్ర వాడు ఉండేవాడు. వాడు ఒక వేలుడుకాయ, ఎల్లప్పుడూ

ఎవడినో ఒకణ్ణి తిడుతూనే ఉండేవాడు. మానాన్న సత్య వ్రతాన్ని వేళాకోళముచేయడానికి అతనికి ఒక మంచిసందు దొరికింది. నాన్న నాకు సత్యధన్ అని పేరుపెట్టాడు. కాని మా లేమి చూచి ప్రసన్న అనేవాడు, "మీనాన్న నీకు మిథ్యాధనము ఇచ్చి పేరుమాత్రం సత్యధన్ అని పెట్టాడు, కాని పేరు మిథ్యఅయి ధనము సత్యమయిఉంటే అంతకంటె చాలాబాగా ఉండేది." ప్రసన్న నోరుఅంటే నాకు బహు భయం.

అతడు ఎక్కడికో వెళ్లిపోయినాడు, చాలా కాలము వరకు నాకు కనబడనేలేదు. నానారకాల పనులుచేస్తూ బర్మా లుథియానా, సింగాపూర్, శ్రీరంగపట్నము, మొదలైన దేశాలన్నీ తిరిగాడట. అన్ని దేశాలూ తిరిగి చివరకు కలకత్తా వచ్చాడు, వచ్చి నా వెంట పడ్డాడు. అతని వెటకారాలు జ్ఞాప కమువచ్చి అతనిమాట అనుకొనేసరికి అతిభయము వేసేది ఇన్నాళ్లూ; అటువంటివానిలో ఇప్పుడు ఇంతభక్తి కనబడేసరికి నాకుకలిగిన ఆనందము ఇంతా అంతా కాదు.

ప్రసన్న నాతో ఒకనాడు ఈలాగుఅన్నాడు,— "చూడురా అబ్బాయి, ఇదే నేను చెప్పడము, జ్ఞాపకము ఉంచుకో, నువ్వు ఎప్పుడో ఒకనాడు రెండో 'మతీశీల్' వో లేక 'దుర్గా చరణ్ లా'వో కాకపోయినప్పుడు నేను "బౌబజారు-రోడ్డుమూలనుంచి బాగ్‌బజారుచివరవరకూ ముక్కు నేలమీద రాసుకుంటూ వెళ్లుతాను!"

ప్రసన్న నోటివెంటవచ్చిన మహావాక్యయొక్క అర్థము, ప్రసన్నతో కలిసి ఒక్క క్లాసులో చదివినవాళ్లకు తప్ప, ఇంకెవరికీ తెలియదు. అంతేకాదు, ప్రసన్నలోకమంతా సంచారముచేసి వచ్చినవాడు, అతడుఅనే మాటలకు విలువఉన్నది.

ఇంకొకమాట అన్నాడు ప్రసన్న, "వ్యవహారరీతులను బోధపరుచుకొన్నవాళ్లను అనేకమందిని చూచాను తండ్రీ, కాని అందరికంటె అధికంగా బోల్తాలువేసేవాళ్లు వాళ్లే. వాళ్లు కేవలము బుద్ధినే ఆధారముచేసుకొని పైవాళ్ళఆట కట్టేదామని చూస్తూఉంటారు; బుద్ధికంటె చాలాపైగాఉన్న సత్యముమాట జ్ఞాపకముఉండదు వాళ్ళకు- కాని నీలో ఆరెండూ వేరువేరుపదార్థాలూ కావు, రెండూ ఒకటే! ఏపని చేయవూనుకొన్నా తగిన బుద్ధి నీలో ఉన్నది ఇవతల, అవతల సత్యమాఅంటే, మరిచెప్పనక్కరనేలేదు కదా, సత్యాన్నితప్ప దేనినీ దగ్గిరకే రానియ్యవు నీవు."

ఆ రోజులలో 'వర్తకము' 'వర్తకము' అంటూ కలకత్తాలో అందరికీ ఒక వెర్రి. వర్తకమువల్లతప్ప మనదేశానికి మరిదేనివల్లా ముక్తి లేదు అని అంతా కలిసి ఆలోచించి తేల్చారు. పెట్టుబడికి డబ్బు దొరికితే ఏదో ఒకవర్తకము ప్రారంభించనివాడు ఫీడర్లలోగాని, డాక్టర్లలోగాని, మాస్టర్లలో గాని, చదువుతూఉన్న విద్యార్థులలోగాని, విద్యార్థులతండ్రులలోగాని ఒక్కడులేడు.

"నాకు అటువంటి ఊరత ఏదీ లేదు," అని నేను ప్రసన్నతో ఒకనాడు అన్నాను.

"నీకు లేకపోవడము ఏమిటి! మీతండ్రి ఉంచి వెళ్లిన డబ్బంతా ఏమిచేస్తావు?" అన్నాడు ప్రసన్న.

ఇన్నాళ్లూ, అయితే, ప్రసన్న నాతో హాస్యమాడు-తున్నాడా అని అప్పుడు నాకు హఠాత్తుగా తట్టింది.

"వేళాకోళము చేయడము లేదు. నేనుఅంటున్నది నిజమే," అన్నాడు ప్రసన్న. "సత్యము అనేదే లక్ష్మీదేవి యొక్క సువర్ణపద్మము. రూపాయిలవల్ల కాదు వర్తకము సాగేది, నలుగురికీ మనలోగల నమ్మకమువల్ల."

మానాన్న ఇంటికి అధికారిగాఉన్నప్పటినుండి మాచుట్టు ప్రక్కలఉండే వితంతువులంతా వాళ్లరూపాయిలు మాఇంట్లో దాచుకొంటూఉండేవాళ్లు వడ్డీకి ఆశించి వాళ్లు ఆపని చేయ-లేదు. ఎక్కడికి వెళ్లినా మోసపోతామేమో అని ఆశ వాళ్లకు భయము ఉండకమానదు, గాని మాఇంట్లోమాత్రము అటువంటిభయము అక్కరలేదు అని వాళ్లకు తెలిసి అలాచేసే-వారు.

ఆ దాచిన సొమ్ముతో 'స్వదేశి'వర్తకము ఆరంభించాను. కాగితాలూ, కలాలూ, సిరాబుడ్లూ, బొత్తాములూ, బట్టలూ, ఎన్ని తెప్పిస్తే అన్నిఖర్చుఅయిపోతూఉండేవి. వర్తకులు దీపము

చుట్టూ చేరిన రెక్కపురుగులలాగు, నాచుట్టూ చేరుతుండే-వారు.

ఎవరికైనా జ్ఞానము విస్తారముఅవుతున్నకొలదీ తనకు తెలిసినది ఇంతకొంచెమకదా అని బోధపడుతుంటుంది—డబ్బు విషయములోకూడా అదేమోస్తరు. మనము కూడబెడు తున్నరూపాయిలు అధికమవుతున్నకొలది 'ఈమాత్రము ఉంటే నేమి లేకపోతే నేమి' అనిపిస్తూఉంటుంది. నేను అటు వంటిధోరణిలో ఉంటూఉన్నప్పుడు ప్రసన్న ఒకనాడు నాదగ్గిరికి వచ్చి అన్నాడు—తననోటితో తాను అనలేదు గాని నాచేత అనిపించాడు—"చిల్లరవ్యాపారము చేసుకొంటూ ఈలాగు కాలముగడపుతూ ఉండడము జీవితము వృథావ్యయముచేసి నట్టే. ప్రపంచములో ఒకమూలనుంచి మరిఒకమూలవరకు అల్లుకొని అంతటా వ్యాపించే వ్యాపారమే వ్యాపారమంటే! మనదేశములోపలనే తిరుగుతూఉన్నరూపాయిలు, గానుగ ఎద్దులమోస్తరు; గిరగిరతిరిగి చావడమే గాని ఒక్కఅడుగు ముందుకువెళ్లవు," అని నేను అన్నాను.

ఇటువంటిలోతైన జ్ఞానముగల మాటలు ఇంతకుముందు ఎన్నడూ వినలేదు అన్నట్టుగా అతిశ్రద్ధతో విన్నాడు ప్రసన్న, నిశ్చేష్టుడయి. మనదేశములో పండుతూఉన్న అవిసిగింజల పంటనుగురించీ, వాటి ఎగుమతినిగురించీ, అతనితో అన్నాను; పదుసంవత్సరాలలెక్కలు కాగితముమీద వేసి చూపించాను.

ఎంతెంతసరకు ఎక్కడెక్కడికి వెళ్లుతున్నదో; ఎక్కడ దానికి ఎంతఖరీదు వస్తున్నదో, ఖరీదు ఎంతకుజాస్తీకాదో, ఎంతకు-తగ్గదో, చెల్లలో కొంటే మనకు ఏఖరీదుకు దొరుకుతుందో, ఎగుమతికి రేవుకుచేరేసరికి దానిఖరీదు ఎంతఅవుతుందో పండించేవాళ్ళదగ్గిర కొని విదేశాలకు తీసుకొనివెళ్ళి మనమే అమ్ముకొంటే ఎంతలాభము రాగలదో—అదంతా లెక్కవేసి చూపించాను. ఒకొక్కదగ్గిర గీతలుగీసి లెక్కలు కట్టాను, మరిఒకచోట పెర్సెంటేజికట్టి చూపించాను. ఈలాగు నల్ల సిరాతోనూ, ఎర్రసిరాతోనూ వేసిన అంకెలతో పదెనిమిది పెద్దపెద్దపేజీలు నింపి ప్రసన్నచేతిలో పెట్టాను. ప్రసన్న గాబరాపడి నా పాదధూళి తీసుకోంటూ, "నే నిన్నాళ్ళూ దీనిలో కొంతకాకపోతే కొంతైనా ఎరుగుదునని అనుకొనే వాడను, గాని ఈవాళనుంచి నీదగ్గిర అప్రెంటిస్‌గా ఉండ నిశ్చయించాను," అనిఅన్నాడు.

తరువాత నేనుచెప్పినదానిని ఖండించబోతూ అన్నాడు, "యో ధృవాణి పరిత్యజ్య—జ్ఞాపకము ఉంది కదూ? లెక్క-లలో తప్పుండవచ్చునే!"

నాకుపౌరుషమువచ్చింది. నేనువేసిన లెక్కలలో ఎటువంటి తప్పూలేదు స్థిరపరచడానికి, ఎవరూఖండించలేని ప్రమాణాలు చూపిస్తూ పేజీలమీద పేజీలు నింపేశాను. ఎటువంటి ఎటువంటి నష్టము రావచ్చునో పట్టీలుతయారుచేసి అంకెలు నిలవ

బెట్టాను ఒకదానికింద ఒకటి! ఏలాగుచూచినా కనీసపక్షము నూటికి పాతిక ఇరవై రూపాయిలు లాభము వచ్చితీరుతుంది అని చూపించాను.

అలాగు ఈ చిల్లరదుకాణాలనేకాలువలు వెళ్లి వెళ్లి వర్తకమహాసముద్రములో చివరకు పడ్డప్పుడు అదంతా నేను పట్టినపట్టువల్లనే అని నాకు నమ్మకంకలిగేది. ఆగొప్ప పూర్తిగా నాదే!

దత్తవంశానికిఉండే పేరువల్లా, వడ్డీసంపాదించుకోందా మనే ఆశవల్లా నాదగ్గిర జమఅవుతున్న రూపాయలు అధికము అయిపోతూవచ్చినవి. ఆడవాళ్లు నగలు అమ్మేసి రూపాయలు నాకుఇవ్వడము మొదలుపెట్టారు.

పని ప్రారంభించాను, మరి దారీతెన్నూ కానరాలేదు. కాగితముమీద ఎర్రసిరాతోనూ నల్లసిరాతోనూ వ్రాసి నప్పుడు అంతఏర్పాటుగా తెలుస్తూఉండే లెక్కలన్నీ పనిలోకి దిగగానే కలగాపులగమయిపోయినవి. వర్తకముచేసేసామ ర్థ్యము నాకు లేదు అని నాలోపలనుంచి ఏదో చెపుతూ వచ్చింది. సామర్థ్యములేదు అని ఒప్పుకొనే శక్తి నాలో లేక పోయింది.అందుచేత వర్తకమంతా సులభముగా ప్రసన్నచేతిలోకి వెళ్లిపోయింది. 'మనవ్యాపారానికి మార్తా కర్తావిధాతా అంతా నువ్వే' అన్నమాట తప్ప వేరుమాటలేదు ప్రసన్ననోటివెంట. ప్రసన్నచేస్తూఉన్న ఆలోచన ప్రసన్నదీ, పంతకాలు నావీ, అతనిబుద్ధి నాపిత్రార్జితపరపతి—వీటి సహాయమువల్ల మా

వర్తకము నాలుగు కాళ్లూ ఎగరవేసుకొంటూ ఏదారిని పరుగెత్తడం మొదలుపెట్టిందో ఏమిపోల్చుకో లేకపోయినాను.

చూస్తూచూస్తూఉండగానే అడుగందని అగాధంలోకి వచ్చిపడ్డాము, ఎటూ దరి కానరాలేదు. చుక్కాను విడిచిపెట్టి నలుగురికీ నిజముచెప్పేస్తే నా సత్యాన్ని నిలబెట్టుకొన్నవాడను అయిఉందును గాని, ప్రపంచములో నిజానికి ఉండవలసిన ఖ్యాతిని మాత్రం నిలబెట్టి ఉంచలేకపోయిఉందును. నాదగ్గిర నలుగురూ దాచుకొన్న రూపాయిలకు వడ్డీఇస్తూవచ్చాను— వర్తకములో రాబోయే లాభము కాక పైగా ఇచ్చినది ఈవడ్డీ, అందుచేత వడ్డీజాస్తీగా ఇచ్చి ఈ రూపాయిలు తీసికొని రావలసివచ్చింది.

ఇప్పటికప్పుడే చాలాకాలమయింది నాకు పెళ్లిఅయి; ఇంటిసంసారముతప్ప ఇంకేబెడదా నాభార్యకు అక్కరలేదను కొనేవాడను ఆమె ధోరణి చూచి. కాని అగస్త్యమహాముని లాగు సముద్రమంతా ఒక్కగుటకలో మింగేదామనేఆశ ఆమెలోకూడా లేకపోలేదు అని ఒకనాడు నేను హఠాత్తుగా కనిపెట్టాను. నాలోపుట్టిన ఈగాలి నలుగురికీ ఎప్పటినుండితాక డము ప్రారంభించిందో నాకు తెలియలేదు. మా దాసీదీ, మా నౌకరూకూడా తమరూపాయలు నావర్తకములో పడేశారు. నాభార్య నగలుకొన్ని అమ్మేసి ఆ రూపాయిలు నాచేతిలో పెట్టి లాభము సంపాదిద్దామని నిశ్చయించుకొనికూర్చొన్నది.

నేను మంచిమాటలతో చెప్పాను, చీవాట్లు పెట్టాను, లోభము వంటి శత్రువు వేరొకటి లేదని బోధపరిచాను—నాభార్య రూపాయి మాత్రము నేను పుచ్చుకోలేదు.

భార్యడబ్బు పుచ్చుకోవడము ఏలాగు కష్టమునిపించిందో, ఇంకొకరి డబ్బువిషయములోకూడా అలాగే నాకు కష్టము అనిపించింది.

'అను'కు ఒకకొడుకు పుట్టినతరువాత భర్తపోయినాడు. ఆభర్తకు డబ్బెంతఉన్నదో కృపణతకూడా అంతఉన్నదని అంతా అనేవారు. లక్షొయాభై వేలరూపాయిలవరకు కూడబెట్టాడని కొందరు అనేవారు, మరికొందరు అతనిఆస్తి అంతకంటె చాలా అధికము అని అంటూఉండేవారు. లోభములో అను తన భర్తయొక్క సహధర్మిణే అని నలుగురూ అంటూఉండగా నేను విన్నాను, ఆ మాటనిజమే అయిఉండవచ్చును అని అనుకొన్నాను. పాపము, ఆమెకు తగినశిక్షణా లేదు, తగిన సహవాసమూ లేదు కదా!

ఆరురూపాయిలు నావర్తకములో వేయమని అనూ నావద్దిరికి కబురుపంపింది. నాకూ ఆశపుట్టింది. రూపాయిల అవసరముకూడా బాగా ఉండెను, కనుక నే భయపడి అనును చూడడానికైనా వెళ్ళలేదు.

ఈలా ఉంటూఉండగా ఒకపెద్ద హుండీ చెల్లించవలసిన వాయిదా దగ్గిరపడ్డది. ప్రసన్న నావద్గిరికి వచ్చి అఖిల్‌బాబు

భార్య ఇస్తానన్నరూపాయిలు పుచ్చుకోకపోతే ఇక మరి గడవదని అన్నాడు.

"వేరుదారి లేకపోతే ఎవరింట్లోనైనా కన్నము వెయ్యమంటే వెయ్యగలను గాని, ఆ పనిమాత్రము నాచేత కాదు," అని నేను జవాబుచెప్పాను.

"నీలో నీకు నమ్మకము ఎప్పుడుతగ్గిపోయిందో అప్పటినుండే వర్తకములో నష్టము ప్రారంభము అయింది—మనము సాహసంకనపరుస్తున్నాళ్లే అదృష్టమువచ్చి మనఒళ్లో పడుతూ ఉంటుంది," అన్నాడు ప్రసన్న. అతడు ఏమిఅన్నా నేను మాత్రము ఆ సొమ్ముపుచ్చుకోడానికి ఒప్పుకోలేదు.

ప్రసన్న మర్నాడు వచ్చి, "దక్షిణాదినుండి గొప్ప మహారాష్ట్రజ్యోతిష్కుడొకడు వచ్చాడట, జాతకముతీసుకొని పద, అతనిదగ్గిరికి వెళ్లుదాము," అని అన్నాడు.

ఆహా! సనాతనదత్తవంశములోనివాళ్లకు అఖరుకు జాతకాలు చూపించుకొనేదశకూడా పట్టుతుంది కాబోలు! మనబలము తగ్గిపోయినప్పుడు మనమనస్సులోపల దాగిఉన్న కిరాతకునికి బలమువస్తుంది. మనను భయపెట్టేది. ఏదైనా మీద పడబోతే కౌగలించుకొని నిశ్చయంగాకూర్చోడానికి, కళ్లకుకన బడని అదృష్టము ఒకటి, మనకుకావలసిఉంటుంది. నా తెలివితేటలను నమ్మకోవడమువల్ల ఎటువంటి సుఖమూలేక అన్నీ వదుల్చు

కొందామని బుద్ధిపుట్టింది. పుట్టిన నక్షత్రమూ, తిథీ వ్రాసుకొని జాతకము చూపించుకొందామని బయలుదేరాను.

కూలిపోవడానికి సిద్ధముగా ఉన్నది అంతా, ఇంకొక్క అడుగు వేస్తే చాలును, అన్నాడు జ్యోతిష్కుడు. కాని బృహస్పతి అనుకూలముగా ఉన్నాడట, ఏదో ఒక స్త్రీయొక్క ధనముద్వారా నన్ను రక్షించి నాకు గొప్పఐశ్వర్యము ఇప్పిస్తాడట.

ఈ జాతకము వ్యవహారములో ప్రసన్న చెయ్యి కొంత ఉన్నదని నేను అనుమానించవలసిఉండెను, కాని అనుమానించడానికి ఇష్టముకలగలేదు. ఇంటికివస్తూనే ప్రసన్న ఏదో ఒక ఇంగ్లీషుపుస్తకము నాచేతిలోపెట్టి ఆపుస్తకము విప్పమన్నాడు. విప్పాను, విప్పేసరికి అందులో, "వర్తకములో చాలాలాభము వస్తుంది," అని అచ్చుపడి ఉన్నది.

అనును చూదామని ఆనాడే వెళ్లాను. అను భర్తతో సదా కమానుతిరుగుతూ ఉండేది, ఆమెను మలేరియా పట్టి బాగా బలహీనంచేసేసింది, చివరకు ఎంత దుర్బలమయిపోయిందంటే, క్షయకూడా ప్రారంభము అయిందేమో అని డాక్టర్లు అంటూఉన్నారు. ఏదైనా మంచిస్థలానికి వెళ్లితే ఒళ్లు బాగు కావచ్చునని డాక్టర్లుచెపితే, "నేను ఈవాళకాకపోతే రేపైనా చావవలసినదాననే కదా, మా అబ్బాయి సుబోధ్ రూపాయిలు ఎందుకు పాడుచేయడం?" అనేది.

అనును వెళ్లి చూచాను. రోగము ఆమెను ఈపృథ్వి నుండి తీసుకొనిపోయి ఇంకొక ప్రపంచంలో పెట్టేసింది. ముఖము ఆమెవైపు తిప్పాను, ఎంతో దూరాన ఉన్నదన్నట్టు కనిపించింది. ఆమె దేహము ఒక స్వచ్ఛమైన పలచని పదార్థము అయిపోయింది, ఆమె లోపలనుంచి ఏదో ఒకచిత్రమైన కాంతి పైకి వస్తూ ఉన్నది. ఆమెలో స్థూలమైనదేది ఉండెనో అదంతా కరిగి పోయింది. ఆమెప్రాణము మృత్యుద్వారము వెలపలకు వచ్చి స్వర్గముయొక్క కాంతిలో నిలుచొనిఉన్నది. దయతోనూ, ప్రేమతోనూ నిండిఉన్నవి ఆమె రెండుకళ్లూ. వాటిమీద నల్లని కనుబొమ్మలు. కళ్ల క్రింద ఏర్పడ్డ నల్లనిగుడులు జీవనాంత కాలాన కనబడే సంధ్యఛాయలా అనిపిస్తున్నది. నిశ్చేష్టుడనై ఆమెవైపు చూస్తున్నాను, 'మనిషికాదు ఈమె, దేవత' అనిపించింది.

నేను కనబడగానే అనుముఖాన ఒకవిధమైన శాంతీ, ప్రసన్నతా వ్యాపించినవి, "నిన్నరాత్రి జబ్బుముదిరింది అప్పటినుండి నీమాటే జ్ఞాపకమువస్తూఉన్నది," అన్నది. "ఇక ఆట్టేరోజులు నేను బ్రతకను, ఎల్లుండి నీ నొసట ఆఖరు 'భాయి ఫోటా' ఉంచి వెళ్లతాను" అన్నది. నేను రూపాయిలమాట ఎత్తలేదు.

సుబోధను పిలిపించాను. ఏడుసంవత్సరాల అబ్బాయి సుబోధ్. అతనికళ్లు సరిగా తల్లికళ్లే. 'అహా ఈ పృథ్వీమీద

ఉన్నదంతా క్షణభంగురము కదా' అనే భావము ఆ పిల్లవానిని చూచేవాళ్లందరిలో పుడుతూఉంటుంది; పాపము, ఆ పిల్ల వాడికి తల్లిపాలు కావలసినన్ని దొరకలేదు కాబోలు అనిపిస్తూ ఉంటుంది. ఆతనిని దగ్గిరకితీసుకొనిఒళ్లోకూర్చోపెట్టుకొన్నాను, తలమీద ముద్దుపెట్టుకొన్నాను, పిల్లవాడు ఏమీ అనలేదు, నావైపు చూస్తూ కూర్చున్నాడు.

నేను ఇంటికి తిరిగి రాగానే, "ఏమిటి చేసుకువచ్చావ్?" అని ప్రసన్న అడిగాడు.

"ఈవాళ వీలుచిక్కలేదు," అన్నాను.

"వాయిదాకు మరి తొమ్మిదిరోజులు మాత్రమే వ్యవధి ఉన్నది," అన్నాడు.

'ఏక్షణము నాశనమయిపోతానో' అని నామనసులో ఒకభయంపుడుతూఉండెను. మృత్యుసరోవరములో తేలుతూ ఉన్నపద్మమువంటి అను ముఖము చూచినప్పటినుండి చాలా భాగము అభయం తగ్గిపోయింది.

ఇప్పటికిఅప్పుడే కొన్నాళ్లైఅయింది, చిత్రాలూ ఆ వర్ణాలూ చూడడము వదులుకొన్నాను. ఒద్దు కనబడములేదు, భయమువల్ల కళ్లు మూసుకొనే ఉండేవాడను. చచ్చినట్టు ప్రసన్న తీసుకువచ్చిన కాగితమల్లా సంతకముచేసేసేవాడను, అది ఏమిటో బోధపరుచుకొందామని ప్రయత్నమైనా చేయలేదు.

ప్రసన్న లెక్కంతా క్లుప్తముగా వ్రాసి భాయిఫోటూ నాటి ఉదయము నా ముందర పెట్టి బలవంతాన నాకు బోధపరిచాడు. పెట్టిన మూలధనము పూర్తిగా హరించిపోయింది— ఓడఅడుగు కన్నాలతో నిండిపోయింది. లోపలికి అప్పురూపాయిలు తోసుకు వచ్చేస్తూ ఉన్నవి, నీరుతోడి బయట పారేయకపోతే పడవ మునిగిపోతుంది.

ఏవిధముగా రూపాయిలమాట ఎత్తితే కార్యము నెరవేరుతుందో ఆలోచిస్తూ భాయిఫోటూవిందుకు అనుఇంటికి వెళ్లాను. ఆవాళ లక్ష్మీవారము, నాకు మరి మతిలేదు. గనుక లక్ష్మీవారము అని జ్ఞాపకమువచ్చి భయమువేసింది. రోజులు వంకరగాఉంటే మనుష్యుడికి తనబుద్ధి పనికిరాదు, నమ్ముకొని కూర్చోడానికి అది తప్ప ఇంకేదైనా చాలును, అందుచేత బయలుదేరుతున్నప్పుడు కొంచెము భయముగానే ఉండెను.

అనూకు జ్వరము అధికమయింది. నేనువెళ్లేసరికి మంచము మీద పడుకొనేఉన్నది. సుబోధ్ క్రింద గచ్చుమీద కూర్చొని ఉన్నాడు. ఏమీ మాటలాడడములేదు, చప్పుడు చేయడము లేదు. ఏదో ఇంగ్లీషుపుస్తకములోనుంచి బొమ్మలు కత్తిరించి ఒక నోటుబుక్కులో అంటిస్తున్నాడు.

వర్షసమయానికి చాలా ముందుగా అను ఇంటికి వచ్చాను. నాభార్యనుకూడా నాతో తీసుకువెళ్లవలెనని అనుకొన్నాను. కాని ఆమె మనస్సులో ఏమూలనో అను అనేసరికి

కొంచెము ఈర్ష్యపుట్టేది అనుకొంటాను, అందుచేత తీరా బయలుదేరేవేళకు ఏదో నెపం పెట్టింది. నేనూ అంతగా బలవంతము చేయలేదు.

"వదినను తీసుకు వచ్చావు కావే" అన్నది అను.

"ఒంట్లో బాగులేదు," అన్నాను.

అను నిట్టూర్పు విడిచింది, ఏమీ అనలేదు.

అది శరత్కాలము. నాలో మునుపు ఏ రవంతమాధుర్యము ఉండేదో దానిని ఆనాటి శరదాకాశము తనసువర్ణ కాంతితో కలుపుకొని ఆ రోగిమంచముమీద , వ్యాపించి ఉండెను. మేము ఆవాళ మాట్లాడుకొన్నవి—ఆహా, ఏమిటా మాటలు! అవి అనేక సంవత్సరాలనాటి చిన్న చిన్న మామూలు మాటలే, గాని నన్ను ముంచేయబోతున్న వినాశప్రవాహాన్ని మింగేసేటంత పెద్దవిగా ఆ చిన్న మాటలు ఆనాడు నాకు కనబడ్డవి. నా వర్తకముమాటా లాభనష్టాలమాటా—అంతా మరిచిపోయినాను.

భాయిఫోటావిందు అయిపోయింది. మరణయాత్ర చేస్తూఉన్న ఆమె నాకు దీర్ఘాయువుకోరుతూ, ఆకోరికను సూచించేబొట్టు నానొసట పెట్టి నా పాదధూళి తీసుకొన్నది. ఆమెకు కనబడకుండా నేను కళ్లుతుడుచుకొన్నాను.

గదిలోకి వచ్చి కూర్చున్న తరువాత టిన్ట్రంకుఒకటి తీసుకువచ్చి నాఎదుట ఉంచి అన్నది, "నేను సుబోధకోసము కూడబెట్టి ఉంచినదంతా ఇందులోఉన్నది. ఇదుగో నీకు అప్ప

చెప్పాను, దీనితో సుబోధనుకూడా అప్పచెప్పాను. ఇక ఎటువంటిచింతా లేకుండా సెలవుతీసుకోగలను."

"నన్ను క్షమించు అనూ, రూపాయిలు నేను తీసుకోను, సుబోధసంరక్షణకు ఏమీ లోటు రానియ్యను గాని రూపా యిలు మాత్రము మ రెవరిదగ్గిరనైనా ఉంచు," అని అన్నాను.

"ఈ రూపాయిలకోసము ఎంతోమంది చేతులు చాచు కొని కూర్చున్నారు, ఇవి తీసుకువెళ్లి వాళ్ల చేతిలో పెట్టేయ మన్నావా?" అని అను అన్నది.

నేను ఏమీ అనలేదు. అను ప్రారంభించింది, "సుబోధ ధోరణి చూస్తే అట్టేకాలము బ్రతికేటట్టు లేడని డాక్టరు అంటూఉండగా ఒకనాడు నేను దూరంనుంచి విన్నాను. విన్న ప్పటినుండి నేను వెనక దిగడతానేమో అని నాకు చాలా భయ ముగా ఉండెను; డాక్టరుఅభిప్రాయము తప్పుఅయిఉండవచ్చు ననే ఆశతోనైనా చావగలను ఇప్పుడు. ఇందులో పల్లభై ఏడు వేల రూపాయిలు, గవర్నమెంటుప్రామిసరీనోట్లరూపముగా ఉన్నవి. అవికాక మరికొన్ని రూపాయిలు ఇక్కడాఅక్కడా ఉన్నవి. సుబోధకు పథ్యంపానం జేరపడానికీ, మంచి మందులు ఇప్పించడానికీ ఇవి చాలును. కాని వాడిని భగవంతుడు చిన్న వయస్సులోనే తీసుకొనివెళ్లిపోతే ఏదైనా మంచికార్యములో ఈరూపాయిలు ఖర్చు చేసేయి."

"నన్ను నేను నమ్మేకంటె అధికంగా నువ్వు నన్ను నమ్ముతున్నావు అనూ," అని నేను అన్నాను.

విని కొంచెము నవ్వింది అను, నా నోటివెంట ఆ మాటలు ఉత్త వినయముకొద్దీఅన్నమాటలలాగు వినబడ్డవి.

వెళ్లిపోయేటప్పుడు పెట్టెతీసి ఏవి ప్రామిసరీనోట్లో, ఏవి నోట్లకట్టలో కనపరిచింది. అందులో ఆమె వ్రాసిన వీలుకూడా ఉన్నది, చూచాను. సుబోధ్ పిల్లలులేకుండా చనిపోయినా, చిన్నవయస్సులో చనిపోయినా, మిగతారూపాయిలన్నీ నాకు చెందవలసింది అని అందులో వ్రాసిఉన్నది.

నాడబ్బుతో సుబోధడబ్బు ఈలాగు కలపనిశ్చయించు కొన్నావేమి?" అని నేను అన్నాను.

"నాకొడుకుడబ్బుతో నీడబ్బుకు ఎటువంటివిరోధమూ ఎన్నడూ రాదు, నాకు తెలుసును," అన్నది.

"ఎవరినైనా ఇంత నమ్మడము వ్యవహారజ్ఞానానికి విరుద్ధము," అని నేను అన్నాను.

"నీవు ఎటువంటివాడవో నాకు తెలుసును, సత్యమంటే ఏమిటో నాకు తెలుసును. వ్యవహారపద్ధతులు తెలుసుకొనే-శక్తి నాకు లేదు," అన్నది అను.

ఆ పెట్టెలో నగలు కొన్ని ఉన్నవి. అవి చూపిస్తూ అన్నది, "సుబోధ్ బ్రతికిబాగుండి పెళ్లి చేసుకొన్నట్టైతే ఈ నగలు కోడలికి ఇచ్చి, నా ఆశీర్వాదం ఇయ్యి. ఈపచ్చేల

హారముమాత్రము వదినకుఇయ్యి, నామీద దయఉంచి ఇది పుచ్చుకోమని చెప్పు."

ఈలా అంటూ అను నాకు సాష్టాంగ నమస్కారము చేసేసరికి ఆమె రెండుకళ్ళవెంటా నీళ్ళధారలయి కారడము మొదలుపెట్టినవి. లేచి నిలుచొని తొందరతొందరగా ముఖము అటువైపుతిప్పుకొని లోపలికి వెళ్లిపోయింది. ఇదే ఆమె ఆఖరి నమస్కారము. ఇదిఅయిన రెండురోజులకు ఒకనాటిసాయం కాలము హఠాత్తుగా ఊపిరినిలిచిపోయి చనిపోయింది, నాకు కబురుపంపేపాటైనా వ్యవధి దొరకలేదట.

భాయిఫోటానుంచి ఇంటికి వచ్చాను. టిన్‌పెట్టె చేతిలో పట్టుకొని బండి దిగి గడపదగ్గిరికి వచ్చేసరికి ఎదుట ప్రసన్న కనబడ్డాడు, నాకోసము కనిపెట్టుకొని ఉన్నాడు, నేను కనబడ గానే, "ఏమి *దాదా, శుభవార్తేనా?" అని అడిగాడు.

"ఈరూపాయిలమీదమాత్రము ఎవ్వరినీచెయ్యివేయ నివ్వను." అన్నాను.

"కాని—" అంటూ ప్రారంభిస్తున్నాడు ప్రసన్న.

"అదంతా నేను ఎరుగుదును. ఎమైతే అది కానీ, ఈ రూపాయిలుమాత్రము వర్తకములో పెట్టను," అని నేను అన్నాను.

* దాదా=అన్న.

"ఆలాగైతే ఈసొమ్ము నీ అంత్యేష్టిసత్కారములో పెట్టవలసివస్తుంది," అన్నాడు ప్రసన్న.

అను కాలముచేసినతరువాత సుబోధ్ మాఇంటికి వచ్చాడు. మా అబ్బాయి, నిత్యధన్‌కీ వాడికీ జేట్టు బాగా కుదిరింది.

మనుష్యులలోవచ్చే గొప్పగొప్పమార్పులన్నీ కొంచెము కొంచెముగావస్తూ ఉంటవని కథలపుస్తకాలు చదువుతుండే వాళ్లు అనుకొంటారు. కాని నిజెముమాత్రము సరిగా దానికి వ్యతిరేకము.

దాలిలో పేర్చినపిడకలు రాజేకోడాని సమయంపడుతుంది గాని, ఊరికిఊరూ తగలబడడము ఒక్క నిమిషములోనే జరుగుతుంది. చూస్తూఉండగా అతిస్వల్పసమయములో నాకు సుబోధ్ మీాద ద్వేషముపుట్టింది అని నేను చెపితే కారణము ఏమిటిఅని అనేక ప్రశ్నలు నలుగురూ అడగకమానరు. సుబోధ్ తల్లిదండ్రులు లేనివాడు, జబ్బుపిల్లవాడు, చూడడానికి అతిచక్కగా ఉంటాడు, అన్నిటికంటె ముఖ్యమైనది పిల్లవాడు అనుకోడుకు. కాని వాడిమాటలువిన్నా, వాడిచేష్టలు చూచినా, వాడిఆటపాటలనుగురించి అనుకొన్నా నాకుముళ్లతో పొడుస్తున్నట్టు అనిపించేది.

అసలుసంగతి ఏమిటిఅంటే నా రోజులు బాగులేవు. సుబోధ్ రూపాయిలమీాద చెయ్యివేసాను అని శపథము

పట్టుకుకూర్చున్నాను, కాని ఆరూపాయిలు వాడితేనేగాని గతిలేదు అనే స్థితిలోకి వచ్చేశాను. చివరకు మరీ చిక్కులు పెరిగి ఒకనాడు ఎంతోకొంత వాడాను. దీనివల్ల నా మనస్సుకు చాలా అశాంతి కలిగింది, లోపునఉన్న మనసులో ఎటువంటిగందరగోళము జరిగిందో నేను చెప్పలేను గాని అప్పటి నుండి సుబోధ్‌ముందర ముఖము ఎత్తలేకపోయేవాడను. మొదటకొన్నిరోజులు వాణ్ణి తప్పించుకు తిరిగేవాడను, తరువాత రానురాను వాడంటే గొప్పకోపము పుట్టేది.

నాకోపము మొదట వాడిస్వభావము మీాదికి తిరిగింది. నాస్వభావము ఎటువంటిదిఅంటే ఏదిఅనుకుంటే అది నిమిషాల పైని చేశేయాలి. సబోధ్‌స్వభావము మరిఒకమోస్తరు, ఎదైనా అడిగితే జబాబుఇవ్వడము వాడికి చేతకాదా అనిపించేది, వాడు ఉన్నదగ్గిర లేకుండా ఇంకెక్కడో ఉన్నాడు అనిపించేది. కిటికీగజాలు పట్టుకొని ఘుంటలకొలది చలనం లేకుండా నిలుచోనేవాడు, ఏమిటి చూస్తూఉండేవాడో, ఏమిటి ఆలోచిస్తూఉండేవాడో, వాడికే తెలియాలి. ఇది చూస్తూ ఉంటే నాకు మహాకోపమువచ్చేది. రోగిష్టితల్లిదగ్గిర పెరిగాడు సుబోధ్, తన ఈడుపిల్లలెవ్వరూ ఆటకు దొరకకపోవడముచేత ఆతనికి తనలోతానే ఆడుకొంటూఉండడము అభ్యాసము అయిపోయింది కాబోలు. ఇటువంటిపిల్లవాళ్ళతో గొప్పచిక్కు; వాళ్ళకు దుఃఖమువచ్చినప్పుడు మనస్ఫూర్తిగా ఏడవనైనా ఏడవ లేరు, దుఃఖాన్ని మరిచిపోనైనా మరిచిపోలేరు. అందుచేత

కాబోలు, సుబోధను పిలిస్తే తక్షణము జవాబు వచ్చేది కాదు, పనిఏదైనా చెపితే మరిచిపోయేవాడు, ఏదోఒకటి రోజూ పారేసు కొంటూ ఉండేవాడు, కోప్పగిస్తే నాముఖమువైపు చూస్తూ నిలుచుండేవాడు. ఆమోండడమే కాబోలు వాడిఏడుపు. వీడిసహా వాసనువల్ల నిత్యధన్ కూడా చెడిపోతాడని నాలో నేను అను కోవడము ఆరంభించాను. కాని, అదేమి కర్మమోగాని మా నిత్యకు వీడంటే అపరిమిత ఉల్లాసము, స్వభావాలలో సంపూర్ణ మైనవిరోధం ఉండబట్టి కాబోలు వాళ్లిద్దరికి అంత ఆకర్షణ!

ఇతరుల స్వభావాలు దిద్దుతూఉండడము మావంశ ధర్మము. దానికికావలసిన ప్రవీణతా ప్రవీణతతో సమానమైన ఉత్సాహమూ నాలో ఉండేది. సుబోధ్ అతిమొద్దు గనుక వాడికి నానావిధాలపనులు చెపుతూఉండేవాడను, ఎన్నిమార్లు తప్పుచేస్తే అన్నిమార్లు వాడిచేతనే ఆ తప్పు దిద్దిస్తూఉండే వాడను. వాడికి ఇంకొక దురభ్యాసము ఉండేది; తననూ, తనచుట్టూఉండే ప్రపంచాన్నీ వాడు ఊహామూలకంగా పునర్ని ర్మితముచేస్తుండేవాడు—ఈ అభ్యాసము వాడితల్లికికూడా ఉండేది.

మా కిటికీఎదుటనున్న గులాబీజామ్‌చెట్టుకి ఏదో అద్భుతమైన పేరొకటి పెట్టాడు; ఆ చెట్టుదగ్గిర ఒక్కడే నిలబడి దానితో ఏదో మాట్లాడుతుండేవాడట—నాభార్య చెప్పింది. పడకగదిలో కూర్చొని పరుపును పచ్చికబయలు అంటాడు,

బాలీసును ఆవులమంద అంటాడు. అలాగు అబద్ధము వేస్లు పెట్టడము ఎంతతప్పయినపనో వాడినోటితో చెప్పిద్దామని, చాలా ప్రయత్నముచేశాను, వాడినోటివెంట ఒక్కమాట పలికించ లేకపోయినాను, నేను వాడిని ఎంత శిక్షిస్తూఉంటే అంతఅధికము అవుతుండేవి వాడితప్పులు. నన్ను చూసేసరికి కంగారుపడి, నేను చెప్పే మామూలు మాటలుకూడా బోధపరచుకోలేకపోయే వాడు.

అసలుసంగతి ఏమిటి అంటే, మనకు లోలోపున ఎవరి మీదనైనా కోపమున్నప్పుడు, మనను పైనుండి అణచిపెట్టిఉంచే వారు ఎవరూ లేకపోతే, మనకోపము దానంతటఅదే పెరుగుతూ ఉంటుంది. కోపం పెరగడానికి కొత్తకారణము అక్కరలేదు. మనకు ఎదురు చెప్పలేనివాడిని ఎవడినైనా నాలుగైదుమార్లు 'మూర్ఖుడా' 'పశువా', అన్నతరువాత ఆరోమారు 'పశువా' అనడానికి కారణము మనము అంతకుముందు నాలుగైదు మార్లు పశువా, అనడమే. వాడు కొత్తతప్పు ఏదీ చేయ నక్కరలేదు. రానురాను సుబోధ్ మీద కోప్పడడము నాకు అభ్యాసముఅయిపోయింది, ఎంత ప్రయత్నించినా ఆ అభ్యా సము మానిందికాదు.

ఈవిధముగా అయిదుసంవత్సరాలు గడచినవి. సుబోధ్ పన్నెండేళ్లవాడయినాడు, వాడి గవర్నమెంటుప్రామిసరీనోట్లూ, తల్లినగలూ రూపుమార్చుకొని నా చిత్రాఆవర్జాలలో అంకె లయి కూర్చున్నవి.

పీలులో అనూ ఆరూపాయిలన్నీ నాపేరనే వ్రాసింది అని మనస్సును నేను కొంత తృప్తిపరచుకొన్నాను. మధ్యను సుబోధ్ ఉన్నాడు, నిజమే; గాని వాడు కేవలము ఛాయ మాత్రమే, వాడు లేడుఅనే చెప్పవచ్చును. చిట్టచివరకు తప్ప కుండా నాకు రావలసినరూపాయిలు ముందుగానే ఖర్చుచేయ డములో అధర్మముఏమీా లేదు.

చిన్నప్పటినుండి నాకు వాతరోగము ఉండేది. ఈమధ్య అది ముదిరింది. ఎప్పుడూ ఏదోపని చేస్తూ, తిరుగుతుండే వాళ్లు ఒక్కనిదగ్గిరపడిఉండవలసివస్తే దగ్గిరఉండేవాళ్లనందరినీ కాల్చుకుతింటూఉంటారు. అందుచేత ఈనాలుగురోజులూ నా భార్యకుగాని, మా అబ్బాయికిగాని, సుబోధకుగాని, ఇంటి నౌకరుచాకర్లకుగాని ఒక్కక్షణము విశ్రాంతి లేకపోయింది.

ఇవతల, నాదగ్గిర రూపాయిలుదాచుకొన్న వితంతువు- లకు కొన్నిమాసాలుబట్టి వడ్డీ ఇవ్వలేదు. ఇంతకుపూర్వము నేను ఎన్నడూ ఈలాగు జరగనియ్యలేదు, అందుచేత భయపడి నన్నుసమాధానము అడగడము ఆరంభించారు. నేను ప్రస- న్నకు కబురుపంపాను, అతడు ఈవాళారేపూ అని గడపు తున్నాడు. చివరకు ఒకనాడు వాయిదా వేశాను, ఆవాళ ఇచ్చి తీరాలి. ప్రొద్దున్నుండి అప్పులవాళ్లు వచ్చి కూర్చున్నారు, ప్రసన్న జాడలేదు.

"సుబోధను పిలిచేయి," అని అన్నాను నిత్యతో.

"సుబోధ్ పడుకొన్నాడు."

నాకు మహాకోపమువచ్చింది. "పడుకొన్నాడూ? పదకొండుఘంట లయితే ఇంకా పడుకొనిఉన్నాడేమి!" అని అన్నాను.

భయపడుతూ భయపడుతూ సుబోధ్ నాదగ్గిరికివచ్చి నిలుచున్నాడు.

"ప్రసన్న ఎక్కడుంటే అక్కడికివెళ్లి నేను పిలుస్తున్నానని తత్క్షణము పిలుచుకొని రా," అని అన్నాను.

ఎప్పుడూ ఏదోఒకపని చెపుతూ ఉండేవాడను సుబోధకు. అందుచేత నాకు అవసరముండే పనులలో వాడు పండిపోయినాడు, నాకు అవసరమున్నవాళ్లలో ఎవరు, ఎప్పుడు, ఎక్కడ దొరకుతారో వాడు ఎరుగును.

ఆవాళ ఒంటిఘంట అయిపోయింది, సుబోధ్ ఇంకా ఇంటికి తిరిగి రాలేదు. ఇవతల నాగడపలో కనిపెట్టుకొని కూర్చున్నవాళ్ల మాటలఘాటూ, వడీ అధిక మవుతున్నవి. ఎంత తంటాలుపడ్డా సుబోధలోనున్న జడిమ పోగొట్టలేకపోయినాను, రోజుకురోజూ మరింత మొద్దుఅయిపోతున్నాడు. రాను రాను, ఎక్కడకూర్చుంటే అక్కడే, మరి లేచేవాడు కాడు, కదల్చడానికి పదిరోజులుపట్టేది. ఒకొకనాడు చూచేవాడను, సాయంత్రము అయిదు అయేసరికి పరుపుమీద పడుకొని దొర్లడం

ఆరంభించేవాడు. ప్రసన్న బలవంతాన లేవదీస్తేనే గాని పరుపుమీదనుండి లేచేవాడు కాడు, నడుస్తుంటే కాళ్లతో జట అల్లుతున్నాడా అనిపించేది చూచేవాళ్లకు. సుబోధను, 'సోమరి మహా మహోపాధ్యాయా' అని పిలుస్తుండేవాడను, 'నీకు పుట్టుగుడ్డి', అని అంటూఉండేవాడను, దానికి వాడు ఏమీ జబాబు చెప్పేవాడు కాడు. ప్రశాంత మహాసముద్రము దాటాక వచ్చేది ఏ మహాసముద్రము అని ఒకనాడు వాడిని అడిగాను. వాడినోటి వెంట మాటరాకపోవడము చూచి, "దాని తరువాత ఉన్నది, "బద్ధక మహాసముద్రము," అని నేనే జబాబు చెప్పాను. సాధ్యమైనంతవరకు నాఎదుట ఎన్నడూ కళ్ల నీళ్లు పెట్టుకోకుండానే గడుపుకువస్తూ ఉండేవాడు, కాని ఆ వాళ్ళ మాత్రము ఆపుకోలేకపోయినాడు. తిట్లు ఎన్నైనా సహించి ఊరుకొనేవాడుగాని వేళాకోళపు మాటలుమాత్రము లోపలికి ప్రవేశించి అతనిహృదయాన్ని పొడిచేవి.

* * * * * *

చాలా ఆలస్యము అయింది, బాగా రాత్రి అయింది. గదిలో దీపము లేదు, ఎంతపిలిచినా ఎవరూ పలకలేదు. ఇంటిలో అందరిమీదా నాకు కోపము వచ్చింది. వడ్డీలు చెల్లించమని సుబోధకు ప్రసన్న రూపాయిలు ఇస్తే ఆ రూపాయిలు పట్టుకొని సుబోధ్ ఎక్కడికో పారిపోయి ఉంటాడు అని ఎందుచేతనో నాకు హఠాత్తుగా సందేహము కలిగింది. సుబోధను

మా ఇంట్లో సుఖంగా లేదని నేనెరుగుదును, కాని సుఖం అనేది కోరకూడనివస్తువని చిన్నప్పటినుండి నా నమ్మకము, ముఖ్యముగా పిల్లలకు అది హానికరము. ఈవిషయములో మాత్రము నాకు ఎట్టి పశ్చాత్తాపమూ లేదు. కులాసాగా లేదని చెప్పి సుబోధ్ ఈలాగు రూపాయలు పట్టుకు పారిపోయినాడని ఊహించి, వాడిని విశ్వాసఘాతకుడని, దొంగని నామనస్సులో నేను తీక్ష్ణముగా తిట్టడము మొదలుపెట్టాను. ఇంతచిన్నప్పటి నుండి దొంగతనము ప్రారంభించినవాడిగతి ఏమికాగలదు! నా ఇంట్లో ఉండి, నా ఇంటతింటూ, ఇటువంటిదుర్బుద్ధి వీడికి ఏలాగు అబ్బింది! సుబోధ్ రూపాయిలు దొంగలించాడా లేదా అనే విషయములో నాకు ఏమాత్రము సందేహమూ లేదు. పరుగెత్తి వెళ్లి ఎక్కడదొరికితే అక్కడనుంచి పిలకపట్టు కొని ఈడ్చుకువచ్చి వీపు వెట్టగొడదామని బుద్ధిపుట్టింది.

సరిగా ఆటువంటిసమయంలో సుబోధ్ నాగదిలో ప్రవేశించాడు. నాకు మహాకోపము వచ్చింది, నానోటివెంట మాట రాలేదు. రూపాయలు దొరకలేదు అని అన్నాడు సుబోధ్.

నేను సుబోధతో రూపాయలు తీసుకొనిరమ్మని అన-లేదు. అయినా రూపాయిలు దొరకలేదు అని అంటున్నాడు నిజముగా రూపాయిలు దొంగిలించాడు, సందేహాము లేదు, కాని ఎక్కడ దాచాడో! పైకి మంచివాళ్లలాగు కనబడేవాళ్లకు ఈలాగే లోలోపన కటిలబుద్ధి. చాలాకష్టము మీద గొంతుక

పవరించుకొని, "రూపాయిలు పైకి తీయి," అని గర్జనచేశాను. సుబోధ్ తిరగబడి కేకలువేస్తూ, "నేను రూపాయిలు ఇవ్వను, నీవు యేమిచేసుకుంటావో చేసుకో," అని అన్నాడు.

నేను మరి ఆపుకోలేకపోయినాను. దగ్గిర ఉన్న కర్ర తీసి వాడితలమీద ఒక్కపెట్టుపెట్టాను, దెబ్బతో పడిపోయినాడు సుబోధ్. నాకు భయము వేసింది, పేరుపెట్టి పిలిచాను, జబాబు లేదు. దగ్గిరికి వెళ్లబోయినాను, ఒంట్లోశక్తిలేదు, ఉన్నచోట నుంచి కదలలేకపోయినాను. చేతితో తడిమిచూచాను. తివాసీ తడిసిపోయింది, రక్తముతో నిండిపోతున్నది, ఆ రక్తము అన్ని వైపులా వ్యాపించేస్తున్నది, నేనుఉన్న జాగాకూడా తడిసి పోయింది. నా గదికిటికీ తెరచి ఉన్నది, అందులోనుంచి సంజ నక్షత్రము కనబడుతున్నది. అటు చూడలేక తక్షణము ముఖము అటునుండి తిప్పుకొన్నాను, అది ఖాయిఖోటానాడు నాముఖానఉంచినబొట్టులాగు ఉన్నదని ఎందుచేతనో నాకు హఠాత్తుగా తట్టింది. ఇన్నాళ్ళబట్టి నాకు సుబోధ్ అంటే ఉన్న కోపమూ ద్వేషమూ ఒక్కక్షణములో మాయమయిపోయినవి. అతను అనుహ్రుదయ ధనము. తల్లిఒడిలోనుంచి వేరు చేయబడ్డాడు, నా హృదయములో ప్రవేశిద్దామని దారి వెదుకుతూ నాదగ్గిరికి వచ్చాడు. ఆహా, నే నేమి చేశాను! ఏమిటి నేను చేసినది? నాలో ఇటువంటి పాపబుద్ధి ఎందుకు పుట్టించావు, భగవంతుడా? రూపాయి లవసరమేమున్నది నాకు!

నా వర్తకమంతా సముద్రములో వదిలేసి, ఈ జబ్బుపిల్లవాడిని పెంచుతూ, నా ధర్మము నేను నిలుపుకుంటే బ్రతికిఉండును కదా!

ఎవరైనా వచ్చి చూసేస్తే దొరికిపోతానేమో అని క్రమక్రమముగా భయము కలిగింది, లోలోపల భగవంతుని ప్రార్థించాను, ఎవరూ రాకూడదనీ, ఎవరూ దీపము గదిలోకి తీసుకు రాకూడదనీ. ఆ చీకటి ఎన్నటికీ పోకుండా ఉండవలెననీ కోరాను. మర్నాడు సూర్యుడు ఉదయించకపోవునుగాక! ఈ ప్రపంచమంతా మిథ్య అయిపోవునుగాక! శాశ్వతాంధకారము నన్నూ, ఈ అబ్బాయినీ దాచివేయునుగాక!

అడుగులచప్పుడు వినబడ్డది. పోలీసువాళ్లకు ఏలాగో కబురుతెలిసిపోయింది అని భయపడ్డాను. ఏమిబొంకుదాము, ఏదోంగసమ్జాయిషి చెపుదాము అని ఆలోచించబోయినాను. ఆలోచన వెళ్లిందికాదు.

ధబ్ మని తలుపు పడ్డది. గదిలో ఎవరో ప్రవేశించారు.

ఆ పాదమస్తకము వణకడం మొదలుపెట్టాను. చూచాను, ఇంకా ఎండ ఉన్నది. నిద్రలోనుంచి అప్పుడే తెలివివస్తూఉన్నది.

హాటఖోలా, బొడోబజేర్, బేలాఘాట్— మొదలైన జాగాలకు వెళ్లాడు సుబోధ్. ఇవికాక ప్రసన్న ఇంకెక్కడెక్కడ ఉండవచ్చునో ఆచోట్లన్నిటికీ వెళ్లాడు. ప్రసన్న ఎక్కడా దొరకలేదనే అపరాధమువల్ల సుబోధము ఖము వాడి-

పోయిఉన్నది. ఇన్నాళ్లయినతరువాత సుబోధముఖము ఎంత చక్కనిదో నేను ఈవాళ కనిపెట్టాను, అతనికళ్ళల్లోఉన్న కోమలత్వము ఇన్నాళ్లకు నాకు కనబడ్డది.

'దా, నాయనా, సుబోధా! వచ్చి నా ఒళ్లో కూర్చో బాబు!'' అన్నాను.

నేను అన్నమాటలు బోధపడలేదు సుబోధకు, నేను వేళాకోళము చేస్తున్నా ననుకొన్నాడు. తెల్లబోయి నావైపు చూస్తూ తెలివితప్పి పడిపోయినాడు.

నా వాతము రెప్పపాటులో ఎరిగిపోయింది ఎక్కడికో, గబగబ దగ్గిరికి వెళ్లి సుబోధను ఎత్తుకొనివచ్చి నాపరుపుమీద పడుకోపెట్టాను. చల్లని కూజానీళ్లు సుబోధముఖముమీదా, తలమీదా కొట్టాను. ఏమిచేసినా తెలివి రాలేదు, డాక్టరికి కబురుపంపాను.

సుబోధస్థితి చూచి డాక్టర్ నిర్ఘాంతపోయినాడు. "రోగముయొక్క అవతలఒడ్డు చేరుకొన్నాడు; ఈ అబ్బాయికి ఈస్థితికి రావడము ఏలాగు సాధ్యమయిందో నాకు తెలియకుండా ఉన్నది,'' అని డాక్టర్ అన్నాడు.

"రోజంతా ఏదో పనిమీద తిరగవలసివచ్చింది,' అని అన్నాను నేను.

"ఒక్కరోజులో జరిగినది కాదు ఇది; చాలా కాలము అయిఉండాలి, ఇతనికి క్షయరోగము ఆరంభమయి; ఎవరూ శ్రద్ధచేయలేదు,'' అని డాక్టర్ అన్నాడు.

తత్క్షణము తెలివితెప్పించేమందు ఏదో ఇచ్చి పథ్య మేమిటో చెప్పి డాక్టర్ వెళ్లిపోయినాడు. "మహా ప్రయత్నము మీాద బ్రతికితే బ్రతుకుతాడేమో కాని, ఈ అబ్బాయిప్రాణంలో పటుత్వమున్నమాట లేదు. ఇతనిని చూస్తే ఎన్నాళ్లబట్టో కేవలము మనస్సులో ఉండే జోరువల్లనే ప్రాణాన్ని ఈడ్చుకు వస్తున్నాడు అనిపిస్తూ ఉన్నది," అని డాక్టర్ అన్నాడు.

నాజేబ్బుమాట మరచిపోయినాను. సుబోధను నా మంచముమీాదనే ఉంచి రాత్రింబగళ్లు సేవచేశాను. డాక్టరికి ఫీజు ఇవ్వడానికైనా డబ్బులేకపోయింది నాదగ్గిర. నాభార్యనగలపెట్టె తీశాను. ఆ పచ్చలహారము తీసి పట్టుకొని, "ఇదిమాత్రము నువ్వు ఉంచుకో," అని ఆమెతో అన్నాను. మిగతావస్తువులన్నీ తనఖాపెట్టి రూపాయిలు తీసుకువచ్చాను.

కాని రూపాయిలవల్ల మనిషి బ్రతుకుతాడా? అతని ప్రాణాన్ని ఇన్నాళ్ళబట్టి కాళ్లకింద వేసి కుమ్మికుమ్మి ఆఖరుచేసే-శాను, ఇన్నాళ్ళబట్టి అతనిని మోసపుచ్చి అతనికి దొరకకుండా-చేసిన స్నేహాన్ని ఇప్పుడు నా మనసార అతని చేతిలో పెట్టాను. కాని అతడు అది అందుకోలేకపోయినాడు. ఉత్తచేతులతో తనతల్లిదగ్గిరికి పారిపోయినాడు, సుబోధ్.

1914

---

# హైమంతి

పెళ్లికూతురుతండ్రి మరికొంత కాలము పెళ్ళిచేయ కుండా ఉంచడానికి సిద్ధముగాఉన్నాడు, గాని పెళ్లికొడుకు తండ్రి మాత్రము ఇష్టపడకుండాఉన్నాడు. మరి నాలుగు రోజులు ఆలస్యముచేస్తే పిల్లవయస్సు దాచిఉంచడము అసాధ్యము, మర్యాద కాపాడుకోవడము మనచేతిలో మరిఉండదు అని మొగపెళ్ళివాళ్ళభయము. పిల్లవయస్సు ఏమీఆలోచన లేకుండా పెరిగిపోతూఉన్నది, నిజమే. కాని ఇప్పటికిమాత్రము ఇంకా కట్నముమొత్తము ఈడుకుమించే ఉన్నది. అందుచేతనే పెళ్ళికొడుకుపక్షమువాళ్ళకు అంత తొందర.

నేను వరుడను, గనుకనే పెళ్ళిసంబంధమైన ఏవిషయములోనైనా నా అభిప్రాయము కనుక్కోవడము అనవసరము. నా పనేమో నేను చేసేశాను, ఎఫ్. ఏ. పాసుఅయి స్కాలర్‌షిప్ సంపాదించాను. అందుచేత రెండుపక్షాలవాళ్లమూ ఆందోళనలోనే ఉన్నాము.

మనదేశములో ఒకమారు పెళ్ళిచేసుకొన్నవాడికి, పెళ్ళి విషయమై ఎట్టిభయమూ మరి ఉండదు. నరమాంసము రుచి చూచిన పెద్దపులిమోస్తరే, భార్యాసంబంధమైనవిషయాలలో, వీళ్లస్వభావము. ఎట్టిఅవస్థలోఉంటూఉన్నా, ఎంతవయస్సు

ముదిరి ఉన్నా, భార్యపోయింది అనేసరికి మరిఒకభార్యను తెచ్చుకోడానికి ఎట్టిసంకోచమూ ఉండదు. వీళ్లకు ఉండే సంకోచమల్లా మన విద్యార్థులకూ, స్కూళ్ళలోనూ, కాలేజీలలోనూ చదువుతుండే కుర్రవాళ్లకు మాత్రమే. తిరిగిపెళ్లిచేసుకొందామని తండ్రి నాలుగేసిరోజులకొకమారు పండినవెండ్రుకలు నలుపుచేసుకొంటున్నాడు, పెళ్లిసంబంధాలతో రోజూ మధ్యవర్తులు ఇంటికి వస్తూఉండడమువల్ల కొడుకుతల రాత్రికి రాత్రి నెరిసిపోతున్నది.

కాని నిజముచెపుతాను, నాకుమాత్రము భయముకలగలేదు. పైగా, పెళ్ళి అనేసరికి దక్షిణవాయువు నా హృదయాన్ని తాకడముమొదలుపెట్టింది. 'బర్కుదొరగారి ఫ్రెంచ్ రివల్యూషన్‌మీద వ్రాసుకొన్న నాలుగయిదునోటుబుక్కులూ కంఠోపాఠంచేస్తూ ఉండవలసినసమయంలో ఇటువంటితలంపులతో మనస్సును నింపుకొంటూఉండడము అట్టే ఉచితముకాదు' అని నా కాల్పనా ప్రపంచములో కుతూహాలముగా అంతా గుసగుసలాడుతు ఉన్నట్టు నా ఊహకు తట్టింది. నేను ఇప్పుడు వ్రాస్తూఉన్న ఈ కథ టెక్స్టుబుక్‌కమిటీవారు ఆమోదిస్తారని నాకు ఎట్టి సందేహమున్నా వ్రాసేటప్పుడు చాలా జాగ్రత్తగా ఉందును.

కాని ఇప్పుడు నేను చేస్తున్నదేమిటి? కొంపతీసి, కథ ఒకటి—చిన్న నవల ఒకటి—మొదలుపెట్టానా ఏమిటి? నా వ్రాత ఈ తాళము మీదా, ఈరాగము మీదా ప్రారంభమవు

తుందని నేను ఏలా అనుకోగలను? నాలో ఇన్నిసంవత్సరాల నుండి జమకూడుతున్న వేదనఅనేమేఘాలను ఎప్పుడో ఒక నాటిసాయంకాలము *వైశాఖధారలరూపంగా కురిపించి చులక నౌదామని అనుకొన్నాను. కాని "ముగ్ధబోధ" వ్యాకరణ మైనా చదివిఉండకపోవడమువల్ల పిల్లలకుపనికివచ్చే పుస్తకాలేవీ వ్రాయజాలను. లోపునఉన్నదానిని మాతృభాషద్వారా బయటికి తీసుకురాగలిగినంత ప్రవీణత నాలో లేదు, అందు చేత కావ్యరచన నాకు చేతకాదు. కాబట్టి నాలోనున్న శ్మశాన చారియైన సన్యాసి తననుతానే పరిహాసముచేయ పూను కొన్నాడు. ఇదితప్ప అతడు మరేమిచేయగలడు, అతనిలోని అశ్రువులు ఎండిపోయినవి,—జ్యేష్ఠమాసములో ఉండేది, తీక్ష్ణ మైన ఎండమాత్రమే, ఆ ఎండే జ్యేష్ఠముయొక్క అశ్రుహీనవ్య రోదనము.

నాకు పెళ్ళిచేసినపిల్లయొక్క అసలుపేరు నేను చెప్పను. దేశ చరిత్రపరిశోధకులు ఈ ప్రపంచ చరిత్రలో ఆమెకు ఇవ్వ వలసిన స్థానాన్నిగురించి వివాదపడతారనే భయం నాకు లేదు. ఆమె పేరుఖచితమయిఉన్న తామ్రశాసనము నా హృదయ పటము. ఆ పటము ఎన్నటికైనా శిథిలమవుతుందనిగాని, ఆ పేరు చెరిగిపోతుందనిగాని, నేను నమ్మజాలను. అది అమృత లోకములో ఒక అక్షయపదార్థమయి ఉన్నది, ఆ లోకానికి మన చరిత్రకారుల రాకపోకలు లేవు.

* తెలుగుదేశపు వైశాఖము కాదు.

అయినా నేను వ్రాస్తూఉన్న ఈ కథలో ఆమెను ఏదో ఒకపేరుపెట్టి పిలవవలెను కదా! కనుక ఆమెను 'శిశిరం' అంటాను. శిశిరఋతువుకు నవ్వూ, ఏడుపూ ఒక్కటే; శిశిరఋతువులో అరుణోదయమప్పటికిఉండే శిశిరము ప్రొద్దుదూరిదూరడముతోనే మాయమయిపోతుంది.

శిశిర్ నాకంటె రెండుసంవత్సరాలు చిన్న. మా తండ్రికి "గౌరీదానము"లో నమ్మకము. ఆమెతండ్రి గొప్పపట్టుదలగల సంఘసంస్కర్త—మనపూర్వాచారాలలో ఎటువంటి నమ్మకమూ లేదు అతనికి. ఆయన బాగా ఇంగ్లీషు చదువుకొన్నాడు. మాతండ్రి అతిభక్తితో లోకాచారాలు మన్నించేమనిషి. ఇతను కూడా ఇంగ్లీషు బాగా చదువుకొన్నాడు, గనుక మన్నించవగని ఆచారము ఒకటైనా మన సంఘములో ఇంటగాని, బయటగాని, ఎంతవెదకినా ఈయనకు కనబడలేదు. పిల్లవయస్సునుపట్టి కట్నముకూ పాయింపు మొత్తం అధికమయిందిగనుక పిల్ల పెద్దదయినా మానాన్న ఒప్పుకొన్నాడు. మామగారికి శిశిర్ ఒక్కర్తే కొమర్తె, మామగారు కూడబెట్టిన ధనమంతా అల్లుడి భవిష్యత్తును నింపుతుందనే మా నాన్న నమ్మకము.

అనేకవిషయాలలో 'పట్టుదల' అనేటటువంటి అనవసర పదార్థము మా మామగారిలో ఉండేదికాదు. ఆయన పశ్చిమ ప్రాంతాలలో ఏదోఒక కొండరాజులఇలాకాలో పెద్దఉద్యోగములో ఉండేవారు. శిశిర్ అడ్డాల్లో ఉంటూఉండగానే తల్లి

చనిపోయింది. ఏటేటా శిశిర్ వయస్సు ఒక్కొక్క సంవత్సరము చొప్పున పెరుగుతున్నదని ఘోషగారు గమనించ లేదు. అతనిముఖాన్ని ఆ పిల్లవైపు తిప్పి ఆమె ఈడును కనపరిచేపాటివాడు అతనిసంఘములో అక్కడెవడూ లేక పోయినాడు.

ఈలాగు మెల్లిమెల్లిగా పిల్లకు పదహారేళ్లు వచ్చినవి; కాని అవి స్వాభావికమైన పదహారు, సంఘముయొక్క పదహారు కావు. నీ వయస్సునుగురించి జాగ్రత్తగాఉండు అని ఎవరూ ఆమెతో చెప్పలేదు, తనంతటతానైనా జాగ్రత్తపడలేదు.

బి. ఏ. జూనియర్‌లో కాలుపెట్టాను, నాకు పంధొమ్మి దేళ్లు—అప్పుడు అయింది నాకువివాహము. ఇది వివాహానికి సరియైన వయస్సు అవునా కాదా అని సంఘంపక్షమువాళ్లూ, సంస్కర్తలూ రక్తధారలతో దేశాన్ని నింపి పోట్లాడు కోవచ్చును, గాని నాకుమట్టుకు, పరీక్షపాసుకావడానికి ఆ ఈడే మంచిఈడు అనిపించినట్లుగానే, పెళ్లికికూడా అదే ప్రశస్త మైన ఈడుఅని అనిపించింది.

వివాహానికి అరుణోదయముగావచ్చింది ఒకచిన్న ఫొటొ గ్రాఫు. నోట్సు కంఠోపాఠంచేస్తున్నాను, నా బంధువుడు ఒకడు వచ్చి నా టేబిలుమీద శిశిర్ ఫొటొగ్రాఫు పెట్టాడు— హాస్యమాడేవరస మాఇద్దరికీ—ఫొటొగ్రాఫు పెట్టి, "నిజమైన చేదువు ఇక గట్టిగా చేదువు, మెడవిరిగేటట్టు," అని అన్నాడు.

ఎవడో క్రొత్తగా విద్యనేర్చుకొంటున్నవాడు తీసిన ఫొటోగ్రాఫు అది. పిల్లకు తల్లి లేదు, జుట్టు బాగా బిగించి జడరిబ్బను కట్టి సిగవేసేవారు ఎవరూ లేరు; 'సాహా' కంపెనీవాళ్లో లేక 'మల్లిక్' కంపెనీవాళ్లో తయారుచేసిన సంచిలాంటి రంగుల బ్లౌజు తొడిగించి, చూడడానికివచ్చినవాళ్లను మాయజాలములో వేదామని ప్రయత్నముచేయడానికి ఎవరూ లేరు ఇంట్లో. అలంకారాలులేని ముఖము ఆమెది, ఏదో భారము వహిస్తున్నట్టు కనబడుతున్నది, సాదా చీర ఒకటి కట్టుకొన్నది; కాని చూచేసరికి మొత్తముమీద మాత్రము ఏమిటి ఆరూపు, ఆ కళ!—నేను మాటలతో చెప్పలేను. ఏలాగో ఒకలాగు కుర్చీమీద కూర్చొనిఉన్నది, వెనకను పెద్దచారల శత్రంజీ వేలగట్టి ఉన్నది, పక్కను టేబిలుమీద పూలదానలో పూలగుత్తి ఒకటి ఉన్నది,దిగువ తివాసీమీద ముడతలుముడతలుగాపడిఉన్న పిల్ల యొక్క చీరఅంచుకిందనుంచి రెండుపాదాలూ కనబడుతున్నవి.

పటములోనున్న బొమ్మకు నామనస్సు మంత్రదండముయి స్పర్శించగానే ఆ బొమ్మ సజీవిఅయి నామనస్సులో దూరి తన నల్లని కళ్ళతో నాభావపుంజాలను వింతగా చూస్తూకూర్చున్నది. వంకవంకలుగా పడిఉన్న ఆ చీరఅంచుకిందనుంచి కనబడుతున్న ఆ రెండుపాదాలూ నా హృదయాన్ని పద్మాసనముగా చేసుకొన్నవి.

పంచాంగముపేజీలు తిరగబడుతున్నవి. రెండుమూడు శుభముహూర్తాలుదాటిపోయినవి. మామగారికి సెలవు దొరక-

కడము లేదు. అవతల నాలుగయిదు గొడ్డుమాసాలు అడుగా వచ్చి నా బ్రహ్మచర్యముయొక్క సీమను పంధొమ్మిదినిదాటించి అర్థము లేని ఇరవైలోనికి తోసేనామని కుట్రపన్నుతున్నవి. నాకు మామగారిమీద కోపమువుడుతున్నది, మామగారి యజమానిమీద కోపమువుడుతున్నది.

ఏలాగైతే నేమి, ఆ గొడ్డుమాసాలకు ముందునున్న ముహూర్తాన వచ్చిచేరింది వివాహలగ్నము. ఆనాటి సనాయి ఆలాపన నాకు ఎప్పుడూ జ్ఞాపకమువస్తూ ఉంటుంది. ఆదినము యొక్క ప్రతిక్షణాన్ని నా సమస్తచైతన్యముతోనూ నేను స్పర్శించాను. ఆ నా పంధొమ్మిదోఏడు నాజీవితములో అనంతమై ఉండును గాక !

వివాహసభలో నాలుగువైపులా గొప్ప సందడి. ఆ మధ్యను వధువుయొక్క కోమలహస్తమువచ్చి నాచేతిలో పడ్డది. ఇంతఅద్భుతమైనఘటన మరిఒకటి ఉండగలదూ? 'నాకు ప్రాప్తించింది''నాకుప్రాప్తించింది' అని మాటిమాటికీ నామనస్సు ఉచ్చరిస్తూఉన్నది. ఎవరు ఆ ప్రాప్తించినది? ఇది దుర్లభమైన పదార్థమే! ఇది అవ్యాజమైన మానవపదార్థమే! దీనిలోనుండే రహస్యానికి అంత మెక్కడ?

మా మామగారిపేరు గౌరీశంకర్. ఆయన నివాసము చేస్తూఉన్న హిమాచలమే ఆయనకుమిత్రమై ఉన్నదా అనిపించేది. ఆయన గంభీరశిఖరాన బహుపవిత్రమైన చిరునవ్వు కనబడుతుండేది; ఆ నవ్వులో ఎటువంటి చంచలతా లేదు. ఆయన

హృదయములోనుండి అవిరామముగా ఊరి, బయటికి వస్తూ ఉన్న ప్రేమను ఎరిగినవారెవ్వరూ ఆయనను ఎన్నటికీ విడువలేరు.

సెలవాఖరున, పనిలోచేరడానికి వెళ్ళకముందు, మామగారు నన్ను పిలిచి, "బాబూ, నా కూతుర్ని నేను పదిహేడు సంవత్సరాలబట్టి ఎరుగుదును, నిన్ను ఈనాలుగు రోజులు మాత్రమే ఎరుగుదును. అయినా ఆమెను నీచేతికి అప్పచెప్పి, వెళ్లిపోతున్నాను. నేను నీ చేతిలోపెట్టినధనముయొక్క విలువ నీవు తెలుసుకోవలెననే కోరికకంటె గొప్పఆశీర్వాదము నేను నీకు చేయలేను," అని అన్నారు.

వియ్యంకుడూ, వియ్యపురాలూ అతనికి ధైర్యము చెపుతూ, "మీ మనస్సులో ఎటువంటిభయమూ ఉండనీయకండి,' మీ అమ్మాయి తండ్రిని విడిచిపెడుతున్నది, నిజమే, గాని ఇప్పుడు ఆమెకు తల్లీతండ్రీకూడా దొరికారు, ఆ దొరికినవారు ఆమెఇప్పుడు విడిచిపెడుతున్న వానివంటి వాళ్లే, నిస్సందేహముగా," అని అంటూ, ఆయన మనస్సును శాంతి పరిచారు.

వెళ్లిపోయేవేళ వచ్చింది. మామగారు తనకూతురు దగ్గిరికి వచ్చి, "వెళుతున్నానే తల్లీ," అన్నారు. "నీకు ఉన్నదంతా ఈ తండ్రిఒక్కడే. దానికి ఎటువంటినష్టము కలిగినా, అది తగ్గిపోయినా చోరీపోయినా నాపూచీమాత్రము లేదు. ఈవాళనుంచి," అని అన్నారు.

"ఆహా, మహామంచి మాటకదూ! నా ధనానికి ఎటువంటి హాని కలిగినా ఆ నష్టము నువ్వే పూర్తిచేయవలసి ఉంటుంది," అన్నది కూతురు.

ఏ ఏ విషయాలలో తండ్రికి ఇబ్బందికలుగవచ్చునో వివరించి ఆ విషయాలన్నిటిలో చాలాజాగ్రత్తగా ఉండమని కోరింది కూతురు. భోజనమువిషయములో కట్టుబాటులో ఉండవలసినవాడు కాడు మా మామగారు; అతనికి పడనివి నాలుగైదువస్తువు లుండేవి, అవి బహుఇష్టము అతనికి ! తండ్రి మనస్సు వాటివైపు పోకుండాఉంచడము ఆమె రోజూ చేస్తూ ఉండే పనులలో ఒక ముఖ్యమైనపని. అందుచేత ఈవాళ తండ్రి చెయ్యి పట్టుకొని కూతురుఅన్నది, "నాన్నా, నేను చెప్పినట్టు చేస్తావు—చేస్తావా?"

"మాటఇచ్చి, మాటతప్పి 'అన్నహా! బ్రతికానుబాబూ,' అని స్వేచ్ఛగా నిట్టూర్పువిడిచే స్వభావము మనుష్యులది, అందుచేత మాటఇవ్వకపోవడమే చిక్కులేని పద్ధతి," అని నవ్వుతూ అన్నాడు తండ్రి.

తండ్రి బయటికి వచ్చేశాడు, అతని వెనకనే తలుపు మూయబడ్డది, తరువాతజరిగినసంగతి ఎవరెరుగుదురు?

కన్నీరులేని ఈ కడపటి నాటకము అతి కుతూహలముతో చూస్తూ, వింటూ, పక్కగదిలో నిలుచున్న మా అంతఃపురబృందము, "ఈలాంటి నాటకం మేము ఎక్కడా చూడ

లేదమ్మా!" అన్నారు. "హిందూస్థానీ దేశములో ఉండిఉండి ఆ దేశస్థులమాదిరి వీళ్లూ మోటా అయిపోయినట్టున్నారు, ముద్దూ ప్రేమా ఏమీా లేదు," అని అనుకొన్నారు.

పెళ్లివ్యవహారములో మధ్యవర్తిగాఉన్న వాడు వనమాలిబాబు అని ఒకఆయన. అతడు మా మామగారి స్నేహితుడు, ఈయన, మావాళ్ళకుకూడా తెలిసినవాడే. ఇతను మామగారితో, "ప్రపంచములో నీకు ఉన్నదంతా ఈకొమార్తె ఒక్కర్తేగనుక ఆ పొరుగుఇల్లు అద్దెకుతీసుకొని నీజీవితం ఇక్కడే గడిపేయరాదూ," అని అన్నాడు.

"ఇచ్చిన దేదో పూర్తిగా ఇచ్చేశాను,"అన్నారు మామగారు. "ఇప్పుడు తిరిగి దానివైపు చూస్తూఉంటే దుఃఖమేకాని సుఖంలేదు. అధికారము వదులుకొనికూడా అధికారము నిలబెట్టికొందామని కోరుతూఉండడమంత అసందర్భమైన పని మరిఒకటి ఉండదు లోకములో."

అంతా అయినతరువాత మామగారు నన్ను చిట్టచివరకు పక్కకు పిలిచి రహస్యముగా అన్నారు, "పుస్తకాలంటే చాలా సరదా మా అమ్మాయికి, నలుగురినీ పిలిచి విందుచేయడమంటే సరదా, వీటికని మీా నాన్నగారిని చీకాకుపెట్టడము నాకుఎంత మాత్రము ఇష్టములేదు. అప్పుడప్పుడు నీకు రూపాయలు పంపుతుంటాను మీా నాన్నగారికి తెలిస్తే కోపగించరు కదా?"

మామగారి ప్రశ్న విని ఆశ్చర్యపడ్డాను. ఎక్కడ నుంచైనా డబ్బు వస్తే కోపగించే పాడుబుద్ధి మామాన్నలో నాకు ఎన్నడూ కనబడలేదు.

ఏదో లంచమిస్తున్నట్టుగా మామగారు నూరు రూపాయిలనోటు ఒకటి తొందరతొందరగా నా చేతిలో పెట్టి గభుక్కున వెళ్ళిపోయినారు; సెలవుతీసుకొనేపాటి అవకాశమైనా నాకు చిక్కలేదు; అతని చేతిరూమాలు జేబులోనుంచి పైకివచ్చి కళ్ళదగ్గిరికివెళ్ళింది, వెనుకనుంచి నాకు కనబడుతున్నది.

నాకు ఏమిచేయడమో తోచలేదు, ఆలాగే అక్కడ చేతికిలబడిపోయినాను; "వీళ్లు వేరేజాతి మనుష్యులు, వీళ్ళది మా జాతి కాదు," అని అనుకొన్నాను.

నా స్నేహితులు అనేకమంది పెళ్లాడారు, నేను ఎరుగుదును. మంత్రోచ్చారణసహాయమువల్ల పెళ్లాము ఒక్కగుటకలో గొంతుక దిగిపోయేది. జీర్ణయంత్రము చేరిన కొంతసేపటికి దాని నానాగుణాగుణాలూ బయటికి కనబడవచ్చును, ఉండుండి గాబరా పుట్టించవచ్చును, గాని మింగేవారిలో మాత్రం ఎవీ అడ్డుపడేది కాదు. కన్యదానమంత్రముతో మనకు దొరికే కాస్తపిసరుతో సంసారము గడచిపోతుంది, నిజమే; గాని మామనువంతులముప్పాతికభాగము మనచేతికి దొరకనేదొరకదు అని, నాకు మాత్రము వివాహసభలోనే తెలిసిపోయింది. పెళ్ళి అందరూ చేసుకొంటారు, గాని చాలామందికి భార్యలభించదు,

లభించలేదని వాళ్లకు తెలియదుకూడాను. ఈ సంగతి ఆ భార్యలూ పోల్చుకోలేరు, గాని నాభార్యమాత్రము అందరి భార్యలవంటిది కాదు, ఆమె నా సాధనాధనము, నాసంపద.

శిశిర్ మీద—వద్దు వద్దు, 'శిశిర్' అనే పేరు మరి కుదరదు, ఆమెపేరు శిశిర్ కాదు, ఆమెకు తెలియదు, ఈ పేరుపెట్టి ఆమెనుగురించి నేను వ్రాస్తానని, ఆమె సూర్యునివలె ధ్రువమైన పదార్థము, ఉషఃకాలము సెలవుతీసుకొని పోతున్నప్పుడు కనబడే క్షణజీవిఅయిన అశ్రుబిందువు కాదు—నా భార్యనిజమైనపేరు హైమంతి, దాచి ఏమిప్రయోజనము?

ఆమెమీద యౌవనశోభపూర్తిగాపడడంప్రారంభించింది. నాకు అది స్పష్టమే; కాని ఆమెకుమాత్రము మెలకువ రాలేదు, ఆమె ఇంకా శైశవములోనే నిద్రిస్తున్నది. హిమాచలశిఖరాన ఉన్న మంచువలె కనబడుచున్నది ఆమె; సూర్యకిరణాలుపడుతున్నవి గాని మంచు ఇంకా కరగలేదు. అకళంకమైన శుభ్రత కలది ఆమె, నిబిడమైన పవిత్రత ఆమెది.

చదువువచ్చినపిల్ల, పెద్దది; ఏలాగు ఆమెహృదయాన్ని నాదానిగా చేసుకోగలను అని నాకు చాలాభయముగా ఉండెను. కాని హృదయము నడిచే దారికీ పుస్తకాలవల్ల కలిగేజ్ఞానానికీ ఎక్కడా ఎటువంటి విరోధమూ లేదని అతి త్వరలో నేను తెలుసుకొన్నాను. ఆమె సరళహృదయములో ఎప్పుడు రక్తిమ

ఉదయించిందో నేను సరిగా చెప్పలేను, ప్రేమవల్ల ఆమెకళ్లు ఎప్పుడు మాతపడడము ప్రారంభించినవో నేను స్పష్టముగా చెప్పలేను.

ఇదిఅంతా ఒకవైపు సంగతి, రెండోవైపు సంగతి కూడా ఉన్నది కదా!

రాజోలుఇంట్లో ఉద్యోగము మా మామగారికి. బ్యాంకులో ఆయన కూడబెట్టిన రూపాయిలమొత్తం లోకులనోట వేరువేరు పరిమాణాలు ధరించింది గాని లక్షకుతక్కువని ఎవరి నోటా నేను వినలేదు. మామగారి ధనము లోకులనోట పెరుగుతూఉన్నకొద్దీ హైమంతియెడల మావాళ్లకుగల ఆదరము అభివృద్ధిచెందుతున్నది—మా మామగారు ధనవంతులని నలుగురూ నమ్మడమువల్ల కలిగినలాభముఇదే. ఇంట్లోపనులు చేస్తుందామనీ, మాఇంటి మోస్తర్లూ, అభ్యాసాలూ, పద్ధతులూ, నేర్చుకొందామనీ, చాలా ఉత్సాహపడుతుండేది హైమంతి. కాని మా అమ్మ ఆమెను ఎందులోనూ చెయ్యిపెట్టనిచ్చేది కాదు, అతిముద్దుతో వద్దనిచెప్పేది. ఇంతేకాదు, హైమతో కొండమనిషి ఒకతెదాసీగా వచ్చింది; అమ్మ దానిని తనగది లోకి రానిచ్చేదికాదు, నిజమే; కాని నీది ఏజాతి అని దానిని ఎన్నడూ అడగ లేదు, అడిగితే ఏమి జేబాబు వస్తుందో అని భయపడి ఊరుకొనేది!

ఈవిధముగానే కాలము గడిచిపోయిఉండును, గాని చూస్తూఉండగా ఒకనాడు అకస్మాత్తుగా నాన్నముఖము నల్ల

బడిపోయింది. కథ ఏమిటనగా: పెళ్ళినాడు మామగారు నాకు పదిహేనువేలరూపాయిలు నగదు కట్నముగా ఇచ్చారు. పిల్లకు అయిదువేలరూపాయిలనగలుపెట్టారు. నాన్న స్నేహితులలో దలాల్ ఒకనిద్వారా, మామగారు పెళ్ళిపందిట్లోపోగుపెట్టినరూపాయిలు అప్పుచేసి తెచ్చినరూపాయిలనిన్నీ, వడ్డీకూడా స్వల్పముకాదుఅనిన్నీ నాన్నకు తెలిసింది. బ్యాంకులో ఉన్న లక్షరూపాయిలు వట్టిమిథ్య అట!

మామగారిఆస్తినిగురించి నాన్నకూ మామగారికీ ఎన్నడూ ఏటువంటి మాటలూ జరగలేదు. అయినా, ఏకారణముచేతనో నాకు తెలియదుగాని, నాన్నమాత్రము వియ్యంకుడు తనను బుద్ధిపూర్వకముగా మోసపుచ్చాడు అని స్థిరపరిచాడు.

మామగారు రాజమంత్రి పదవిలోనో; లేక అటువంటిది మరేదో పెద్ద ఉద్యోగములోనో ఉన్నారని మానాన్నసమ్మకాలలో ఒకటి. ఆ దేశము కబురుపంపి నాన్న కనుక్కున్నాడు, మామగారు సంస్థానశిక్షావిభాగములో అధ్యక్షులట, "అనగా, ఏ స్కూలులోనో హెడ్మాస్టరు అన్నమాట, ప్రపంచములోఉన్న అన్నిపదవులలోకి దిగువది," అని నాన్న అన్నాడు. రాజమంత్రిఅయిన మామగారు రేపో నేడో ఉద్యోగము చాలించుకొని వచ్చేసినప్పుడు అల్లుడే మంత్రిఅవుతాడు అని మానాన్న ఆశిస్తుండేవాడు.

ఇటువంటిపరిస్థితులలో, దుర్గపూజఉత్సవాలకు దేశ ములో మాకుఉన్న చుట్టాలందరూ కలకత్తాలో మా ఇంట్లో జమకూడారు. కోడలిని చూచి గుసగుసలు మొదలుపెట్టారు, వినబడీ వినబడనట్టుగా ప్రారంభమయిన గుసగుసలు క్రమముగా స్ఫుటమైనమాటలయినవి. వరసకు నాయినమ్మ అవుతుందట, ఎవరో ముసలమ్మ, ఆమె చివరకు ఒకనాడు, "ఓయి బాబు, ఇదే మిటే; కోడలు నన్ను పీగకొట్టినట్టుంది, చూచేసరికి నేనుపెద్దా అది పెద్దాఅని నాకు అనిపిస్తూఉంది!" అన్నది.

"నన్ను పీగకొట్టలేదు అనుకో, గాని ఆమాత్రము లేడాకని పై సంబంధంకోసము పరుగెత్తాలి'అవూ'?" అని అన్నది ఇంకొక ముసలమ్మ.

అమ్మ చెప్పింది జబాబు—"ఓయి బాబు అదేమిటే ఆ మాటలు, కోడలికి పదకొండు ఇంకా వెళ్లనేలేదు! వచ్చే ఫాల్గుణానికి పన్నెండో ఏడు వస్తుంది. హిందుస్థానీదేశములో ఉండి అక్కడివాళ్లలాగు "డాల్ రోటీ*" తినడముచేత పిల్ల ఒక్కదెబ్బను ఎదిగిపోయింది."

మాతో ఎందుకు చెపుతావుతల్లీ, మా దృష్టి ఇంకా అంత మందమయిపోలేదు? ఆడపెళ్లివాళ్లు మీకు మోస పుచ్చారు, ఏమీ సందేహము లేదు," అని అన్నారు నాయ నమ్మలు.

* పప్పు గోధుమరొట్టె.

"మేము జాతకము చూసి మరీ పెళ్లి చేసుకున్నాము," అన్నది అమ్మ.

చూడడమేమో నిజమే, గాని పిల్లవయస్సు జాతకము ప్రకారం పదిహేడేళ్లు.

"జాతకములో ఉన్నంతమాత్రాన నిజము అయితీరాలా?" అని అన్నారు, ఈ విషయాలలో పండిఉన్న పెద్దలంతా; వాదించివాదించి ఘోరముగా పోట్లాడుకున్నారు తరువాత.

వాదన జరుగుతూఉండగా హైమ వచ్చినిలుచున్నది ఆదగ్గిర. ఒక నాయనమ్మ, "నీకు ఎన్నేళ్లు మనమురాలా?" అని అడిగింది.

అమ్మ హైమవైపు తిరిగి కన్నుగీటింది, రహస్యముగా; హైమకు అది బోధపడ లేదు; "నాకు పదిహేడేళ్లు," అన్నది.

అమ్మ చీకాకుపడుతూ, "చాలు, నీకు మహాతెలుసునులే!" అన్నది.

నాకు తెలుసును, నాకు పదిహేడేళ్లు," అన్నది హైమంతి.

నాయనమ్మలు వాళ్ళల్లో వాళ్లు సంజ్ఞలు చేసుకొన్నారు.

అమ్మకు కోపమువచ్చింది, "అన్నీ తెలుసును నీకు, నీకు తెలియనిది ఒకటి ఉంటేకాదూ! మీ నాన్నగారు, అయితే, ఎందుకు అన్నారు నీకు పదకొండేళ్లు అని?"

హైమ నిర్ఘాంతపోతూ అన్నది, "నాన్న చెప్పాడూ? ఉత్తమాట, ఎప్పుడూ చెప్పలేదు."

"నిర్ఘాంతపోతారే నీమాటవింటే ఎవరైనా! తండ్రి నాఎదుట తననోటితో తానే అన్నాడు, కూతురు ఎన్నడూ అనలేదు అంటుంది." ఈలా అంటూ కన్నుగీటింది మరిఒకమారు. ఇప్పుడు హైమ పోల్చుకొన్నది ఆ కనుగీటుకి అర్థము; అందు చేత మరింత ఖాటీగా అన్నది, "నాన్న ఆలాగు చెప్పలేదు, ఎన్నటికీ చెప్పడు."

"నన్ను, అయితే, బొంకులమారి అంటావు అంతేనా?" అన్నది అమ్మ, గొంతుక కొంచెము తగ్గించి.

"మా నాన్న ఎన్నడూ అబద్ధమాడడు," అన్నది హైమ.

అక్కడనుంచి ప్రారంభించింది మాఅమ్మ—అవుతున్న కొలది మాటలలోనిమురికి మరింత గాఢము అయిపోతూ ఉన్నది, ఆ మురికి అన్నిటికీ అంటుకొంటున్నది.

అమ్మ కోపము మరి పట్టలేక కోడలిబుద్ధిమాలినతనాన్ని గురించి నాన్నతో చెప్పింది; బుద్ధిమాలినతనము ఉంటూఉం డగా, అన్నమాటే విడవకుండా అంటూఉండడము! నాన్న హైమను పిలిపించాడు, "పదిహేడేళ్లు వచ్చినా పెళ్లిలేకుండా ఉండడము మహాగొప్ప అనుకొంటున్నావు గాబోలు, డోలు వాయించుకొంటూ చాటిస్తున్నావు! మాఇంట్లో మాత్రం

అటువంటివి పనికిరావు, ఇదే చెప్పడము జ్ఞాపకముఉంచుకో!" అని అన్నాడు.

ఇంతకుముందు తేనెలొలుకుతుండే పంచమస్వరముతో తప్ప నాన్న కోడలితో ఎప్పుడూ మాట్లాడేవాడు కాడు, ఆమాటలన్నీ, ఇప్పుడు హఠాత్తుగా బురదలోముంచితీసిన వాటివలె ఏలాగు అయిపోయినవో కదా!

దుఃఖమువచ్చి హైమ, "ఎవరైనా నీ వయస్సు ఎంత అని అడిగితే ఏమిచెప్పమన్నారు?" అని అడిగింది.

"నువ్వు అబద్ధము ఆడక్కరలేదు. నాకు తెలియదు, మా అత్తగారిని అడగండి అని చెప్పు," అన్నాడు నాన్న.

అబద్ధము ఆడకుండే పద్ధతినిగురించి విని ఏమీ అనకుండా ఊరుకొన్నది, హైమ. ఆ ఊరుకోవడము ధోరణి చూచి తన సదుపదేశమంతా వృథాఅయిపోయింది అని నాన్నకు బోధపడిపోయింది.

హైమదుర్గతి చూచి నాకు దుఃఖమువచ్చింది. ఆమె ఎదుట నేను తల దించుకోవలసివచ్చింది. ఎప్పుడూ ఆమెకళ్లలో కనబడుతుండేఔదార్యమూ, సరళతా మాయమైపోయి, వాటికి బదులుగా ఒకవిధమైన సంశయము వాటిలో ప్రవేశించింది. శరత్కాలములో ఉదయాన్న ఉండే ఆకాశము వలె ఆమెముఖము వాడిపోయింది. బెదిరిపోయిన లేడివలె

నావైపు చూస్తూ నిలుచున్నది, "వీళ్లసంగతి నాకేమీ బోధపడకుండా ఉన్నది," అని గాబోలు అనుకొంటున్నది.

ఆవాళ, చక్కని బైండుచేసిన ఇంగ్లీషు కావ్యమొకటి కొని తెచ్చిఇచ్చాను హైమకు. హైమ దానిని పుచ్చుకొన్నది, కాని అది దానంతటఅదే ఆమె చేతిలోనుంచి ఒళ్లోకి జారిపోయింది, ఆమె దానిని ఒక్కమారు తెరిచైనా చూడలేదు.

ఆమెచేతిని నాచేతితో పట్టుకొని మీదికిఎత్తి "హైమా! కోపపడకు నామీద, నీలాగే నేనూ ఎప్పుడూ నిజమే చెపుతాను," అని అన్నాను.

హైమ ఏమీ అనలేదు, చిరునవ్వు నవ్వింది. అటువంటి నవ్వు నవ్వేశక్తి దేవుడెవరికి ఇస్తాడో వాళ్లు మాటలతో ఏమీ చెప్పనక్కరలేదు.

నాన్నకుకలిగిన సంపద స్థిరముగా ఉండేటందుకు మా ఇంట్లో దేవీపూజ కొత్తఉత్సాహముతో ప్రారంభమయింది. ఇప్పటివరకు కోడలిని ఒకనాడూ పూజఏర్పాట్లు చేయమని చెప్పలేదు. ఇప్పుడు అయింది ఆజ్ఞ, కొత్తకోడలు పూజసరంజాము సిద్ధముచేయవలసింది అని.

"ఏమి చెయ్యమంటారు అత్తయ్యా?" అని హైమి అడిగింది.

ఆకాశము చెక్కలయి నెత్తిమీద పడిపోతుంది అన్నంత ఘోర అపరాధము అందులో ఏమి ఉన్నది? అందరూ ఎరిగినదే పిల్లకు తల్లిలేదు, తండ్రి విదేశములో పెంచి పెద్దదానిని చేశాడు అని. పూజసరంజామును కోడలిమీద పెట్టడములో మామగారి ఉద్దేశము, ఆమెకు సిగ్గుతెప్పిద్దామనితప్ప వేరేదీలేదు. "ఓయి బాబు, ఇదేమిటమ్మా, ఎక్కడా వినలేదు! నాస్తికుల ఇంటినుంచి వచ్చినట్టున్నది పిల్ల! ఈ ఇంట్లో ఇక లక్ష్మిఆట్టేరోజులు ఉండదు." అని బుగ్గలమీద వేళ్లుపెట్టుకొని అమ్మలక్కలంతా అన్నారు.

ఈ సందర్భములో ఆమెతండ్రినిఉద్దేశిస్తూ అకరాని మాటలు లెక్కలేనన్ని అన్నారు మానాన్నాఅమ్మానూ. దుర్భాషగాలి వీచడము మొదలుపెట్టగానే హైమనోరు పూర్తిగా మూసుకుపోయింది, ఆమె అంతా సహిస్తూ ఊరుకొన్నది. ఇన్నాళ్లూ ఎవరిఎదుటా ఒక కన్నీటిబొట్టయినా రాలనిచ్చిందికాదు, కాని ఈవాళమాత్రము కళ్ళల్లోనుంచి నీళ్లు బొటబొట కారిపోయినవి. "మేము ఉంటూఉండేదేశములో అందరూ మానాన్నను ఋషి అని అంటూఉంటారు, ఆమాట మీరు విన్నారో లేదో!" అని చివరకు అన్నది హైమ.

"ఋషి అంటారా!" అంటూ పట్టలేనినవ్వు నవ్వారు అంతా కలిసి, అప్పటినుంచి ఆమెతండ్రిమాట ఏదైనా వస్తే, "మీఋషి-నాన్న" అని అంటూఉండేవారు—ఆమెమనస్సుకు బాధకలిగించే మార్గాలన్నిటిలోకీ మంచి దేవో కనిపెట్టారు మావాళ్లు.

సంగతేమిటంటే, మామగారు నిజముగా బ్రహ్మసమాజమువాడూ కాదు, క్రిస్టియనూ కాదు, బహుశా ఆయన నాస్తికుడుకూడా కాదు అనుకొంటాను. దేవతార్చనమాట ఆయన ఎన్నడూ ఆలోచించలేదు. పిల్లకు బాగా చదువుచెప్పించాడు, అనేకసంగతులు బోధపరిచాడు, గాని దేవతార్చనవిషయమై మాత్రము ఎన్నడూ ఎటువంటిబోధా చేయలేదు. వనమాలిబాబు దానినిగురించి అతనిని ప్రశ్నిస్తే, "నాకే తెలియని వాటినిగురించి ఇతరులకు బోధచేయడము కపటము నేర్పినట్లే!" అని అతడు జబాబుచెప్పాడట.

హైమంతిఅంటే నిజమైనభక్తి మాఇంట్లో ఒక్కరికే ఉండేది, అది మా చెల్లి 'నారాణి'. వదినయెడల అంత అనురాగం ఉన్నందువల్ల చెల్లికి బాగా తిట్లుఅయేవి, ఇంటివాళ్లు పెట్టిన నానాబాధలూ ఆమే సహించి ఉండవలసివచ్చేది. సంసారయాత్రలో హైమవంతుకుపడ్డ అవమానాన్ని గురించీ, ఆమె భరిస్తూఉండే దుఃఖాన్ని గురించీ నేను చెల్లిద్వారానే విన్నాను. హైమ నాతో వీటివిషయమై ఎన్నడూ ఒక్కమాట అనలేదు. సిగ్గువల్ల ఏమీా అనలేకపోయింది, గాని ఆ సిగ్గు తాను చేసిన దేనినిగురించీ కాదేమో!

తండ్రిదగ్గిరనుంచీవచ్చిన ప్రతిఉత్తరమూ ఆమె నాకు చూపించేది, ఉత్తరాలు చిన్నవిగానే ఉండేవి గాని ప్రేమతో నిండి ఉండేవి. తాను తండ్రిపేరను వ్రాసే ప్రతి ఉత్తరమూ చదవమని నాచేతికి ఇచ్చేది. తండ్రితో తనకుగలసంబంధములో

నాకు సంతు ఇవ్వకపోతే దాంపత్యము పరిపూర్ణత పొందదని గాబోలు ఆమె నమ్మకము. ఆమె వ్రాసిన ఉత్తరాలలో అత్త వారిమీద నిందసూచించేమాట ఒక్కటైనా ఎక్కడా ఉండేది కాదు—ఉంటేమాత్రము చిక్కు వచ్చిఉండును. అత్తవారి మీద ఏమిటివ్రాస్తుందో చూదామని మధ్యమధ్య ఆమె ఉత్త రాలు విప్పిచూడడము జరుగుతుండేదట—ఈసంగతి నా రాణి ద్వారా నాకు తెలిసింది.

ఉత్తరాలలో తమమీద అపరాధాలు మోపకపో వడము చూచి ఇంటియజమానులు మనశ్శాంతి పొందారా అంటే, అదీ లేదు. ఆశాభంగము కలగడముచేత కోపమువచ్చి అన్నారు, "ఏమి మహా మునిగిపోయిందో, ఇన్నేసి ఉత్తరాలు వ్రాసేస్తూఉంది—నాన్నే సర్వమునూ, మేము ఏమీకాము గాబోలు!" ఈ మిషపైని మళ్లా తిట్లు చెలరేగినవి. నాకు చాలా దుఃఖము వచ్చింది, "మీ నాన్నగారికి వ్రాసిన ఉత్త రాలు ఇంకెవరిచేతికీ ఇవ్వకు, నాకే ఇస్తూఉండు, కాలేజీకి వెళ్లే దారిలో నేనే వాటిని పోస్టులో వేస్తాను," అని అన్నాను.

ఆలాగు చెప్పడానికి కారణమేమని హైమ, ఆశ్చర్య పడుతూ, అడిగింది.

సిగ్గుచేత నేను ఆప్రశ్నకు జవాబుఇవ్వలేదు.

ఇంట్లోవాళ్లంతా, "ఇక మన 'అపూ' పని తుదముట్టింది బి. ఏ. పరీక్షకు తిలోదకాలే! కాని, పాపము, వాడి దేమీ తప్పులేదు," అని అంటూ వచ్చారు.

ఆహా నిస్సందేహముగా! తప్పంతా హైమదే! ఆమె వయస్సు పదిహేడు కావడము ఆమెతప్పు; నాకు ఆమెయెడల అంత ప్రేమ ఉండడము ఆమెతప్పు; భగవంతుడు నన్ను ఆలాగు చేయడము ఆమెతప్పు—అందుచేతనే నాహృదయముయొక్క ప్రతిరంధ్రములోనుంచీ వేణుగానము ఇప్పుడు వినఁబడుతూ ఉన్నది.

బి. ఏ. పాసు అతినిర్లక్ష్యముగా పొయ్యిలో పెట్టేసి-ఉందును, గాని హైమయొక్క మంచిని కోరేవాడనైతే పాస్ కావలెను, కనుక పాసుఅయితీరుతాను అని నిశ్చయించుకొన్నాను—బాగాప్యాసుఅయితీరాలి కూడాను. నేను అట్టి అవస్థలో ఉండికూడా పాస్ కాగలనని అనుకోడానికి రెండు కారణాలు ఉన్నవి. హైమప్రేమలో గొప్ప విస్తీర్ణత ఉన్నది, సంకుచితమైన అనురాగమువలె అది ఎవరిమనస్సునూ కట్టిపెట్టి ఉంచదు. ఆమెప్రేమచుట్టూ ఉత్సాహకరమైన గాలిఒకటి ఎల్లప్పుడూ వీస్తూఉండేది—ఇది మొదటికారణము. రెండవకారణము, నేను బి. ఏ. పరీక్షకు చదవవలసినపుస్తకాలు హైమతో కలిసి చదవడానికి వీలులేనటువంటివికావు.

నడుము బిగించి కూర్చున్నాను పరీక్ష పాసుఅవుదామని. ఒకనాడు ఆదివారముమధ్యాహ్నము మా ముందరిగదిలో కూర్చొని మార్టినో వ్రాసిన నీతితత్త్వము చదువుతున్నాను. నా నీలిపెనసలు నాగలిఅంచు ముఖ్యముయిన మాటలకింవా,

వాకాళ్యలకిందా నడుస్తున్నది. ఆసమయములో ఎందుకోగాని ముఖము ఎత్తి ముందుకు చూచాను.

మా అంగణానికి ఉత్తరభాగాన, నాగదికిఎదురుగా, మా వెనుకఇంటిమేడఎక్కే మెట్లు ఉన్నవి. ఆమెట్లపక్కనున్న గోడకు ఇనపగజాలువేసిన కిటికీలు ఉన్నవి మధ్యమధ్య. హైమ ఆ కిటికీలలో ఒకదానిలో కూర్చొని పశ్చిమమువైపుచూస్తున్నది. అటువైపునే పొరుగింటిమల్లిక్ గారితోటలోని కాంచనవృక్షము ఎర్రనిపూలతో నిండిఉన్నది.

నా గుండె ధబ్ధబ్మని కొట్టుకోవడము మొదలుపెట్టింది. అనౌత్సుక్యము ఆవరణరూపముగా ఇన్నాళ్లూ నామనస్సును చుట్టపెట్టిఉండెను. అది ఈవాళ అకస్మాత్తుగా విరిగిపడిపోయింది. హైమయొక్క నిశ్శబ్దవేదన అంతగాఢమైనది, ఇంతలోతైనది అని అంతకుముందు ఎన్నడూ అంతస్పష్టముగా నాకు తెలియలేదు.

ఆమె కూర్చొన్న వైఖరిమాత్రము చూస్తున్నాను, ఇంకేమీ చేయలేదు. ఆమె తల గోడకు చేరవేసిఉన్నది, ఒడిలో ఒకచేతిమీద మరిఒకచెయ్యి పడిఉన్నది, విరబోసినజుట్టు ఎడమభుజముమీదనుంచి ముందుకు వేలబడుతున్నది. నాహృదయములో ఏదోగొప్ప ఆందోళన ప్రారంభించింది.

నా జీవనము పరిపూర్ణతపొందిఉన్నదని నేను అనుకొనేవాణ్ణి, ఎట్టివెలితీ లేదనీ మరిఒకచుక్కయినా పట్టదనీ, ఎక్కడా ఎటువంటిశూన్యతా నాలోలేదనీ నేను నమ్మేవాణ్ణి.

అటువంటివాకు నిరాశ ఒక పెద్ద గహ్వారమువలె ఇప్పుడు కంటిఎదుట పడ్డది. దానిని ఏవిధముగా, దేనితోనింపి, కప్పి వేయగలను?

నేను ఎన్నడూ, దేనినీ, వదలుకోవలసి రాలేదు— బంధువులనుగాని అభ్యాసాలనుగాని—వేటినీ వదులుకొనే అవసరము నాకు రాలేదు. హైమ సమస్తమూ వదులుకొని నాదగ్గిరికి వచ్చింది. అలాగు వదులుకొనిరావడము అనగా ఏమిటి అని నేను ఎన్నడూ బాగా ఆలోచించిచూడలేదు. మా ఇంట కంటకశయనముమీద ఇప్పుడు ఆమె బస. ఆమెతో కలిసి దానిమీదనే నా నివాసము కూడాను. ఆ దుఃఖములో హైమతో సమానవంతుదారుడను నేను, దుఃఖము మాఇద్దరినీ వేరుచేయలేదు. కాని హైమ, లోపునాబయటావ్యాపించిఉన్న గొప్పస్వేచ్ఛలో, ముక్తిలో, పదిహేడుసంవత్సరాలు పెరిగి పెద్దదయిన గిరినందిని. అతినిర్మలమైన సత్యములోనూ, అతి ఉదారమైన తేజస్సులోనూ పెరగడమువల్ల ఆమెస్వభావము మిక్కిలి పవిత్రమైనదీ, సరళమైనదీ అయింది. చిన్ననాటి జీవితం నుండి ఆమెకుకలిగిన ఎడబాటు ఎంతఘోరమైనదో, ఎంతక్రూర మైనదో ఇప్పటికి నేను పూర్తిగా గ్రహించలేను—ఆమెపెరిగిన చోట నేనుపెరగలేదు, గనుక అది తెలుసుకోడము నాకు సులభ మైన పనికాదు.

ప్రతిక్షణమూ హైమకు లోలోపున చావే! ఆమెకు నేను ఏదికావలెనంటే అది ఇవ్వగలిగాను గాని ముక్తిమాత్రము

ఇవ్వలేకపోయినాను—ముక్తి నేను ఏలాగు ఇవ్వగలను, అసలు నాలో ఉంటేనా అది? అందుచేతనే ఈ కలకత్తాసందులో ఆ గజాలసందుల్లోనుంచి నిశ్శబ్దమైన ఒక మనస్సుకు నిశ్శబ్దా కాశాంతో మాటలు జరుగుతుండేవి. ఒకొక్కనాడు అర్ధ రాత్రప్పుడు లేచి చూచేసరికి హైమ పరుపుమీద ఉండేది కాదు, చేతిమీద తలపెట్టుకొని, నక్షత్రాలతో నిండిఉన్న ఆకాశమువైపు చూస్తూ డాబామీద పడుకొనిఉండేది.

మార్టినో మూలపడేశాను. ఏమిటిచేయడముఅని ఆలోచించాను. చిన్నప్పటినుంచీ నాన్నంటే నాకు చాలా భయము, ఎన్నడూ ఆయనఎదుటకు వెళ్లి ఫలానాది కావలెనని అడగ లేదు, అడిగే అభ్యాసమూ లేదు, దానికితగిన సాహసమూ లేదు. కాని ఆవాళ మరి ఉండలేకపోయినాను. సిగ్గుతో చేస్తున్నా, "హైమ ఒంట్లో బాగులేదు, ఒకమారు నాన్నగారిఇంటికి పంపిస్తే బాగుంటుంది," అని అన్నాను.

నాన్నకు మహాకోపమువచ్చింది, కోపముతో మతిపోయింది. "ఇదంతా హైమ పనే! ఎంత నిర్భయము! ఎంత సాహసము!" అని తనలోతాను అనుకొని, తక్షణము లేచి ఇంట్లోకి వెళ్లి, "ఏమిటి నీ జబ్బు?" అని ఆమెను అడిగాడు.

"జబ్బేమీ లేదే!" అని అన్నది హైమ.

ఇది పౌరుషము కొద్దీ నిర్లక్ష్యముగా అన్నమాట అనుకొన్నాడు నాన్న.

కాని హైమశరీర మేమో రోజురోజూ శుష్కించి పోతున్నది. మేము రోజూ చూస్తూఉండడముచేత మాకు తెలియడము లేదు. ఒకనాడు వనమాలిబాబు ఆమెను చూడడానికి వచ్చి, చూడగానే ఉలికి పడ్డాడు. "ఇదేమిటమ్మా హైమీ, నీరూపు ఏలాగుందో ఎరుగుదువా? జబ్బేమీ చెయ్యలేదు కదా!" అని అన్నాడు.

"లేదు," అన్నది హైమ.

ఇది జరిగి పదిరోజులయింది. ఉత్తరముపత్రము లేకుండా మామగారు ఒకనాడు తెల్లవారేసరికి మాఇంట్లో ప్రత్యక్షం! వనమాలిబాబు హైమశరీరస్థితిమాట తండ్రిపేర వ్రాసిఉండాలి, ఏమీ సందేహము లేదు.

పెళ్లిఅయినతరువాత తండ్రి కొమార్తెను విడిచిపెట్టి వెళ్లిపోతున్నప్పుడు కొమార్తె కన్నీరు పైకిరానిచ్చింది కాదు. ఈవాళ తిరిగి కలుసుకొన్నారు, తండ్రి కొమార్తెగడ్డముకింద చెయ్యివేసి ముఖము ఎత్తేసరికి కన్నీరు ఎట్టిఅడ్డూ లక్ష్య పెట్టక ధారలుధారలుగా కారడంమొదలుపెట్టింది. తండ్రినోటి వెంట మాట రాలేదు; "ఏలాగున్నావమ్మా?" అని అడగనైనా అడగలేకపోయినాడు. కూతురు కనబడగానే తండ్రి గుండె బద్దలయిపోయింది, అటువంటి దేవో ఆమె ముఖములో కనబడ్డది తండ్రికి, సందేహము లేదు.

హైమ తండ్రినిచెయ్యిపట్టుకొని తన పడకగదిలోకి తీసుకువెళ్లింది. తాను అడగవలసిన ప్రశ్నలూ అనేకము ఉన్నది, తండ్రీ జబ్బుగానే కనబడుతున్నాడు.

"నాతో వస్తావమ్మా *బుడీ?" అని తండ్రి అడిగాడు.

"వస్తాను, వస్తాను," అని అన్నది అతిఆత్రతతో.

"వత్తువుగాని అమ్మా, నేను ఆ ఏర్పాటు చేస్తాను," అన్నాడు తండ్రి.

మామగారు మాఇల్లు చేరేసరికి బహుళకంగారుగా ఉన్నారు, కాబట్టిగాని లేకుంటే ఇంట్లో అడుగుపెడుతూనే అతనికి అవగాహనఅయి ఉండును, మునపటిరోజులు ఇవి కావు అని. హఠాత్తుగా ఆయన రావడము ఏమిటీఉపద్రవము అని అనుకొన్నాడు మా నాన్న. అందుచేత అతనితో తిన్నగా మాట్లాడనైనా లేదు. "మీాఇష్టము వచ్చినప్పుడు వచ్చి పిల్లను తీసుకువెళ్లుతుండండి," అని మొదటిలో నాన్న మామగారితో అన్నాడు. ఆమాటే మామగారి మనస్సులో ఇప్పటికీ ఉన్నది. ఆ మాట ఇప్పుడు చెల్లకపోవచ్చునని మామగారనుమానించ లేదు.

నాన్న గుడాకు పీలుస్తూపీలుస్తూ అన్నాడు, "నేనేమీా చెప్పలేను సుమండీ బావగారూ, కావాలంటే ఇంట్లో అడిగి——"

* ముసలీ.

'ఇంట్లో' మీాద భారమువెయ్యడమంటే ఏమిటో నాకు బోధపడిపోయింది. చివరకు ఏమీా కాబోయేదిలేదు అని పోల్చుకొన్నాను. అలాగే, ఏమికాలేదు కూడాను.

కోడలిబంట్లో బాగులేదూ? ఏమి అన్యాయము ఇటు-వంటి అపవాద!

ఒక మంచి డాక్టర్‌ని తీసుకువచ్చి మామగారు పరీక్ష చేయించారు. "గాలి మార్చాలి, లేకపోతే హఠాత్తుగా గొప్ప జబ్బేదైనా సులభముగా రావచ్చును," అన్నాడు డాక్టర్.

"హఠాత్తుగా గొప్ప జబ్బేదైనా ఎవరికైనా రావచ్చును, అదీ ఒక మాటేనా?" అని నవ్వుతూ అన్నాడు నాన్న.

"ఆయన పేరుపడ్డ గొప్ప డాక్టర్, ఆ సంగతి మీాకు తెలుసునో లేదో? అతని మాట—"

"ఓ, ఇటువంటిడాక్టర్లను అనేకమందిని చూశాను. దక్షిణలో బలముంటే ఎటువంటి విధానమైనా జరిపించేయ వచ్చును పండితుల ద్వారా; ఏజబ్బు కావలస్తే ఆజబ్బు ఉన్నట్టు డాక్టరుదగ్గిరనుంచి సర్టిఫికెట్ తీసుకురావచ్చును," అని నాన్న అన్నాడు.

ఈ మాటలు వినగానే నిశ్చేష్టులయిపోయినారు మా మామగారు. అవమానపరిచి మరీ తండ్రిదరఖాస్తు తిరగ కొట్టారు అని తెలుసుకొని హైమ కర్రకట్టిపోయింది.

నేను మరి సహించి ఊరుకోలేకపోయినాను. నాన్న దగ్గిరికి వెళ్ళి, హైమను నేను వాళ్ళనాన్నగారి ఇంటికి తీసుకు వెళ్ళుతాను, అని అన్నాను.

"ఆహా, దానికి అంత ఆలోచన ఎందుకు?" అని పెద్ద గర్జనతో అన్నాడు నాన్న.

* * * * *

అన్నట్టు చేయలేదేమి అని నాస్నేహితులలో కొంత మంది నన్ను అడిగారు. "పెళ్ళాన్ని బలవంతాన తీసుకొని వెళ్ళి-పోతే తీరిపోయేది!"

ఎందుచేత వెళ్ళలేదు! ఎందుచేతనా? లోకధర్మము సత్య ధర్మాన్ని కాళ్ళకింద వేసి తొక్కకపోతే యుగయుగాలనాటి శిక్షణ నా రక్తములో ఉండి ఏమి లాభము? ఇంట్లో వాళ్ళను ఇంటికిబలి ఇవ్వకపోతే ఆ శిక్షణయొక్క ప్రయోజన మేమిటది? సీతను విస ర్జించమని పట్టుపట్టిన అయోధ్యాపుర వాస్తవ్యులలో నేను ఒకణ్ణి ఆ మాట మీరుఎరుగరేమో? ఆ విసర్జనను పొగుడుతూ యుగాలతరబడి పాటలుపాడుకువస్తూఉన్న సత్పురుషులలో నేను ఒకణ్ణి. భార్యను పరిత్యజించడములోఉన్న గుణాన్ని వర్ణిస్తూ లోకరంజనార్థమయి మాసపత్రికలలో ఉపన్యాసాలు వ్రాసిన మహానుభావుడను నేనే; హృదయములోని రక్తముతో రెండో సీతావిసర్జనకథను . ముందు కెప్పుడో వ్రాయవలసి వస్తుంది అని నేను అప్పుడు ఏలాగు అనుకోగలను?

తండ్రి కొమార్తెను విడిచిపెట్టి వెళ్లే సమయము మరిఒక మారు వచ్చింది. ఈమారుకూడా ఇద్దరిముఖాలలో చిరునవ్వే. కూతురు నవ్వుతూ తండ్రినిచీవాట్లుపెట్టింది. "నాన్నా, ఈ మారుగాని నన్ను చూడడానికి ఇంతకంగారుగా ఇంటికి పరు గెత్తుకొని వచ్చావంటే, చూస్తూఉండు, నేను గదిలోకి పారి పోయి తలుపులు బిడాయించుకొంటాను," అని అంటూ నవ్వింది.

"ఈమారు వస్తేమాత్రము కన్నమువేయడానికి ఆయు-ధము పట్టుకొనిమరీ వస్తాను," అని నవ్వుతూనే తండ్రి జెబాబు ఇచ్చాడు.

చిన్నప్పటినుండిఉండే ప్రేమపూరితమైన ఆ చిరునవ్వు ఆ నాటినుండి హైమంతిముఖాన ఒక్కమారైనా నాకు కన బడలేదు.

తరువాత జెరిగినసంగతి వ్రాసేశక్తి నాలోలేదు.

... ... ... ... ...

అమ్మ పెళ్లికూతుర్ని వెదుకుతున్నదని వింటున్నాను—అమ్మ కోరిక నెరవేర్చకుండా ఊరుకోలేనిరోజేకూడా తిరిగి వస్తుందేమో బహుశా! ఎందుచేత నంటే—పోనీ, పోనీ, అదంతా ఇప్పుడు చెప్పి ఏమిలాభము?

1914

# ఎండా నీడా

ముందురోజు వర్షము కురవగలిగినంతా కురిచేసింది, ఇవ్వాళ మరి వర్షము లేదు. చేలలోని చులకని ధాన్యము కొద్ది రోజులలో పండిపోతుంది. ఎండానీడా ఒకదాని వెంబడి ఒకటి చేలమీద పడతూఉండడమువల్ల ఎవరో కుంచిపట్టుకొని రంగు వేస్తున్నట్టుగా కనబడుతున్నది. నలుదిక్కులా వ్యాపించి ఉన్న చేను ఎండపడినప్పుడు ఉజ్జ్వలమైన పసుపురంగుతో ప్రకాశిస్తున్నది, పరక్షణమే నీడపడడమువల్ల గాఢమైన నలుపులో మునుగుతున్నది.

సమస్త ఆకాశాన్ని రంగభూమి గా చేసి ఎండానీడా తమ తమ భూమికల కుచితమైనట్టు అభినయము చేస్తున్నవి. అటువంటి సమయములో ఈ సంసారములో ఎన్ని చోట్ల ఎన్నెన్ని అభినయాలు జరుగుతున్నవో వాటిని లెక్కపెట్టడము ఎవరి తరము?

నేను తెరఎత్తుతున్న చోట ఒక చిన్న జీవన నాట్యము జరుగుతున్నది; తెరఎత్తగానే ముందు కనబడేది పల్లెటూరిలో రోడ్డుప్రక్క నున్న ఒక చిన్న ఇల్లు. ఆ యింటి ముందుగది మాత్రము పక్కాగా కట్టినది. రెండు ప్రక్కలా పడిపోతున్న ఇటికల ప్రహరీఒకటి ఉన్నది, దానిని అంటి మంటిగోడలతో కట్టిన

గదలు కొన్ని ఉన్నవి. రోడ్డుమీదనుంచి చూచేసరికి కిటికీ గజాలలోనుంచి లోపున బల్లమంచమీదకూర్చున్న యువకుడు ఒకడు కనబడుతున్నాడు. అతని ఒంటిమీద బట్ట లేదు. ఎడమ చేతితో విసనకర్ర పట్టుకొని, చెమటగా ఉండడముచేత, ఉండుండి విసురుకొంటున్నాడు, ఈగలు తోలుకొంటు న్నాడు; కుడిచేతితో పుస్తకము పట్టుకొని బహుశ్రద్ధగా చదువుతున్నాడు.

డోరియాచీర చెంగున నేరేడిపళ్లు కట్టుకొని ఒకొక్కటి తింటూఉన్న బాలికఒకర్తె రోడ్డుమీదనుంచి కిటికీగజాలదగ్గరికి వచ్చి పోతున్నది. పిల్లకీ ఆ యువకునికీ బాగా పరిచయము ఉన్నదని చూచినవాళ్ళందరికీ ఆ పిల్లముఖమువల్ల స్పష్టమవు తుంది. అతనిని ఏలాగైనా తనవైపు చూచేటట్టుచేసి, తాను ఇప్పుడు నేరేడిపళ్లుతినడమనే గొప్పపనిలోఉండబట్టి అతనితో మాట్లాడడానికైనా తనకిప్పుడుతీరదు అని అతి నిరసనభావ ముతో ఆ యువకునికి తెలియచేయవలెనని ఆపిల్ల అవస్థపడు తున్నది.

లోపలనున్న విద్యార్థికి దృష్టితక్కువ, ఆ పిల్లదుర దృష్టము అది. అందుచేత ఆమె కనపరుస్తూఉన్న ఉపేక్ష అతనిని తాకనైనాతాకకుండా ఉన్నది. పిల్లకుకూడా ఆ సంగతి తెలు సును, అందుచేత చాలాసారులు వచ్చిపోయి, తానుచేసిన ప్రయత్నం నిష్ప్రయోజనమని నిశ్చయించి నేరేడిగింజలను అతనిపై ప్రయోగించడము మొదలుపెట్టింది. గుడ్డివాళ్లదగ్గర

పౌరుషము కాపాడుకోవడము ఎవరికైనా సాధ్యముకాని పని.

తరువాత కొంతసేపటికి కాకతాళీయముగా రెండు మూడు పెద్దపెద్ద గింజెలు వెళ్లి కర్ర తలుపుకు తగిలి ఠక్ మని శబ్దము చేసినవి, యువకుడు తలఎత్తి చూచాడు. ఆ మాయలపిల్ల ఆ సంగతి పోల్చుకొన్నది, ముఖము వాల్చుకొని మరింత శ్రద్ధతో బాగాపండిన నేరేడుపళ్లు ఎంచుకోవడము మొదలుపెట్టింది. యువకుడు కనుబొమ్మలు చిట్లించి జాగ్రత్తగా చూచి పిల్లను పోల్చుకున్నాడు. పుస్తకము క్రిందపెట్టి నిలబడి ఇనపగజాలదగ్గిరికి వచ్చాడు; నవ్వుతూ, "గిరిబాలా!" అని పిలిచాడు.

గిరిబాల ఎటువంటి తత్తరపాటూ చూపించలేదు, తదేకధ్యానముగా చెంగులోనుంచి పళ్లు ఎంచుకొంటూ మెల్లిగా ఒక్కొక్క అడుగు వేసుకొని వెళ్లడం మొదలుపెట్టింది.

తానెరుగని అపరాధమేదో చేసినందుకు శిక్ష పొందుతున్నట్టు మందదృష్టిగల మనఅబ్బాయికి అప్పటికి బాగాబోధపడ్డది, తొందరతొందరగా బైటకువచ్చి, "ఏవీ నావంతు నేరేడిపళ్లు ఈవాళ ఇచ్చావుకావే!" అని ఆ పిల్లతో అన్నాడు. గిరిబాల ఆ మాట విననట్టుగా అతిశ్రద్ధతో పళ్లు ఎంచుకొంటూ తినడము ప్రారంభించింది.

ఆ పళ్లు గిరిబాలతోటలోనివి, రోజూ తెచ్చి అతనికి వంతుఇచ్చేది. ఎందుచేతనోగాని ఆ మాట గిరిబాలకు ఈవాళ

జ్ఞాపకమైనా రాలేదు. ఆమెవ్యవహారము చూస్తే ఈవాళ పళ్లన్నీ తనఒక్కర్తెకోసమే తెచ్చుకొన్నట్టు కనబడుతున్నది. కాని తనతోటలోరాల్చినపళ్లను పై వాళ్లగడపలో నిలుచొని అందరికీ కనబడేటట్టు తినడానికి కారణం పూర్తిగా తెలుసుకోవడము సులభంకాదు. ఆ సమయములో ఆ అబ్బాయి వచ్చి ఆ పిల్లచెయ్యి పట్టుకొన్నాడు. గిరిబాల ఇటూఅటూ గుంజాయించి చెయ్యి వదిలించుకొందామని మొదట ప్రయత్నము చేసింది, తరువాత కళ్ళ నీళ్లుపెట్టుకొని బిగ్గరగా ఏడవడము ప్రారంభించింది; కొంగు జారవిడిచింది, కొంగులోనున్న పళ్లన్నీ క్రిందపడిపోగానే పరుగెత్తి పారిపోయింది.

ప్రొద్దున్న వడిగా పరుగెత్తుతున్న మేఘాలూ, తీక్ష్ణమైనఎండా, సాయంకాలముకాగానే అలసటపడి విశ్రాంతి తీసుకొంటూ ఉన్నట్టుగా కనబడుతున్నవి. తెల్లమేఘాలు కుప్పలు పెట్టినట్టుగా ఆకాశాన ఒకమూలకు చేరుకొన్నవి. సాయంకాలమవుతూఉండడముచేత వెలుతురు బాగా క్షీణించింది. ఆ వెలుతురు చెట్లఆకులమీదనూ, చెరువునీటిమీదనూ, పడుతూఉన్నది! వర్షములో స్నానముచేసిఉన్న సృష్టియొక్క ప్రతిఅంగముమీద ఆవెలుతురు పడి నిగనిగమెరుస్తున్నది. ఆ పిల్ల తిరిగి ఆ గజాలకిటికీదగ్గర నిలుచొని ఉన్నది, ఆ యువకుడు ఆ ఇంట్లోనే కూర్చొని ఉన్నాడు. ఉదయానికీ ఇప్పటికీ వ్యత్యాసము ఏమిటంటే, ఆ పిల్లదానికొంగులో ఇప్పుడు నేరేడిపళ్లు లేవు, ఆయువకునిచేతిలో పుస్తకము లేదు. ఇంతే

కాదు, మరిఒక భేదముకూడా ఉన్నది, కాని అది కేవలము పైపైనుండే భేదముకాదు, అది లోపునఉండే భేదము, మహా గొప్పది.

ఏముఖ్యమైన పనిమీద ఆ బాలిక ఈ పూటకూడా వచ్చి ప్రత్యేకముగా ఆ స్థలములో నిలుచొని తడబడపడుతున్నదో చెప్పడము కష్టము. ఆబాలికవ్యవహారాన్నిబట్టి ఏది ఊహించినా ఊహించవచ్చును. కాని ఆమెకు ఆ యువకునితో మాట్లాడవలెననే కోరిక ఉన్నదనిమాత్రము ఊహించలేము. ప్రొద్దున్న తాను వేసిన నేరేడిపళ్లు మొక్కలయిన వేమో చూదామని వచ్చింది గాబోలు!

మొక్కలు ఇంకా పుట్టలేదు. దానికి అనేకకారణాలు ఉండవచ్చును. వాటిలో ముఖ్యమైనకారణము ఏమిటంటే ఆ నేరేడిపళ్లుఅన్నీ ఆ మంచంమీద పోగుచేసి ఉన్నవి. మధ్య-మధ్యను బాలిక తలవంచుకొని ఊరూపేరూలేని కల్పనావస్తు-వేదో వెతుకుతున్నది. యువకుడు నవ్వు ఆపుకొని గంభీర-భావముతో నేరేడిపళ్లు ఎంచి అతిశ్రద్ధగా ఒకొక్కటి తింటూ ఉన్నాడు. కొంతసే పయిన తరువాత ఒకటిరెండు గింజలు వచ్చి ఆబాలిక కాళ్ళకు తగిలినవి, ఒంటిమీదకూడా పడ్డవి. అప్పుడు పిల్ల పోల్చుకున్నది, ఆయువకుడు తనమీద పగతీర్చుకొంటున్నాడు అని. కాని ఇది న్యాయమేనా? పాపము, ఆ బాలిక అభిమానము విడిచిపెట్టి తన దీనహృదయాన్ని సమర్పించుకో డానికి దారేదైనా కనబడుతుందేమోఅని వెదుకుతున్నది,

ఆవారి అసలే కష్టమైనది, పైగా ఈవిధంగా అడ్డుపెడుతూ ఉండడము దయాహీనత కాదూ ? పిల్ల పట్టుబడిపోదామని వచ్చినట్లు అతను పోల్చుకొన్నాడు. ఈ సంగతి ఆ పిల్ల తెలుసుకోగానే ముఖము ఎర్రచేసికొన్నది, పారిపోదామని అనుకొంటూఉంటే ఆ అబ్బాయి బయటికి వచ్చి ఆ పిల్ల చెయ్యి పట్టుకొన్నాడు.

ఆపిల్ల ఇటూఅటూ కొట్టుకుంటూ చెయ్యివదిలించుకొని ప్రొద్దున్న మోస్తరుగా పారిపోదామని చాలా ప్రయత్నము చేసింది, గాని వీడవలేదు. పిల్లముఖము కందిపోయింది; మెడవంచి ఆ అబ్బాయివెనకను తనముఖము దాచుకొంటూ అతి బిగ్గరగా నవ్వసాగింది. కేవలము బలములేక లొంగిపోయినాను అని వెల్లడిచేసే ఖైదీవలె ఆ ఇనపగజాలవెనుకనున్న జైలులో ప్రవేశించింది.

ఆకాశాన ఎండానీడా చేసే కేళి ఒక గొప్ప సంగతి కాదు. అదేవిధముగా భూమిమీద వీరిద్దరూ చేస్తూఉండే కేళి కూడా ఒక పెద్దవిషయము కాదు, ఇదీ దానివలెనే క్షణభంగురము. కాని ఇంకొకవిధముగా చూస్తే ఆకాశము మీద ఎండకూనీడకూ జెరుగుతున్న ఆట కేవలం సామాన్యవ్యవహారం కాదు, ఆటలాగున కనబడుతుంది గాని ఆట కానేకాదు. వీరిద్దరి ఆటకూడా అదే మోస్తరు. ఏ వర్షపుదినమునాటి మధ్యాహ్నమో జెరిగిన ఈ ఊరుపేరూలేని ఇద్దరుపిల్లలఆట,

ప్రపంచంలో ప్రతిరోజూ జరుగుతున్న లెక్కలేనిసంగతులలో ఏమూలనో అని అనిపించవచ్చును, గాని ఆకాశమందుజరుగు తున్న ఆ ఆట లాగునే ఇదికూడా ఆటమాత్రమే కాదు. నిశ్చల మైనముఖముతో గంభీరముగా కూర్చొని యుగానికియుగము చేర్చి కాలమాల గుచ్చుతూఉన్న పురాణపురుషుడే, యావజ్జీ వమూ ఉండవలసిన సుఖదుఃఖాల బీజాలను, ఆ బాలికయొక్క అతిసామాన్యమైన నవ్వూఏడ్పులలోకూడా అంకురింప జేశాడు. అయినా ఆ బాలికలో అకారణముగాపుట్టిన అభి మానము అర్థహీనమైనదిగా కనపడవచ్చు. అట్లాగు కనిపించ డము కేవలము పైవాళ్ళకే కాక, ఈనాటకములో ప్రధాన పాత్రఅయిన ఆ యువకునికికూడాను. ఆ బాలికకు ఎందుచేత ఒకనాడు కోపమువస్తూఉంటుందో, మరిఒకనాడు ఆమె ఎందు చేత అపరిమితమైన దయచూపిస్తుందో, ఎందుచేత ఒకనాడు మామూలుప్రకారము అతనివంతు అతనికి ఇచ్చేస్తుందో ఒకనాడు ఇవ్వదో—దీనిఅంతటికీ కారణము కనిపెట్టడము సులభము కాదు. ఒక్కొక్కనాడు ఆ పిల్ల తనకల్పనాశక్తినీ, తన ఆలోచననూ, తననైపుణ్యాన్నీ ఆయువకునికి సంతోషము పుట్టించే పనులుచేయడంలోనే వినియోగించేది, ఒకొక్క నాడు తనలో ఏ అల్పశక్తిఉన్నదో అదీ, తనలోఉన్న కాఠి న్యమూ పూర్తిగా వినియోగించి ఆయువకునికి బాధకలిగిద్దా మనే ప్రయత్నించేది. అతనికి బాధకలుగజేయలేకపోయినప్పుడు ఆమెలోఉండేకాఠిన్యము పదింతలుఅయేది, ఆమెప్రయత్నమే

ప్రఫలమయితే ఆ కాఠిన్యము అనుతాపంవల్ల స్నేహం క్రింద మారి అశ్రుధారలరూపముగా ప్రవహించేది.

2

గ్రామమునిండా కక్షలు. చెరుకు వ్యవసాయానికనీ, నారపండించడానికనీ, పోట్లాటలతోనూ, దొంగదావాలతోనూ, నిండిఉన్నది ఊరు. సాహిత్యచర్చకుగాని, ఏ మంచి విషయాలను గురించైనా ఆలోచనకూగాని మిగిలినదల్లా గిరిబాల శశిభూషణ్—వీళ్లిద్దరు మాత్రమే!

దీనివల్ల ఎవరికీ ఏమీ కష్టముకలుగలేదు, ఎవరిలోనూ ఇది కుతూహలం పుట్టించలేదు. గిరిబాలవయస్సు పది సంవత్సరాలు, శశిభూషణ్ అప్పుడే ఎం. ఏ., బి. ఎల్. పాసు అయి వచ్చాడు—ఇద్దరూ ఇరుగుపొరుగులు.

గిరిబాలతండ్రి, హరకుమార్, ఒకప్పుడు గొప్పఐశ్వర్యవంతుడు, ఒక గ్రామమంతటికీ ఒకేపట్టాదారుడు, చెడ్డదినాలు వచ్చి ఆస్తిఅంతా అమ్ముకొన్నాడు. ఇప్పుడు ఒక పరదేశీజమీందారుదగ్గిర రివిన్యూ సూపరెంటుగా ఉన్నాడు. ఏ పరగణాలో పూర్వం ఉండేవాడో ఆపరగణాలోనే ఇప్పుడు సూపరెంటుగా ఉండడముచేత అతనికి జన్మస్థానము విడవనవసరము లేకపోయింది.

శశిభూషణ్ ఎం. ఏ. పాస్‌అయి 'లా' కాలేజీలో చదివి బి. ఎల్. కూడా పాస్‌అయినాడు, గాని ఏ పనిలోనూ ప్రవేశించలేదు. శశిభూషణ్ ఎవరితోనూ కలిసేవాడు కాడు. ఏదైనా మీటింగు అయితే వచ్చి ఎన్నడూ నాలుగుమాటలు చెప్పలేదు. దృష్టి మందము కావడముచేత పరిచయమున్న వాళ్లనైనా అతడు పోల్చుకోలేకపోయేవాడు, అందుచేతనే ఎదురుగుండా ఎవరైనా కనబడితే కనుబొమ్మలు చిట్లించి కళ్లు చిన్నవిచేసి చూస్తూఉండేవాడు. దీనివల్ల ఇతడు గర్వపోతు అని అందరూ అనుకొనేవారు.

కలకత్తాలో, అక్కడి జనసముద్రములో ఏకాకిగా ఉండడము సరిపోతుందిగాని ఈ పల్లెటూరిలోమాత్రము అట్లాగు కుదరదు కదా! కనుక అందరూ అతనిని పొగరుబోతు అని అనుకొనేవారు. శశిభూషణ్ తండ్రి చాలా ప్రయత్నముచేశాడు. గాని ఏమీ ప్రయోజనములేకపోయింది, చివరకు నిరుద్యోగి అయిన తనకొడుకును తీసుకువచ్చి తమకుఉండే ఆస్తికాస్తా చేక్కచూచుకోమని అప్పచెప్పాడు. ఆగ్రామస్థులు అతనిని అనేకవిధాల కష్టపెడుతూ ఉండేవారు, అతనిని చూచి ఎగతాళి చేస్తూఉండేవారు, అవమానపరుస్తూ ఉండేవారు; అతను అంతా సహించి ఊరుకోవలసివచ్చేది. వాళ్లుచేసే అవమానానికి ఇంకొక కారణము ఏమిటిఅంటే—శాంతిప్రియుడైన శశిభూషణుకు పెళ్లి అంటే ఇష్టములేకపోవడము. కన్యాదానముచేయకోరి వచ్చిన

తల్లిదండ్రులు ఈ అనిచ్ఛను చూచి అహంభావము అని అనుకొనేవారు, వాళ్ళకు మహాకోపమువచ్చేది.

మీదపడుతున్న ఆపదలు అధికమవుతున్న కొలది మరీ ఆత్మనిమగ్నుడయి తనలోతనను దాచుకొనేవాడు శశిభూషణ్. ఇంటికి ఒకమూలనుండే గదిలో బల్లమంచ మొకటి వేసుకొని బైండుచేసిన ఇంగ్లీషుపుస్తకాలు దగ్గిరపెట్టుకొని కూర్చుండేవాడు, ఇష్టమువచ్చినపుస్తకము తీసి చదువుతుండేవాడు. అయితే మరిఆస్తికాపాడే మార్గము ఏదీ? అది ఆస్తే ఎరుగాలి!

మానవప్రపంచములో ఇతనికిఉన్న సంపర్కమంతా ఒక్కగిరిబాలతోనేఅని చెప్పవచ్చును. ఆమాట ఇప్పటికి చదివేవాళ్లకు తెలిసేఉంటుంది.

గిరిబాలకు స్కూల్లోచదువుకొంటూఉన్న అన్నలు ఉండేవారు. స్కూల్‌నుంచి వస్తూనే మాధురాలైన గిరిబాలను అడిగేవారు, భూమిది ఏ ఆకారము అని ఒకనాడు, మరిఒకనాడు సూర్యుడు పెద్దా భూమి పెద్దా అని గిరిబాల తప్పుచెపితే వేళాకోళముచేసి పెద్దకేకలువేసుకొంటూ ఆ తప్పు దిద్దేవారు. భూమికంటె సూర్యుడు పెద్ద అని గిరిబాలకు నమ్మకముపుట్టేటట్టు ప్రమాణాలతో కనపరచలేకపోయి నప్పుడు గిరిబాల సాహసించి తన సందేహాన్ని తెలియజేస్తే వాళ్ళు మరీ కేకలువేసుకొంటూ, మరింత నిరసనగా అనేవారు—"బేష్! మా పుస్తకాలలోఉంటే నువ్వు—"

అప్పుపుస్తకములో ఆమాట ఉన్నదని విని గిరిబాల మరేమీ అనలేకపోయేది, అచ్చుకంటె గొప్పప్రమాణము ఉండదు కదా!

అన్నలు చేదివినట్టుగా పుస్తకాలు పట్టుకొని చేదవవలె నని గిరిబాలకు చాలాకోరికగా ఉండేది. ఒకొక్కనాడు తన గదిలో పెద్దపుస్తకముఒకటి పట్టుకొని గొణగొణమని చేదువుతున్నట్లు నటించి పేజీలు గబగబ తిరగవేస్తూ ఉండేది. ఏమీబోధపడని ఆచిన్న చిన్న నల్లనిఅచ్చుఅక్షరాలు, గుడులనూ, ఔత్వాలనూ భుజాలమీద ఎక్కించుకొని ఒక మహారహస్య-శాలయొక్క సింహద్వారములో వరసలువరసలుగా నిలబడి, గిరిబాలవైపు చూస్తూఉండేవి. ఆమె ఎటువంటిప్రశ్న వేసినా జబాబుచెప్పేవికావు. కథామాలగాని దానిలోఉండే పులులూ సింహాలూ, కుక్కలూ నక్కలూ, గాడిదలూ గుర్రాలూగాని అతికుతూహలముతో చూస్తూఉన్న ఆ బాలికకు తమ రహస్యాలేవీ తెలియనిచ్చేవికావు. ఆఖ్యానమంజరి తనలోఉన్న ఆఖ్యానాలనన్నింటినీ తనలోనే దాచుకొని మౌనవ్రతముపట్టి నోరుమూసుకొని కూర్చుండేది.

అన్నలదగ్గిర గిరిబాల తనచేదువుమాట ఎత్తిందిగాని వాళ్లు ఆమాట వినుపించుకోలేదు. ఇక ఆమెకు సహాయము చేయగలిగినదంతా శశిభూషణ్ ఒక్కడే.

కథామాలా, వ్యాఖ్యానమంజరీ, ఏరీతిగా అభేద్యమైన రహస్యాల్లో గిరిబాలకు శశిభూషణ్ కూడా అలాగే అభేద్యమైన రహస్యము—రోడ్డుప్రక్కను ఇనపకమ్ములతో కట్టిన గదిలో ఒంటరిగా పుస్తకాలమధ్య కర్రమంచముమీద కూర్చొని ఉండేవాడు. తలవంచుకొని తదేకధ్యానముగా పుస్తకాలు చదువుతూ ఉన్న ఆ అద్భుతయువకుని చూస్తూ ఇనపకమ్ములు పట్టుకొని బయట నిశ్చేష్టురాలయి నిలబడేది గిరిబాల. పుస్తకాల సంఖ్యను పట్టి చూచి తన అన్నలకంటె అతడనేకరెట్లు గొప్పవిద్వాంసుడని గిరిబాల నిశ్చయించింది. ఇతడు కథామాల మొదలైన శ్రేష్ఠగ్రంథాలన్నీ పూర్తిచేసే ఉంటాడు, ఆవిషయంలో గిరిబాలకేమీ సందేహములేదు. కనుక శశిభూషణ్ ఆపుస్తకాలపేజీలు తిరగవేస్తూ ఉంటే బహుశ్రద్ధతో చూస్తూ దగ్గిర నిలబడినా, ఆయన జ్ఞానముయొక్క సరిహద్దులు ఆమె నిర్ణయించలేక పోయేది.

చివరకు, విస్మయముతో నుండిఉన్న ఈ బాలిక ఆ మంద దృష్టిగల యువకుని మనస్సును ఆకర్షించింది. శశిభూషణ్ ఒక నాడు జిగజిగ మెరుస్తూ ఉండే పుస్తకమొకటి విప్పి, "గిరిబాలా, దా, బొమ్మలు చూడవుగాని," అని అన్నాడు. గిరిబాల ఒక్క గంతువేసి పారిపోయింది.

కాని, ఆ మర్నాడు తన డోరియాపరికిణీ కట్టుకొని వచ్చి తిరిగి ఆ ఇనపకమ్ములు పట్టుకునిలుచొని, కదలకుండా మెదలకుండా అతిగంభీరముగా చదువులో నిమగ్నుడై ఉన్న ఆ యువకునివైపు చూస్తూ నిలబడ్డది. ఆనాడుకూడా శశిభూషణ్ గిరిబాలను పిలిచాడు. ఆనాడుకూడా గిరిబాల జట ఎగరవేసుకొంటూ పారిపోయింది.

వాళ్లపరిచయములో పడుగు ఈవిధముగా ప్రారంభము అయింది. నేత క్రమక్రమముగా చిక్కనయి ఆ బాలిక గజాల వెలపలనుండి శశిభూషణుగదిలోకి ఎప్పుడు ప్రవేశించినదో, అతని మంచేముమీాదనున్న బైండుపుస్తకాలమధ్య ఎప్పుడు తనను స్థాపించుకొన్నదో ఆ తేదీలూ ఘంటలూ సరిగా నిర్ణయించడము ఐతిహాసికపరిశోధకులు లేనిదే సాధ్యముకానిపని.

గిరిబాలచేదువు శశిభూషణ్ దగ్గిర ప్రారంభము అయింది. వింటే అందరూ నవ్వుతారు—ఈ మాస్టరుగారు ఈ చిన్న శిష్యురాలికి అక్షరాలూ, వ్యాకరణమూమాత్రమే చెప్పి చాలించేవాడు కాదు; గొప్పగొప్పకావ్యాలు తర్జుమాచేసి వినిపించేవాడు; వినిపించి వాటినిగురించి ఆమెఅభిప్రాయము అడుగుతుండేవాడు, ఆ పిల్లకు ఏమి బోధపడేదో ఆ అంతర్యామికే తెలియవలేను, గాని పిల్లకుమాత్రము అవన్నీ వింటూఉండడమంటే చాలా సరదాగా ఉండేది, అందుకేమీ సందేహములేదు. బోధపడినదానినీ, పడనిదానినీ, ఈరెండిటినీ కలిపి ఆ పిల్ల తన చిట్టిహృదయములో ఒక అద్భుతమైన చిత్తరు

వును నిర్మిస్తూఉండేది. కళ్లు పెద్దవిచేసి, మాట్లాడకుండా కూర్చొని బహుభక్తితో వింటూఉండేది. మధ్యమధ్య ఏమీసంబంధము లేని ప్రశ్నఒకటి వేస్తూఉండేది, అప్పుడప్పుడు అకస్మాత్తుగా అసలు చదువుతోనే సంబంధించని ప్రసంగముకూడా ఎత్తేది. శశిభూషణ్ ఏమీ అడ్డుపెట్టేవాడుకాడు. ఆ మహాకావ్యాలనుగురించి ఈ చిన్న విమర్శకురాలుచేసే నిందా, స్తుతీ, వింటూ ఉన్నా, ఆమెచెప్పే టీకా, భాష్యమూ, వింటూఉన్నా శశిభూషణ్‌కు చాలా ఆనందం కలుగుతుండేది. ఆ గ్రామమంతటిలోనూ శశిభూషణ్‌ని సరిగా బోధపరుచుకొన్నది ఆ చిన్న స్నేహితురాలు, గిరిబాల ఒకర్తే!

గిరిబాలతో శశిభూషణుని స్నేహముప్రారంభించినప్పటికి గిరిబాలవయస్సు ఎనిమిది సంవత్సరాలు. ఇప్పుడు ఆమెకు పదేళ్ళు. ఈ రెండుసంవత్సరాలలో ఆమె ఇంగ్లీషుచదవడము నేర్చుకొన్నది, బంగాలీవర్ణమాల నేర్చుకొని నాలుగయిదు సులభమైన పుస్తకాలు పూర్తిచేసింది. శశిభూషణ్‌కుకూడా ఈ రెండు సంవత్సరాలూ ఆ పల్లె కేవలము సహవాసరహితమైనదనిగాని, రసహీనమైనదనిగాని అనిపించలేదు.

3

కాని గిరిబాలతండ్రి హరకుమార్‌కూ, శశిభూషణ్‌కూ అత్తలేదు. మొదటిలో హరకుమార్ దావాదర్బార్లనుగురించి సలహాకోసము ఈ ఎం. ఏ. బి. ఎల్. దగ్గిరికి వస్తూఉండేవాడు. ఎం. ఏ., బి. ఎల్. అతడుచెప్పేదంతా శ్రద్ధతో వినేవాడుకాడు,

'లా'తో సంబంధించిన విషయాలలో తనకుండే జ్ఞానము అతిస్వల్పమని అతడు రిజిస్ట్రార్ సూపరెంటుగారి ఎదుట ఒప్పుకోడానికి సంకోచించేవాడు కాడు. ఇవన్నీ తప్పించుకోడానికి శశిభూషణ్ చెప్పే మిషలని రిజిస్ట్రార్ సూపరెంటుగారు అనుకొనేవారు. ఈలాగు ఆరెండుసంవత్సరాలు గడిచినవి.

తిరుగుబాటుచేస్తూఉన్న ప్రజలను లొంగదీయవలసిన అవసరము వచ్చింది రిజిస్ట్రార్ సూపరెంటుగారికి. ప్రజలమీంద వేరువేరు జిల్లాలలో వేరువేరు అపరాధాలుచేసినట్టుగా దావాలువేయించ నిశ్చయించుకొని, సూపరెంటుగారు ఆ సందర్భములో కొంతసలహాకని శశిభూషణ్ దగ్గిరికి వచ్చి అతనిని వేధించాడు. సలహా ఇవ్వకపోవడము అటుఉండగా, అతి నిశ్చలమైన మనస్సుతో గట్టిమాటలు నాలుగు చెప్పాడు శశిభూషణ్. అవి సూపరెంటుగారికి రుచించేమాటలు కావు.

ఇవతల, ప్రజలమీంద వేసిన దావాలలో ఒకదానిలోనైనా హరకుమార్ గెలవలేదు. ఆ దుర్మార్గులైన ప్రజలకు శశిభూషణుడే సాయముచేసిఉండాలి, దానికేమీసందేహము లేదు, అని సూపరెంటుగారినమ్మకము. ఇట్టివాణ్ణి గ్రామములోనుంచి తక్షణమే గెంటించివేయవలెను అని ప్రతిజ్ఞపట్టారు సూపరెంటుగారు.

శశిభూషణునిపొలాల్లో పశువులమందలు ప్రవేశించేవి, అతని ధాన్యపుకుప్పలకు నిప్పు అంటుకొనేది, అతనిభూములు

హార్దసలనుగురించి దావాలు పడ్డవి—ఇటువంటివి చాలా అల్లర్లు ప్రారంభంఅయినవి. అతని రయితులు మామూలు ప్రకారం శిస్తులు ఇవ్వక పైగా అతనిమీద అబద్ధపుదావాలు మొదలుపెట్టారు. ఇదంతా కనిపెట్టాడు శశిభూషణ్. చీకటి-పడ్డాక ఇంట్లోనుంచి బయటికి వస్తే కొడతారనీ, రాత్రి అతని ఇంటికి నిప్పుముట్టిస్తారనీ—ఇటువంటి ఉపద్రవాలు ఇంకేవేవో జరగబోతున్నవనీ అందరూ అనుకొంటూఉంటే విన్నాడు శశిభూషణ్.

శశిభూషణ్ శాంతిప్రియుడు, అమాయకుడు, మహా సాధువు; అందుచేత ఈ గ్రామము విడిచి కలకత్తా వెళ్లిపోదా మని నిశ్చయించుకొన్నాడు.

బయలుదేరబోతున్నాడు. ఆసమయంలో జాయంట్ మ్యాజిస్ట్రేటువారి గుడారము గ్రామములో పడ్డది. జవా-నులూ, కనిష్టేబులూ, కుసినీవాడూ, టోటీ—వీళ్ళవల్ల నయితేనేమి, దొరగారి కుక్కలూ, గుర్రమూ—వీటివల్ల నయితేనేమి గ్రామములో కావలసినంత సందడి ప్రారంభము అయింది. పులివెంటపడ్డనక్కలగుంపులాగు ఊళ్లోనిపిల్లలంతా ఆ కలక్టరుగారి నౌకరుబృందముచుట్టూ భయపడుతూ భయ-పడుతూ తచ్చాటలు మొదలుపెట్టారు.

నూపరెంటు మామూలుప్రకారము, ఉద్యోగస్థుల-సప్లయిలెక్కలోవేసి, కోళ్లూ, కోడిగుడ్లూ, నెయ్యీ, పాలూ,

సప్తై ప్రారంభించాడు; కలక్టరుదొరగారి అవసరానికి పదిరెట్లు ఎక్కువగా అతిఉత్సాహముతో సరపరాయిలు చేస్తున్నాడు, అయినా దొరగారి టోటి ఒకనాడు ఉదయమే వచ్చి దొరగారి కుక్కకోసము నెయ్యి నాలుగువీశలు కావాలెనని అడిగాడు. ఏమి దురదృష్టమోగాని, ఇంతసహించిఉన్న సూపరెంటుగారు కుక్కకు నాలుగువీశెలునెయ్యి అనగానే మరి ఓర్చిఉండలేక పోయినాడు. దొరగారికుక్క దేశీకుక్కలకంటె ఎంతఅధికము నెయ్యి తిని జీర్ణముచేసుకోగలిగినా, కొవ్వుపదార్థ మేదైనా అంత అధికముగాతినిపించడము ఆరోగ్యానికి ఎంతమాత్రము మంచిదికాదని సూపరెంటుగారు టోటీకి సలహాఇచ్చిపంపారు; నెయ్యి ఇవ్వలేదు.

టోటీ వెళ్లి దొరగారితో దొంగకథ ఒకటి కల్పించి చెప్పాడు; కుక్కకోసము మాంసము ఎక్కడ దొరుకుతుందో కనుక్కుందామని సూపరెంటుగారివద్దకు వెళ్లాడట, కాని జాతికి తక్కువని తనను దూరముగా నిలబెట్టి అందరిముందరా అవమానపరిచి, గెంటించేశాడట. దొరగారినిగురించికూడా అమర్యాదామాటలు నిర్భయముగా అన్నాడట.

బ్రాహ్మణులలోఉండే జాతిఅభిమానము దొరలు సహించలేరు, అది ఒకటి ఉంటూఉండగా, దానిపైని తనటోటీని అవమానపరిచాడు. సూపరెంటుసాహసము చూచి కలక్టరుగారు మరి ఓర్చిఉండలేక తత్ క్షణం చప్రాసీని పిలిచి, సూపరెంటును తీసుకు రమ్మని ఆజ్ఞాపించారు.

సూపరెంటు భయంతో వణకనారంభించాడు, ఒంట్లో ప్రాణాలు లేవు. భగవంతుని స్మరిస్తూ దొరగారిగూడారము దగ్గిరికివచ్చి నిలుచున్నాడు. జఫ్‌జఫ్‌మని శబ్దముచేసుకొంటూ దొరగారు గుడారములోనుంచి బయటికివచ్చి దొరలఉచ్చారణతో అడిగారు—"ఎందువల్ల నీవు మాటోటీకి టోలివేసినావు?"

హరకుమార్ కంగారుపడుతూ, చేతులు జోడించి మనవిచేశాడు—"దొరగారి టోటీని నేను అవమానపరచగల నన్నమాట అసంభవము. కుక్కకోసము నాలుగువీశలు నెయ్యి కావాలని అడగగానే నెయ్యి అంతవిస్తారముగా తినిపిస్తే కుక్కకు జబ్బుచేస్తుందని మొదటచెప్పాను నిజమే, గాని తత్‌క్షణమే నెయ్యి జాగ్రత్తచేయమని నాలుగువైపులా మనుష్యులను పంపాను."

ఎక్కడెక్కడికి పంపాడో, ఎవరిని పంపాడో చెప్పమని కలక్టరుదొరగారు అడిగారు.

నోటికివచ్చినపేర్లు, ఏవోనాలుగు, చెప్పాడు హరకుమార్. ఆ ఆ ఊళ్లకు సూపరెంటుచెప్పిన మనుష్యులు వచ్చారేమో భోగట్టాచేసి రమ్మని, వడిగా నడిచే నలుగురు మనుష్యులను కలక్టరుగారు పంపారు; వాళ్లు తిరిగివచ్చేవరకు సూపరెంటుని తన గుడారములోనే కూర్చోబెట్టారు.

వెళ్లినమనుష్యులు మధ్యాహ్నము తిరిగివచ్చి నేతికోసము ఎక్కడికీ ఎవరూ వెళ్లలేదు అని చెప్పారు. టోటీ చేప్పిన

దంతా నిజము, సూపరెంటుచెప్పినదంతా అబద్ధము—దొర గారికి ఆవిషయములో ఏవిధమైన సందేహమూ లేదు; కోప ముతో మండిపడి పెద్దగర్జన చేసుకొంటూ టోటీని పిలిచి, ఆ పశువును చెవిపట్టుకొని గుర్రాన్ని పరుగెత్తించినట్టు గుడారము చుట్టూ పరుగెత్తించుకురమ్మని ఆజ్ఞాపించారు. టోటీ ఏమీ సమయం వృథావ్యయంచేయక తత్‌క్షణము సూపరెంటుచెవిని పట్టుకొని, ఆ గుడారముచుట్టూ. జమకూడిఉన్నజనసము ద్రముఎదుట, దొరగారి ఆజ్ఞానుసారము అతనిని పరుగెత్తిం చాడు.

ఈవార్త చూస్తూఉండగానే ఇంటింటికీ వ్యాపించేసింది, దేశమంతా అల్లకుపోయింది, ఇంటికివచ్చి హరకుమార్ భోజ నముమాట తలపెట్టనైనా లేదు, మూర్ఛపోయినవానిలాగు నేల కూలిపడ్డాడు.

జమీందారుగారి వ్యవహారాలలో హరకుమారుకు అనేక మంది శత్రువులు తయారయ్యేఉన్నారు. ఈ సందడి జరగగానే వాళ్ళందరికీ చాలా ఆనందముకలిగింది. కలకత్తా ప్రయాణ మవుతూఉన్న శశిభూషణ్‌కు ఈసంగతి తెలిసింది, అతని ఒంట్లోనిరక్తము కుతకుత మని ఉడకడము మొదలుపెట్టింది. కోపముచేత ఆరాత్రి శశిభూషణ్‌కు నిద్రపట్టలేదు.

మర్నాడు ప్రొద్దున్నే శశిభూషణ్ హరకుమార్ ఇంటికి వెళ్లాడు. హరకుమార్ అతనిచెయ్యి పట్టుకొని ఏడవడము ఆరంభించాడు. “పరువునష్టముదావా దొరమీఁ

వేదాము, నీతరఫున నేను ప్లీడరుగా ఉండి వాదిస్తాను," అని శశిభూషణ్ హారకుమారుతో అన్నాడు.

కలక్టరుగారిమీద తానే దావా తేవాలని వినగానే హారకుమార్ చాలాభయపడ్డాడు. కాని శశిభూషణ్ మాత్రము అతనిని వదిలాడుకాడు.

ఆలోచించి నిశ్చయించుకోడానికి వ్యవధి అడిగాడు హారకుమార్. కాని సూప రెంటుకు జరిగినఅవమానమువార్త అతి త్వరగా నాలుగువైపులా వ్యాపించిపోయింది. శత్రువులు బాగా ఆనందిస్తున్నారు. ఇదంతా చూచి మరి సహించి ఊరుకోలేక శశిభూషణుని ఆశ్రయించాడు హారకుమార్; అతనిదగ్గిరికి వచ్చి అన్నాడు, "నువ్వు అకారణముగా కలకత్తా వెళ్లిపోయే ప్రయత్నంలోఉన్నావని విన్నాను, అది ఎంతమాత్రము కూడదు. నీలాంటివాడు ఒకడు గ్రామములోఉంటే మాకు ఎంతో ధైర్యముగా ఉంటుంది. ఏమయినా సరే, నన్ను మాత్రము ఈ అవమానమునుండి రక్షించాలి."

4

ఇంతకాలమూ ఎవరికంటా పడకుండా ఏకాంతములో తనను తానే దాచుకొందామని ప్రయత్నముచేస్తూఉన్న శశిభూషణ్ ఇప్పుడు అకస్మాతుగా వచ్చి కోర్టులో హాజరయినాడు. కలక్టరు కంప్లేంటు విని శశిభూషణుని

ప్రైవేట్ రూమ్‌లోకి పిలిచి మర్యాదచేసి కూర్చోబెట్టి, "ఈ కేసు రాజీచేయిస్తే బాగుండదూ శశిబాబూ?" అని అన్నాడు.

శశిబాబు కనుబొమ్మలు చిట్లించి టేబిలుమీద నున్న 'లా' బుక్కువైపు తన తీక్ష్ణదృష్టిని ప్రసారించి అన్నాడు, "నాపార్టీకి అటువంటిసలహా నేను ఇవ్వలేను. అతనికి అవమానము నలుగురిఎదుటా జరిగింది, రహస్యముగా రాజీ చేసుకోమని నేను ఏలా సలహా ఇవ్వగలను?"

మందదృష్టిగల ఈ మితభాషిమనస్సును కదిలించడము అసాధ్యమైనపని అని కలక్టరుగారు కనిపెట్టి అన్నారు, "ఆల్‌రైట్ బాబూ, మీరు వెళ్ళండి ; మీరు ఎంతదూరము వెళ్లుతారో నేనూ చూస్తాను."

కేసు వాయిదావేసి కలక్టరు ఆచుట్టుపక్క గ్రామాలకు కమాను వెళ్లిపోయినాడు. ఇవతల హారకుమార్‌ని అవమానపరిచిన జాయంటుమ్యాజిస్ట్రేటు జమీందారువేర ఉత్తరము వ్రాశాడు, సూపరెంటు తన మనుష్యులను అవమానపరిచి నానావిధాలుగా వాళ్లకు ఇబ్బంది కలుగజేస్తున్నాడు గనుక అతనికి తగినశిక్ష చేయవలసింది అని.

జమీందారు గాబరాపడి హారకుమారుని తత్క్షణమే రమ్మని కబురుపంపాడు. మొదటినుంచీ జరిగినదంతా కాస్తపిస

నైనా దాచేకుండా పూర్తిగా హరకుమార్ చెప్పాడు. జమీందారు చాలా చీకాకుపడి అన్నాడు—"దొరగారిటోకి వచ్చి నాలుగువీశలు నెయ్యి అడిగినప్పుడు ఆ అధిక ప్రసంగమంతా చెయ్యక నెయ్యి తెప్పించి ఇవ్వలేకపోయినావూ? నీ అబ్బగారి సొమ్ము ఖర్చుఅయిపోయినట్టుగా నీకెందుకు ఆ చర్చఅంతా?"

ఆమాట నిజమే, తన అబ్బగారిసొమ్ముకు ఏమీ నష్టము రాదు, ఆ మాట సూపరెంటు ఒప్పుకోవలసివచ్చింది; తన రోజులు మంచివికాకపోవడమువల్లనే ఇటువంటి దుర్బుద్ధి పుట్టింది అని ఒప్పుకొన్నాడు.

"పైగా తిరిగి దొరగారిమీద దావాపెట్టమని నీకు సలహా ఇచ్చినది ఎవరు?" అని జమీందారు అడిగాడు.

"దావాచేసే ఉద్దేశము నాకు లేనేలేదు మహాప్రభూ! మన గ్రామములోఉన్న 'శశి', తనకు ఏమీ కేసులులేకుండా ఉన్నవని గాబోలు, నన్ను మహా అవస్థపెట్టి—నేను ఇంకా పూర్తిగాఒప్పుకొనే లేదు—వెళ్లి దావావేసి నా కొంపముంచడానికి సిద్ధమైనాడు, మహారాజా!" అని అన్నాడు సూపరెంటు.

అది వినగానే జమీందారుగారికి శశిభూషణ్ మీద చాలాకోపము వచ్చింది. అతను ఎందుకూపనికిరానికొత్తవకీలు, ఏదోఒక నెపంమీద కొంచెము సందడి చేస్తే నలుగురికీ తన

సంగతి తెలుస్తుంది, అనే ఉద్దేశముతో ఇది చేశాడు అని బోధ పరుచుకొన్నాడు; కేసు రద్దుచేయించుకొని తక్షణమే వెళ్ళి ఇద్దరుకలక్టర్లనూ ఓదార్చిలక్ష్మిని హరకుమార్‌ని ఆజ్ఞాపించాడు.

సూపరెంటు పళ్ళూకాయలూ కొని, మంచి పిండివంటలు చేయించి, జాయంటుమ్యాజిస్ట్రేటువారి బసకు వెళ్లాడు. దొరగారిపైని దావాతీసుకురావడము కేవలము తన స్వభావానికి విరుద్ధమునీ, ఎందుకూపనికిరాని ఆఊరి 'శశి' అనేకుర్రవకీలు, ఒకవిధంగా, తనకుతెలియకుండానే అన్నట్టుగా, ఇట్టి అమర్యాదాపని చేశాడనీ, దొరగారితో సూపరెంటు మనవి చేశాడు. దొరగారికి చాలా సంతోషము కలిగింది, శశి భూషణుమీద కోపమువచ్చింది. ఏదోఒక క్షణాన్న కోపపరవశుడనయి "దండ విడానము" చేసినందుకు చాలా "దుఃఖితుడను" అనిదొరగారు సెలవుఇచ్చారు—దొరగారు ఇప్పుడే *వర్నాక్యులర్ టెస్టు పాసుఅయినారు, అందరితోనూ గ్రాంధికభాషతోనే మాట్లాడుతుంటారు.

సూపరెంటు అన్నాడు—"తల్లిదండ్రులు కోపమువచ్చి పిల్లలను అప్పుడప్పుడు శిక్షిస్తూంటారు, ఒకొక్కప్పుడు దగ్గిరికి పిలిచి ఒళ్లో కూర్చోపెట్టుకొని సదుపదేశము చేస్తూంటూరు. పిల్లలుగాని తల్లిదండ్రులుగాని దానివిషయమయి దుఃఖించవవసరము లేదు."

* హిందూదేశ భాషలపరీక్ష.

హారకుమార్, తరువాత, దొరగారికెవరికన్నందరినీ సరి
యైనరీతిని సంతోషపెట్టి పెద్దకలక్టరుగారివద్దకు బయలుదేరి
వెళ్లాడు. కలక్టరుగారు శశిభూషణ్ చేసిన సాహసకృత్యాన్ని
గురించి విని, "సూపరెంటు అంత మంచిమనిషి కదా, ముందుగా
నాతో చెప్పకుండా దావా కెందుకు పరిగెత్తాడని అను
కొన్నాను; ఇప్పుడు అంతా బోధపడ్డది," అని అన్నారు.

శశి కాంగ్రెసులో చేరినమనిషా అని చివరకు కలక్టరు
అడిగాడు; అతి ఉల్లాసముతో, "ఆహా", అన్నాడు సూప
రెంటు.

దొరగారు తొరలబుద్ధి విని యోగించి తత్ క్షణము పోల్చు
కొన్నాడు, ఇదంతా కాంగ్రెసు చేస్తూఉన్న పని అని. ఏదో
ఒక గొడవ చేసి, 'అమృత బజారు పత్రిక'లో వ్యాసము వ్రాసి
గవర్నమెంటువారితో పోట్లాడుతూఉండాలని చిన్న పిల్ల-
కాయలనూ, యువకులనూ ఊళ్లవెంబడి పంపుతూఉంటారు
కాంగ్రెసువాళ్లు, ఎద్దైనా అవకాశము దొరుకుతుందేమో అని.
ఈ చిన్నచిన్న కాంగ్రెసుపురుగులనన్నిటిని కాలికిందవేసి నలిపి
వేయడానికి తగిన అధికారము తనకుఇవ్వనందుకు కలక్టరు
గవర్నమెంటువారిని దుర్బలులని తనమనస్సులో తాను చాలా
నిందించాడు. కాని ఈకాంగ్రెసువాలా శశిభూషణుని
మాత్రము మరిచిపోలేదు.

ప్రపంచములో పెద్దపెద్దవ్యవహారాలు పెద్దతరహాగా జరుగుతున్నంతసేపూ చిన్న చిన్న వ్యవహారాలు నిద్రపోతూ ఉండవు, తమచిన్నచిన్న వేళ్లను భూమిలోనికి వ్యాపింపజేసి పృథ్విపై తమకుగలహక్కును దృఢపరుచుకుంటూ ఉంటవి.

ఈ గొడవ జరుగుతూఉన్నన్నాళ్లూ శశిభూషణ్ పెద్ద పెద్ద లాపుస్తకాలు తీసి చదివి లాపాయింట్లు కనిపెడుతూ కూర్చుండేవాడు. కోర్టులో నిలబడి మాట్లాడుతున్నట్టు తనలో తాను ఊహించుకొని తాను అనవలసినమాటలను మరింతవాడి చేస్తూఉండేవాడు, సాక్షులను, మనసులో, క్రాసుచేస్తూఉండే, వాడు. పబ్లిక్ కోర్టూ, జన సమూహమూ, అక్కడజేరగబోయే యుద్ధమూ, కళ్ళకుకట్టినట్టుగా కనబడి ఉండుండి అతనికి ఒంట్లో వణుకుపుట్టేది, ఒంటినిండా చమటపట్టేది. ఇది జేరుగుతూ ఉండగా అతని చిన్నశిష్యురాలు తన చింకికథలపుస్తకమూ, సిరామార్కులతోనిండిఉన్న నోటుబుక్కూ పట్టుకొని రావడము మాత్రము మానలేదు, సరిగా తనచదువువేళకు వచ్చికూర్చుం- డేది. ఒకొకనాడు తోటలోనుంచి పువ్వులు తెచ్చేది, ఒకొక నాడు పళ్లు తెచ్చేది. ఒకనాడు తల్లిదగ్గిరనుంచి అపకాయి- ముక్క తీసుకొనివచ్చేది, మరిఒకనాడు కొబ్బరికోరూ పంచ దారా తెచ్చుకొనేది, ఇంకొకప్పుడు వాసనవస్తువులు వేసిన తాంబూలము నములుకొంటూ వచ్చేది, సరిగా ఆవేళకు రోజూ, తప్పకుండా, వచ్చేది.

మొట్టమొదట కొన్నిరోజులవరకు శశిభూషణ్ ఏదో పెద్ద నల్లని బైండుబుక్కు తీసి పరధ్యానముగా పేజీలు తిరగ వేస్తూండేవాడు, చదువులో మునిగి ఉన్నట్టుగాకూడా కనబడ లేదు. ఇంతకుముందు శశిభూషణ్ తానుచదివే పెద్దపెద్ద పుస్తకాలలోనుంచి కొంతకాకపోతే కొంతయినా గిరిబాలకు బోధపరిచే ప్రయత్నము చేసేవాడు. ఈనల్లని పెద్దపుస్తకాలలో గిరిబాలకు బోధపడేవి ఒకటిరెండు సంగతులయినా లేవా? పోనీ లేకపోతే లేకపోయినవి! అయితేమాత్రము ఆపుస్తకాలు అంత గొప్పఅయిపోయినవా? గిరిబాల అంత చిన్నఅయి పోయిందా?

మొదట గురువుగారిమనస్సును ఆకర్షించుదామని ప్రయత్నముచేసింది గిరిబాల; జడా, తలా, ఊచుకొంటూ, ఒళ్లూఆడిస్తూ, గట్టిగా చదవడముప్రారంభించింది. చూచింది దానివల్ల ఏమీలాభము లేకపోయింది. ఆ నల్లని పెద్దపుస్తకాల మీద బాగా కోపమువచ్చింది గిరబాలకు. వాటిని ఒకక్రూరుణ్ణీ, దుర్మార్గుణ్ణీ చూచినట్టుగా చూడడము ఆరంభించింది. ఆ బోధ పడని పుస్తకాలలోని ప్రతిపేజీ ఒకదుష్టుని ముఖమయి, గిరిబాల కేవలము బాలికకదా అని తెలుసుకొని, ఆమెవైపు నిరసనగా చూస్తూన్నట్టు కనబడేవి. ఎవరైనా ఆపుస్తకాలను దొంగిలించు కొనిపోతే గిరిబాల వంటఇంటిలోనుంచి తనతల్లి చేసిన తియ్యని వస్తువులన్నీ, తల్లికితెలియకుండా తెచ్చి, ఆదొంగకు బహుమతిగా

ఇచ్చిఉండును. ఆపుస్తకాలు నాశనమయిపోవాలని దేవుడికి ఆమె చేసిన ఆసందర్భమైనప్రార్థనలూ, అసంభవమయినప్రార్థనలూ దేవుడే వినలేదు. కనుక మనుష్యులతో వాటినిగురించి వివరించి చెప్పడము అనవసరము.

చివరకు శిష్యురాలు చాలా దుఃఖపడి, గురువుగారిదగ్గిరికి కథామాల పట్టుకొని రావడము మానుకొన్నది. రెండుమూడు రోజులు ఈవిధంగా జరిగింది. ఆరెండురోజులఎడబాటుఫల మేమిటో చూదామని ఏదోమిషమీద గిరిబాల ఆ ఇనపగజా లకు ఎదురుగానున్న రోడ్డుమీదకు వచ్చి అటువైపు చూచింది. ఆ నల్లపుస్తకాలు ఒకమూల పారేసి శశిభూషణ్ ఆగజాలవైపు చూస్తూ ఇంగ్లీషులో ఏదో లెక్చరు ఇస్తున్నాడు. ఇనపకమ్మ మీద ప్రయోగించి చూచి తనమాటలవల్ల జడ్జీగారిమనస్సు కరుగుతుందో లేదో అని పరీక్షచేస్తూన్నాడేమో బహుశా. పూర్వకాలమందు వాగ్ధాటిగల డిమాస్థనీస్, సిసిరో, బర్కు, షెరిడన్ మొదలైనవారందరూ వాళ్ళవాగ్బలమువల్ల గొప్ప గొప్ప కార్యాలు సాధించగలిగారు; వాక్శరావర్షమును కురిపించి అన్యాయాన్ని ముక్కలుముక్కలు చేశారు, గర్వాన్ని మట్టిలోకలిపారు, దుర్మార్గప్రవర్తనలకు నిలవనీడ లేకుండా చేశారు. వర్తకులైన మనపరిపాలకుల రోజులలో మాత్రము అటువంటిది అసాధ్య మెందుకు కాచలేదు అని శశిభూషణు డనేరి.

ప్రభుత్వ మద గర్వితులూ, పొగరుబోతులూ అయిన ఇంగ్లీషువాళ్ళకు ప్రపంచములో ఉండే ప్రజేలంకరిముందరా సిగ్గు తెప్పించేటట్టూ, వాళ్లలో అనుతాపము పుట్టించేటట్టూ, మార్గంఒకటి ఆ "తిల్‌నుచి" గ్రామములో, పడిపోతూఉన్న ఆ చిన్న ఇంట్లో నిలబడి, శశిబాబు నిర్మిస్తున్నాడు. అతని లెక్చర్లు విని అంతరిక్షాన్నఉన్న దేవతలు నవ్వుతున్నారో లేక కళ్ళ నీళ్ళు పెట్టుకొంటున్నారో చెప్పలేము.

గిరిబాలమీద మాత్రము ఆనాడు అతనికళ్లు పడలేదు. ఆమెఒళ్లో ఆవాళ నేరేడిపళ్లు లేవు. వెనక, ఒకనాడు పళ్ళతో సహా శశిభూషణుకు దొరికిపోయినప్పటినుంచి పళ్ళవిషయములో చాలా జాగ్రత్తగా ఉండేది గిరిబాల. శశిభూషణ్ ఎప్పుడైనా పరధ్యానముగా "గిరీ, ఈవాళ నేరేడిపళ్లు లేవూ?" అని అడిగితే, శశి, వేళాకోళము చేయువలెననే ఉద్దేశముతో అలా అడుగుతున్నాడని అనుకొని, గిరిబాల "ఫో!" అని కసిరి పారిపోయేది. నేరేడిగింజలు దగ్గిరలేకపోవడమువల్ల గిరిబాల ఈవాళ మరిఒక యెత్తు వేయువలసివచ్చించి; చేటాలున దూరానికి చూస్తూగట్టిగా "వెళ్లకు వెళ్ళకు, స్వర్ణ-అక్కా, ఇదిగో నేనుకూడావస్తున్నాను," అని కేకలు వేసింది.

ఈపుస్తకము చదివేవాళ్లలో మొగవాళ్లు, దూరాన 'స్వర్ణలత' అని ఎవరోపిల్లఒకతె ఉన్నది గాబోలు, ఆమెతో ఆటలన్నది అని అనుకొంటారు, గాని ఆడవాళ్లుమాత్రము సులభముగా పోల్చుకొంటారు, ఈమె గురిచూస్తూన్నది

దూరానఉన్న ఎవరో కాదు, దగ్గిరనున్నవారే ఎవరో అని. పాపము, ఆ అంధపురుషునిపై ఆపిల్ల వేసినబాణము గురికి తగలలేదు. శశిభూషణ్ ఆ పిల్లమాటలు వినకపోలేదు, గాని ఆమె నిజముగా ఆనాడు ఆటకు సరదాపడుతున్నది అనుకొన్నాడు, ఆటనుండి ఆమెమనస్సును మరలించి చదువువైపు తిప్పేశక్తి అప్పుడు అతనిలో లేదు. ఆనాడు అతడుకూడా ఎవోకొన్నిహృదయాలను గురిచేసి మంచి తీక్ష్ణమైనఅస్త్రాలు తయారుచేస్తున్నాడు, కాని ఆ చేతకాని చిన్నపిల్లచేతిలోని అస్త్రాలవలె, నేర్పరిఅయిన అతనిచేతిలోని అస్త్రాలుకూడా గురితప్పినవయిపోయినవి——ఈసంగతి చదువరులకు ఇప్పటికి బోధపడేఉంటుంది.

నేరేడిగింజలలో ఒకగుణము ఉన్నది: ఒకటిఒకటిగా చాలా విసరవచ్చును, నాలుగుతప్పిపోయినా అయిదవది తగలవచ్చును, గాని "స్వర్ణ" ఉత్తకల్పితమే అయినా, "ఇదిగో వస్తున్నాను," అని ఆశపెట్టినతరువాత వెళ్లడము ఆట్టే ఆలస్యముచేయడానికి గిరిబాలకు వీలు లేకపోయింది. చాలాసేపటివరకువెళ్ళకుండా ఉంటే తప్పకుండా స్వర్ణయొక్క అస్తిత్వాన్ని గురించి అందరికి సందేహం కలుగుతుంది. అందుచేత తాను వేసిన ఎత్తు నిష్ఫలముకాగానే గిరిబాల అక్కడనుంచి వెళ్లిపోవలసివచ్చింది. కాని స్వర్ణఅనేపేరుగల స్నేహితురాలు దూరాన ఉన్నయెడల ఆమెను కలుసుకొందామనే అభిలాషతోపరుగెత్తి ఉండును; ఆ ఉత్సాహమూ, ఆనందమూ, గిరినడకలో కనబడ

లేను; తనవెనుకను ఎవరైనా వస్తున్నారేమో తెలుసుకొందా మని ప్రయత్నిస్తున్నట్లు కనబడ్డది. రావడము లేదని తెలుస్తూ ఉన్నది, ఆశ బాగా క్షీణిస్తున్నది; అయినా ఏ రవంత ఆశా మిగిలి ఉన్నదో ఆ రవంతతో ధైర్యముగా వెనకకు తిరిగి చూచింది. ఎవరూ రావడము లేదు. క్షీణించిన ఆశయొక్క ఆఖరు ఛాయతోపాటు తన చేతిలోఉన్న కథలపుస్తకము ముక్కలుముక్కలుచేసి దారిలో విరజల్లేసింది. శశిభూషణ్ తనకు చెప్పిన శాస్త్రవిద్యా అతనికి తిరిగి ఇచ్చివేయగలిగినట్ట యితే, శబ్దముచేసుకొంటూ వెళ్లి తినేసిన నేరేడిపళ్లగింజలవలె, శశిభూషణుగడపఎదుట, కుప్పపెట్టి వచ్చేసిఉండును.

తిరిగి శశిభూషణ్ కనబడేలోపుగా అతనుచెప్పిన చేదు వంతా పూర్తిగా మరిచిపోవలెనని దీక్షపట్టింది. నాకు అతడు కనబడి ఎదైనా ప్రశ్నవేస్తే 'దేనికీ నేను జబాబు చెప్ప లేను—దే-నికీ—ఒక్-క్క దానికైనా—చెప్పలేను. అప్పుడు అవుతుంది అతనికి తగినశిక్ష,' అని గిరిబాల తనలోతాను అను కొన్నది.

గిరిబాల కళ్లురెండూ నీళ్ళతో నిండిపోయినవి. ఆమె చేదువు మరిచిపోవడమువల్ల శశిభూషణులోపుట్టే తీవ్రమైన అనుతాపాన్నిగురించి ఊహించుకొని, దుఃఖముతో నిండిఉన్న ఆమెహృదయాన్ని కొంచం శాంతిపరచుకొన్నది, కేవలము శశిభూషణుని దోషమువల్లనే విద్యమరిచిపోయిన గిరిబాలను

ఆమె ఊహాసహాయమువల్ల భవిష్యత్తులో చూచింది; ఆ అభాగ్యురాలిని చూడడమువల్ల తనయెడల తనకే కొంచెము దయకలిగింది. ఆకాశాన మేఘాలు, వర్షకాలములో కూడి నట్టుగా, కూడుతున్నవి రోడ్డుపక్కను ఒకచెట్టుకింద నిలబడి ఉన్నది గిరిబాల. ఆమె మనస్సు అభిమానముతో నిండిఉన్నది; ఏడుపుతో కడుపు ఉబ్బిపోతున్నది. ప్రతిరోజూ ఈలాగు అకారణముగా ఎంతోమంది బాలికలు ఏడుస్తుంటారు, ఇందులో అంత ముఖ్యముగా జ్ఞాపకముడుంచుకోదగినది ఏమున్నది?

6

శశిభూషణ్ చేస్తూఉండే చర్చా, అలవాటు పడడానికి చేస్తూఉన్న ఊహావాదనా, ఎందువల్ల నిష్ప్రయోజన మయి పోయినవో చదువరులకు తెలియని విషయముకాదు. జాయింటు మ్యాజిస్ట్రేటుగారిమీద దావా అకస్మాతుగా రాజీ అయి పోయింది. హరకుమార్‌కు ఆనరరీ బెంచి-మ్యాజిస్ట్రేటు ఉద్యోగం అయింది. ఒక మురికి అంగరకా వేసుకొని, జిడ్డుతల పాగా పెట్టుకొని, అతడు తరుచుగా జిల్లారాజధానికి వెళ్లి దొరలకందరికీ సలాములు అర్పించి వస్తూఉండేవాడు.

శశిభూషణ్ నల్లని దుక్కపుస్తకాలపై గిరిబాలపెట్టిన శాపము ఇన్నాళ్ళకు సఫలమయింది. పుస్తకాలు ఒక చీకటి గదికి చేరుకొన్నవి, ఎవరికీ అక్కరలేని పనికిమాలినవస్తువుల వలె మూలకూడిఉన్న చెత్తలో బసచేసుకొని కూర్చున్నవి.

గిరిబాల నేడు వాటికిజరిగిన అవమానం చూచి ఆనందించి ఉండును, కాని గిరిబాల నేడేది?

లా-పుస్తకాలుమూసిననాడే గిరిబాల తన దగ్గిరికి వస్తూ ఉండలేదని శశిభూషణ్ అకస్మాత్తుగా కనిపెట్టాడు. తరువాత కొంచెముకొంచెముగా వెనకరోజుల కథఅంతా జ్ఞాపకంతెచ్చుకొన్నాడు: ఒకనాటి ఉదయము తొలకరివాన చినుకులతడితో నిండిఉన్న పొగడపువ్వులు చెంగునకట్టి తీసుకువచ్చింది. ఆమెను చూచికూడా అతడు పుస్తకముమీదనుంచి ముఖము ఎత్తలేదు. దానివల్ల గిరిబాల ఉత్సాహము సగము తగ్గిపోయింది. ఆ చెంగునే గుచ్చి గిరిబాలసూదీదారమూ తీసుకువచ్చింది. అది తీసి ఒకొక్కపువ్వు ఎక్కిస్తూ మాలగుచ్చడము మొదలు పెట్టింది, నెమ్మదిగా గుచ్చుతూకూర్చున్నది. మాల పూర్తి అయే సరికి చాలా ఆలస్యము అయింది. గిరిబాలఇంటికి వెళ్లిపోయే వేళ అయింది, గాని శశిభూషణ్ చదువు ఇంకా ముగియలేదు. మాలను మంచముమీద, ఒకపక్కనుఉంచి, దుఃఖంతో గిరిబాల ఇంటికి వెళ్లిపోయింది, ఆమె అభిమానము అప్పటినుండి రోజుకురోజూ ఏలాగు అధికముఅయిందో శశిభూషణ్‌కు జ్ఞాపకము వచ్చింది. తరువాత ఆమె అతని గదిలోకిరావడము మాని, గదికిఎదురుగా, బయటను, రోడ్డుమీద, అప్పుడప్పుడు కనబడివెళ్లిపోతూఉండేది. మరికొన్ని రోజు లయినతరువాత గది బయటకూడా కనబడడముమానేసింది. ఆలా మానేసి ఇప్పటి కప్పుడే కొన్నిరోజులయింది—ఇది అంతా ఇప్పుడు జ్ఞాపకము

తెచ్చుకొన్నాడు శశిభూషణ్. కాని గిరిబాల అభిమానము ఇన్నాళ్లు ఉండదే! నిష్ఫలప్రయత్నమువల్ల మతిపోయినవాని వలె పెద్దనిట్టూర్పువిడిచి శశిభూషణ్ గోడకు చేరబడిపోయి నాడు. ఆ చిన్నశిష్యురాలు లేకపోవడముచేత అతనికి చేదువు మీద అరుచికలిగింది—పుస్తకము తీసి రెండుపేజీలు చేసివి ఒకమూలపారవేశాడు, వ్రాస్తూ ఉండిఉండి ఉలికిపడుతున్నాడు, ఎవరికోసమో ఎదురు చూస్తూన్నట్టుగా, రోడ్డువైపు ముఖం తిప్పుతున్నాడు. వ్రాత జేరగకుండా ఉన్నది.

గిరిబాలకు జబ్బుచేసిఉంటుందని శశిభూషణుకు అనుమానముకలిగింది; భోగట్టాచేయగా అటువంటి అనుమానానికి కారణము లేదని బోధపడ్డది. గిరిబాల ఇక మరి బసూటికి రాదట; ఆమెకు పెళ్లినిశ్చయము చేశారట.

కథామాలకాగితముముక్కలు బురదరోడ్డుమీద విరజల్లిననాటి మర్నాడు ఉదయమే గిరిబాల చీరకొంగున ఏదో-ఫలహారము కట్టుకొని గబగబ ఇంట్లోనుంచి బయటికి వస్తున్నది.చాలా ఉక్కగా ఉండడముచేత హరకుమార్ అతికష్టము మీద రాత్రిగడిపి, తెల్లవారుజామున అరుగుమీద కూర్చొని చొక్కా తీసేసి, గుడుగుడు పీలుస్తున్నాడు. గిరిని చూచి "ఎక్కడికే?" అన్నాడు.

" 'శశి-దా' ఇంటికి," అన్నది గిరి. "శశి-దా ఇంటికి వెళ్ళ-కూడదు. ఇంట్లోకి ఫో!" అన్నాడు తండ్రి. అత్తవారిఇంటికి

త్వరలో వెళ్ళబోతుంది. అంతవయస్సువచ్చినా సిగ్గులేనందుకు గిరిబాలకు బాగా చీవాట్లు పెట్టాడు హరకుమార్. ఆనాటి నుండి గిరిబాలను పైకి రానియ్యలేదు. అందుచేత ఆమె అభిమానానికి భంగముకలిగే అవకాశము మరి చిక్కలేదు. తాంద్రముక్కలూ, మిఠాయిసాలా, నిమ్మకాయఊరగాయా, కొట్టుగదిలో వాటివాటిస్థలాలలోకి తిరిగి వెళ్లిపోయినవి. వర్షాలు ప్రారంభించినవి. పొగడపువ్వులు రాలుతున్నవి; జామిపళ్ళతో చెట్లు నిండిఉన్నవి; ప్రతిరోజూ ఉదయము లేచి చూచేసరికి పక్షులుకొట్టేసిన నేరేడిపళ్లు చెట్లుకిందను కుప్పలు కుప్పలుగా పడిఉండేవి. ఆహా, ఆ చిరిగిపోయిన కథామాలయినా లేదు కదా ఇప్పుడు!

## 7

గిరిబాలపెళ్లికని సనాయి వాగుతున్నది. ఆనాడే ఎట్టి ఆహ్వానమూ లేని శశిభూషణుడు పడవచేసుకొని కలకత్తా వెళ్లుతున్నాడు.

దావా రాజీఅయిననాటినుండి హరకుమార్ శశిభూషణుని విషచక్షువులతో చూస్తున్నాడు. శశిభూషణ్ అతనిని చూచి తప్పకుండా అసహ్యపడుతుంటాడు అని అతనినమ్మకము; ఈ నమ్మకమే అతనిద్వేషానికి కారణము; శశిభూషణుని ముఖములోనూ, కళ్ళలోనూ, అతను చేసే ప్రతిపనిలోనూ తాను ఊహిస్తూఉన్న అసహ్యానికి ప్రమాణముగా హరకుమార్‌కు ఏదో కనబడేది. గ్రామములో ఉండేవాళ్ళందరూ

తనకు జేరిగిన అవమానాన్ని గురించి మరిచిపోతున్నారు గాని ఈ శశిభూషణ్ దానిని ఎవరూ మరవకుండా ఉండేటట్టు ప్రయత్నముచేస్తున్నాడని హారకుమార్ నమ్మేవాడు. అందుచేత శశిని రెండుకళ్ళతో చూడలేకపోయేవాడు. ఎప్పుడైనా ముఖాముఖి అయినట్లైతే హారకుమారుకు లోపున సిగ్గూ, సంకోచమూ పుట్టేది, వాటితోపాటు కావలసినంత ద్వేషము కలిగేది. శశిని ఊరు విడిచేటట్టు చేయాలని హారకుమార్ దీక్ష పట్టాడు.

శశిభూషణ్ లాంటివానిని ఊళ్లోనుంచి వెళ్ళగొట్టడము కష్టమయిన పనికాదు. సూపరెంటుగారి కోరిక త్వరలోనే సఫలముఅయింది. ఒకనాడు ఉదయమే తనపుస్తకాలమూటా, మూడునాలుగు టిన్ పెట్టెలూ పట్టుకొని పడవ ఎక్కాడు శశి. ఆ పల్లెలో తనకు ఆనందం ఇస్తూండే సంబంధము ఒక్కటే. అదీ ఈవాళ బాజాబజంత్రీలతోకూడా తెగిపోతున్నది, ఆ కోమల బంధము తన హృదయాన్ని ఎంతగట్టిగా కట్టిఉంచిందో ఇంతకు పూర్వము శశికి పూర్తిగా తెలియలేదు. ఈనాడు పడ వెక్కివెళ్లిపోతున్నాడు,ఊరిలోబయటనుండే చెట్లశిఖరాలుఅస్పష్టమవుతున్నవి, పెళ్లిబాజాలు అంతకంతకు క్షీణమయిపోతున్నవి. శశి కళ్లవెంట నీళ్ళధారలు కారడము మొదలుపెట్టినవి, కడుపు ఉబ్బిపోతున్నది, వెక్కివెక్కి ఏడుస్తున్నాడు, ఊపిరి తిరగకుండాఉన్నది, ముఖముమీాద రెండువైపులాఉన్న రక్త శిరాలలో రక్తము ధగ్ ధగ్ మని కొడుతున్నది. ప్రపంచములో

ఉండే వన్నీ 'ఛాయానిర్మితములు' అని అనిపించింది—అంతా మాయ, మరీచికము.

ఎదురుగాలి అతివడిగా వీస్తున్నది. అందుచేత ప్రవాహము అనుకూలముగా ఉన్నా పడవ మెల్లిగా నడుస్తున్నది. అప్పుడు దారిలో ఒకచిన్నకథ జరిగింది. దానివల్ల అతని యాత్రకు భంగము కలిగింది.

'స్టేషన్‌ఘాట్' దగ్గిరనుంచి స్టీమర్ దారిఒకటి కొత్తగా వేర్పరచబడ్డది. స్టీమరొకటి రెండుచక్రాలూ వడిగా తిప్పుకొంటూ, పెద్దపెద్ద కెరటాలు పుట్టిస్తూ, ప్రవాహానికి ఎదురుగా వస్తూఉన్నది. స్టీమరులో జనము విస్తారము లేరు. దానికి నాయకుడు ఒకదొర; అతనికి అట్టే వయస్సు ఉండదు, శశిభూషణుని గ్రామములోని వాళ్లుకూడా కొంతమంది ఆ స్టీమర్‌లో ఉన్నారు.

కొంతదూరమునుంచి ఆ స్టీమర్‌తో కలిసి పంతానికి ఎవరిదో నావఒకటి పరుగెత్తుతున్నది. ఇది మధ్యమధ్య స్టీమర్‌ను కలుసుకొంటున్నది, తిరిగి వెనకపడడంవల్ల నావవాళ్ళ ఆశతగ్గిపోతున్నది. నావకు మొదటి తెరచాపమీాద రెండోది ఎత్తారు, రెండోదానిమీాద మరిఒకటి చిన్నది ఎత్తారు. గాలివడిచేత నావకొయ్య బాగా ముందుకు వాలిఉన్నది. విరుగుతూఉన్న కెరటాలు నావకు రెండుపక్కలా శబ్దము చేస్తూ మత్తెక్కినట్లు నాట్యముచేస్తున్నవి. కళ్లెము తెంచుకొని పరుగెత్తుతున్న గుర్రములాగు నావ పరుగెత్తుతున్నది. ఒకచోట స్టీమర్ దారి కొం

చెము చుట్టుతిరిగి ఉండడమువల్ల నావ దగ్గిరదారిని వెళ్ళి స్టీమర్ కంటె ముందుఅయిపోయింది. స్టీమర్ మేనేజరు, దొర గారు, తొందరతొందరగా ప్రక్క*రేలింగుమీదనుంచి వంగి నావ తనస్టీమర్‌తో పోటీగా పరుగెత్తుతుండడము చూచాడు. నావ నిండు వేగముతో వెళుతున్నది, స్టీమరుకు రెండుమూడు బారలు ముందుగా ఉన్నది. దొరగారు తుపాకి తీసి ఆ పొంగి ఉన్న తెరచాపను గురిచూచి గుండు పేల్చాడు. చాప చిగిరి పోయింది. నావ మునిగిపోయింది. నదినంకలో స్టీమరు అదృశ్యమయిపోయింది.

మేనేజరు ఎందుకు ఈలాగు చేశాడో చెప్పడము కష్టము. హిందూదేశస్థులము కావడముచేత దొరగారి మనో భావము పోల్చుకోలేము. దేశనావ తనతో పోటీగా పరు గెత్తడము చూచి సహించలేకపోయినాడా, లేక అంతపెద్ద తెల్లనివస్తు వేదైనా కనబడినప్పుడు దానిని రెప్పపాటులో గుండు పేల్చి చించివేయడము దౌర్జన్యప్రియులైన వాళ్ళకు, సరదాపుట్టిస్తుందా? పొగరెక్కిన ఆ నావ వేసుకొన్న దుస్తు లలో ఒకటిరెండు చిన్నకన్నాలుచేసి ఆనాకాలిలకు సమాప్తి పొందించడములో ఒక పైశాచిక హాస్యరసము ఉన్నదా? సరీగా చెప్పడము కష్టము. కాని ఇదిమాత్రము నిశ్చయము —ఈ రసికతకుగాను తానుఎటువంటి శిక్షకూ అర్హుడు కాడని దొరగారిమనస్సులో గట్టినమ్మకము ఉన్నది. పైగా, దొరగారి

*మనుష్యులు పడిపోకుండా పక్కను పెట్టిన ఇనప కమ్ములు.

అభిప్రాయము ఏమనగా నావ నష్టముయినవాడుగాన్నితో నావ మునిగి చచ్చినవాళ్లుగాని మనుష్యులలో లెక్క కారు అని.

దొరగారు తుపాకి తీసి పేల్చారు, పడవ మునిగిపోతున్నది, ఇదంతా జరుగుతూఉన్న స్థలానికి సమీపములోనే శశిభూషణునినావ ఉన్నది. ఇదిఅంతా శశిభూషణ్ సాక్షాత్తు చూస్తున్నాడు. త్వరగ్వాత్వరగా తననావను ఆ దగ్గిరికి తీసుకువెళ్ళి, నావగడిపేవాళ్లనూ, ఆకళాసులనూ తన నావలోనికి ఎక్కించాడు. నావమునిగిపోతున్నప్పుడు వంటదగ్గిర కూర్చొని ఒకడు మసాలానూరుతుండెను; ఆమనిషిమాత్రము దొరక లేదు. వరదలవల్ల నది అతిజోరుగా ప్రవహిస్తున్నది.

శశిభూషణునిహృదయములోని రక్తము కుతకుతమని ఉడకడము ఆరంభించింది. 'లా' చాలా మందగతి గలది, అదిఒక చిక్కుచిక్కులుగాఉన్న ఇనపయంత్రము మోస్తరు. అపరాధాన్ని పరిశీలించి, రుజువూ సాక్ష్యాన్ని తూచి, కేవలము నిర్వికారభావముతో పనిచేస్తుంది 'లా'; దానిలో మానసహృదయముయొక్క ఉత్తాపము ఉండదు. కాని భోజనాన్నీ ఆకలినీ వేరుచేయడమూ, ఇచ్ఛనూ భోగాన్నీ వేరుచేసి చూడడమూ, కోపాన్నీ శిక్షనూ వేరుచేసి చూడడమూ కేవలము అస్వాభావికము అని శశిభూషణుని మతము. అనేక అపరాధాలు ప్రపంచములో జరుగుతున్నవి. అవి మనకంటపడగానే మన

చెయ్యి లేచి తగిన శాస్తి విధించకపోయినట్టయినా మనలో నున్న విధాత మనను దగ్ధము చేస్తుంటాడు. అటువంటి సమయాలలో కోర్టుమాట తలచుకొని మనస్సును శాంతిపరచుకొన్నట్లైతే మనలోఉండే మానవహృదయము సిగ్గుపడుతుంది. కాని చిక్కులతోకూడుకొనిఉన్న 'లా', మరల మమ్మైన స్త్రీమరూ,—ఈ రెండూ కలిసి శశిభూషణకు స్త్రీమనుమే నేజరు దొరకకుండా చేసినవి. దానివల్ల ప్రపంచానికి ఏమైనా ఉపకారము కలిగిందో కలగలేదో తెలియదుగాని శశిబాబుగారిలో ఉన్న భారతవర్షీయప్లీహము చిదగిపోవడము మాత్రము తప్పింది.

పడవవాళ్లనూ, కళాసులనూ తీసికొని శశిభూషణ్ స్వగ్రామానికి తిరిగి వచ్చాడు. మునిగిపోయిన పడవలో నారబేళ్లు ఉన్నవి. ఆబేళ్లు తీయడానికి మనుష్యులను ఏర్పాటుచేసి మేనేజరుమీద పోలీసుకేసు పెట్టమని శశిభూషణ్ పడవవాళ్లను ప్రార్థించాడు.

పడవవాళ్లు ఎంతకూ ఒప్పుకోలేదు, "పడవేమో మునిగిపోయింది. ఇక మేముకూడా మునిగిపోవడ మెందుకుబాబూ?" అన్నారు. "మొట్టమొదట పోలీసువాళ్లకు దక్షిణ ఇచ్చుకోవాలి, తరువాత పనిపాట్లూ, నిద్రాహారాలూ వదులుకొని ఒక కోర్టునుంచి ఇంకొక కోర్టుకు తిరుగుతూఉండాలి; చివరకు ఎటువంటిచిక్కుల్లో పడాలో, దానివల్ల ఏమిలాభము పొంద

గలమో అది భగవంతుడికే తెలియాలి," అని అన్నారు; కాని తరువాత శశిభూషణే వకీలుఅనీ, దావాఖర్చులన్నీ అతనే పెడతాడనీ పడవవాళ్లకు తెలిసింది. కేసులో గెలవవచ్చుననీ, కలిగిన నష్టానికిగాను కోర్టువారు డబ్బు ఇప్పించవచ్చుననీ, తెలుసుకొని దావా వెయ్యడానికి ఒప్పుకొన్నారు. కాని ఆ స్టీమర్‌లో ఉన్న తన గ్రామస్థులు సాక్ష్యముఇవ్వడానికి ఒప్పుకోలేదు. "మాకు ఏదీ కనబడలేదండీ," అని అన్నారు కొందరు. "మేము వెనకపక్కను కూర్చున్నామండీ, ఇంజనుగడగడలోనూ, ఆ కెరటాల చప్పుడులోనూ, తుపాకీశబ్దము వినబడదండీ!" అన్నారు కొందరు.

మనదేశస్థులను తనలోతాను తృణీకరిస్తూ మాజిస్ట్రేట్ కోర్టులో కేసు నడిపాడు శశిభూషణ్.

సాక్షులఅవసరము లేకపోయింది. తుపాకి పేల్చాననిమేనేజరు ఒప్పుకొన్నాడు. ఆకాశాన ఒకకొంగలబారు ఎగిరివెళుతూ ఉంటే దానిని గురిచేసి కొట్టాడట. స్టీమరు నిండువేగముతో వెళుతున్నది, అప్పుడే నదిమలుపు దగ్గిరపడ్డది, తుపాకిగుండుకి కాకే చచ్చిందో, కొంగే చచ్చిందో, లేక పడవేమునిగిందో, తనకు ఏలా తెలుస్తుంది అన్నారు దొరగారు. భూమి ఆకాశాలను నింపుతూ షికారుచేయదగిన జంతువులు ఇన్ని ఉంటూ ఉండగా, "ఎ డర్టీ ర్యాగ్"—అనగా ఒక మురికి చింకి గుడ్డముక్క-మీద పావలాఖరీదుగల తోటాను, ఎవరూ వృథా వ్యయం చేయరని దొరగారు సెలవుఇచ్చారు.

నిర్దోషి అయిన మేనేజరును ఆనరబుల్ అక్విటల్* చేశారు; దొరగారు సిగరెట్ నోట్లోపెట్టుకొని కోర్టునుంచి క్లబ్బుకువెళ్లి పేకఆడుతూ కూర్చున్నారు. నావలో మసాలా నూరుతూ మునిగిపోయి కనబడనివాడి కళేబరము అక్కడికి తొమ్మిది మైళ్లదూరము వెళ్ళి గట్టుచేరుకొన్నది. శశిభూషణ్ హృదయములో మంట పుట్టింది, స్వగ్రామము తిరిగి వచ్చేశాడు.

శశిభూషణ్ గ్రామానికి తిరిగి వచ్చిననాడే గిరిబాలను చక్కగా అలంకిరించిన పడవమీద ఎక్కించి అత్తవారింటికి తీసుకువెళ్లుతున్నారు. ఎవరు అతనిని పిలవకపోయినప్పటికీ అతను నదిఒడ్డుకు వచ్చి నిలుచున్నాడు. రేవునిండా జనము ఉన్నారు. శశి ఆ జనసమ్మర్దములోకి వెళ్లలేదు, కొంచెము ముందుకు వెళ్ళి నదిఒడ్డునే నిలుచున్నాడు. నావ రేవు విడిచి పెట్టింది, శశిభూషణ్ ముందరినుండే వెళ్లిపోయింది. ముసుగు వేసుకొని లోపున కూర్చున్న నవవధువు మెరుపువలె అతని కంటపడి ఒక్కక్షణములో మాయమయిపోయింది. గ్రామము విడిచి వెళ్లిపోయేలోగా ఏలాగైనా శశిభూషణుని ఒకమారు చూడవలెనని అనేక దినాలనుండి గిరిబాల చాలా ఆశిస్తుండెను, గాని గురువుగారు ఈనాడు అంతదగ్గిరగా నదిఒడ్డున నిలబడి తనకోసము చూస్తూన్నారని ఆమెకు తెలియనైనా తెలియలేదు. గిరిబాల ఒక్కమారైనా తలఎత్తలేదు

* విడుదల.

నిశ్శబ్దరోదన రెండుకళ్లనూ నీళ్లతో నింపింది, కన్నీరుచెక్కిళ్ల వెంట బొటబొట కారుతున్నవి.

నావ క్రమంగా దూరమయి అదృశ్యమయి పోయింది. ప్రాతఃకాలపు సూర్యకిరణాలుపడి నీళ్లు తళుకు తళుకు మంటున్నవి. దగ్గరనే ఒక మామిడికొమ్మమీద కంఠముఎత్తి పక్షి పాడుతున్నది, ఎంతపాడినా దాని మనోవేగము కొంచెమయినా తగ్గకుండా ఉన్నది. రేవులో బల్లకట్టు మనుష్యులను ఎక్కించుకొని ఇవతలికీ అవతలికీ నడుస్తున్నది. గ్రామములోని ఆడవాళ్లు నీళ్లకు రేవుదగ్గరికివచ్చి పెద్దగొంతుకలతో గిరిబాల అత్తవారి ఇంటికి వెళ్లడాన్నిగురించి వాదనలుచేసుకొంటున్నారు. శశిభూషణ్ సులోచనాలు తీసి కళ్లు తుడుచుకొంటూ ఆ రోడ్డుపక్కనున్న, గజాలగదిలో ప్రవేశించాడు. అకస్మాత్తుగా "శశి-దా" అంటూ గిరిబాల గొంతుక వినబడ్డట్టు అయింది. ఎక్కడే అమ్మా, ఎక్కడ!—ఎక్కడా లేదు! ఆపిలుపు ఆ ఇంట్లోకాదు! ఆ దారిలో కాదు! అ ఊరిలో కాదు! తన అశ్రుజలాభిషిక్తమయిన హృదయ మధ్యమందు కాబోలు!

8

శశిభూషణ్ తిరిగి మూటాముల్లె కట్టి కలకత్తా ప్రయాణానికి సిద్ధమవుతున్నాడు. కలకత్తాలో అతనికి ఏమీ పని లేదు.

వెళ్లడములో విశేషఉద్దేశమేమీ లేదు. అందుచేత రైలుమీదను వెళ్లడానికి బదులుగా నదీప్రయాణముచేసుకొంటూ వెళ్లుదామని నిశ్చయించాడు.

వర్షాలధికమయి, చిన్నా పెద్దా లెక్కలేనన్ని నీటికాలువలు ఏర్పడ్డవి; అవి దేశమంతా ఆవరించిఉన్న జలజాలమువలె కనబడుతున్నవి. 'సరస శ్యామల భారతవర్షము' యొక్క సిరోపసిరాలు నిండి ఉన్నవి. ఎటుచూచినా చెట్లు, లతలు, పచ్చని గడ్డి చేలనిండా వరి, నార, చెరకు. ఉన్మత్తయౌవనము విచ్చలవిడిగా పరుగెత్తుతున్నది.

అన్నివైపులా ఇటువంటివాటితో నిండిఉన్న ప్రదేశము మధ్యనుండి యాత్రచేస్తున్నది శశిభూషణుని నావ. నీరు గట్లతో సమానముగా పారుతున్నది. తుంగా, రెల్లూ నీటిలో మునిగిఉన్నవి. చేలనిండా నీరు. ఊళ్లలోని ఇళ్లవెలుగులూ, వెదురుపొదలూ, మామిడితోటలూ నీటికి ఈఒడ్డునా, ఆ ఒడ్డునా కనబడుతున్నవి. దేవకన్యకలువచ్చి చెట్లమధ్యనున్న స్థలాలను నీటితో నింపివేశారా అనిపిస్తున్నది.

దుర్గపూజరోజులు. సూర్యకిరణాలుపడి వనశ్రీ నవ్వుతున్నది. ఒక్కఘడియలో మేఘముచేసి వర్షము ఆరంభము అయింది. వర్షము పడుతున్నవైపు గాఢముగానూ, అతిగంభీరముగానూ కనబడుతున్నది. వర్షాకాలమప్పుడు పశువులు నీళ్లతోనూ బురదతోనూ నిండిఉన్నసాలలలో నిలబడి మీదనుంచి వర్షధారలుపడుతూంటే ఓర్చి మనవైపు చూస్తూ జాలి

పుట్టిస్తూ ఉంటవి. ఆలాగునే మన దేశముకూడా బురదతోనూ నీళ్లతోనూ నిండి, దట్టముగా అన్నివైపులా వ్యాపించిఉన్న చెట్లమధ్యనూ, అడవులమధ్యనూ తడుస్తూ ఓర్పుతో కూర్చొని దుఃఖిస్తూఉన్న ఒకమూగజీవివలె కనబడుతున్నది. వ్యవసాయదారులు తాటాకుగొడుగులు తలకుకట్టుకొని ఇళ్లల్లో నుంచి పైకి వస్తున్నారు. ఆడవాళ్లు వర్షములో తడుసుకొంటూ, చలిగాలివీస్తూఉండడంచేత ఒళ్లుముడుచుకొని, ఏదో అవసరమైనపనిమీద ఒకఇంటినుండి మరిఒకఇంటికి వెళ్లుతున్నారు, రాత్రిముసురుగా ఉండడముచేత, బురదలో కాళ్లుజారకుండా అతిజాగ్రతగా అడుగులు వేసుకొంటూ, బిందెలతో నీళ్లు తీసుకువెళ్లుతున్నారు. పనిలేని ముసలివాళ్లు అరుగులమీద కూర్చొని గుడుగుడు పీలుస్తున్నారు. పనికివెళ్లక వీలులేనన్న వాళ్లు గావంచాలు నడుములకుకట్టికొని చేతులలో జోళ్లుపట్టుకొని, తలలకు గొడుగులు కట్టుకొని బయలుదేరుతున్నారు— ఎండలోమాడుతూ, వర్షములో తడుస్తూ ఉన్న ఈ పవిత్ర హిందూమహాదేశములో స్త్రీలుగొడుగులు వేసుకోవడము సనాతనధర్మానికి విరుద్ధముకదా!

వర్షము ఎంతకూ తగ్గడములేదు, పడవ నిలిచిపోయింది. ఎటూ కదలకుండా అందులో కూర్చొని ఉండడము శశిభూషణునకు కష్టంగా ఉన్నది. పడవ ఇక వదిలి రైలుదారిని వెళ్లిపోదామని శశి నిశ్చయము చేసుకొన్నాడు. అక్కడికి దగ్గరగా విశాలమైన జాగా ఒకటి కనపడుతున్నది, పక్కనుండి చిన్న

ప్రవాహము ఒకటి వచ్చి నదిలో పడుతున్నది గాబోలు. ఆ దగ్గరకు తననావను గడిపించి శశిభూషణ్ వంట ప్రయత్నము ఆరంభించాడు.

కుంటివాడికాలు ఎప్పుడూ రోడ్డుమీద నున్న గోతులోనే పడుతూఉంటుంది. ఇది కేవలము గోతి దోషమేకాదు, కుంటివాడికాలుదికూడానూ. ఆనాడు దీనికి నిదర్శనముగా ఒక ఘటన జరిగింది.

రెండునదులు కలిసేచోట జాలారివాళ్లు వెదుళ్లుపాతి ఒకపెద్దవల వన్నారు. ఒకపక్కకు మాత్రము పడవలు వచ్చిపోవడానికి స్థలము వదిలారు, చాలాకాలముబట్టి వాళ్లు ఈలాగు చేస్తున్నారు. దానికిగాను సర్కారుకు పన్నుకూడా చెల్లిస్తున్నారు. వాళ్లఅదృష్టదోషంవల్ల ఈసంవత్సరము ఆదారిని జిల్లాపోలీసు సూపరెంటుబహదూరువారిశుభాగమనము జరగడము తటస్థించింది. వారి బోటు రావడము చూచి జాలారులు ముందుగానే దూరమునుంచి పక్కనున్న దారిచూపించి కేకలువేసి బోటు జాగ్రత్తగా గడపుకు రమ్మని కోరారు. కాని మనుష్యులు నిర్మించిన అడ్డను మన్నించి చుట్టుతిరిగిపోవడము దొరలబోటువాళ్లకు అభ్యాసములేదు. ఆ వలమీద నుంచి బోటు గడుపుకొని వచ్చారు. జాలారులు వల కిందికి దించి బోటును పోనిచ్చారు, కాని చివరకు ఏలాగో చుక్కాను వలలో తగులుకొన్నది. ఆ చిక్కులోనుంచి దానిని తప్పించ

డానికి కొంచెము తంటాలుపడవలసివచ్చింది, కొంచెము సమ యం పట్టింది.

పోలీసుదొరవారిమనస్సులో కోపజ్వాలలు పుట్టినవి, ముఖము ఎర్రచేసి బోటును ఆపించాడు. దొరగారి మూర్తిని చూచి జాలారులు పరుగెత్తారు. వలనుకోసి ముక్కలు చేసేయమని దొరగారి ఆజ్ఞఅయింది, దొరగారికళాసులు వెళ్లి ఆ ఏడెనిమిదివందల రూపాయిలవలను ముక్కముక్కలుచేసి పారేశారు.

జాలారులమీాద బాగా కసితీర్చుకోవడమయినతరువాత ఆ జాలారివాళ్ళను పట్టి తీసుకురమ్మని దొరగారు ఆజ్ఞాపించారు. పారిపోతున్న జాలారులను ఆ కనిస్టేబులు పట్టుకోలేకపోయి, చేతికి దొరికిన నలుగురుమనుష్యులను తీసుకొనివచ్చి దొరగారి ఎదుట నిలబెట్టారు. వాళ్లు చేతులు జోడించి తాము నిరప రాధులమని మనవిచేసుకొన్నారు. వాళ్ళను పడవలో కట్టి పెట్టిఉంచి తనతో పడవలోనే తీసుకురావలసిందని దొరవారి ఆజ్ఞఅయింది. ఆ సమయములో సులోచనాలుపెట్టుకొన్న ఆ శశిభూషణ్ చొక్కాఒకటి తొడుగుకొని, గుండీలైనా పెట్టుకోకుండా, ధబ్ ధబ్ మని చప్పుడుచేసుకొంటూ స్లిప్పర్లతో ఆదగ్గిరికి పరుగెత్తాడు. వణుకుతూ దొరగారితో, "సర్, జాలారివాళ్ళవల ముక్కలుచేయడానికిగాని, ఆ నలుగురు మనుష్యులనూ పట్టుకొని పీడించడానికిగాని తమకు అధికా రము లేదు!" అని అన్నాడు.

జిల్లాసూపరెంటుదొరవారు శశిభూషణ్‌పైని హిందుస్థానీభాషలో బాగా అవమానపరస్తూ ఘూరమైనతిట్టు ఒకటి ప్రయోగించారు. ఆ తిట్టు చెవినిపడీపడడములో శశి గట్టుమీద కొంచెము ఎత్తైన స్థలముచూచి అక్కడనుంచి బోటులోనికి దుమికి, దొరగారి దగ్గిరికివచ్చి అమాంతముగా ఆయనమీద పడ్డాడు; పిచ్చెత్తిన చిన్నపిల్లవాడిలాగు, ఆ దొరగారిని కొట్టడం మొదలుపెట్టాడు.

తరువాత ఏమిజరిగిందో శశిభూషణునకు ఏమీ తెలియదు; తెలివివచ్చేసరికి అతడు పోలీసు స్టేషన్‌లో పడిఉన్నాడు. తరువాత జరిగినసంగతి చెప్పడానికి ఎవరైనా సంకోచించవలసినది—ఆకథవింటే మానవునియెడల మనకుఉండేగౌరవం పోతుంది, విన్నంతమాత్రాన మనదేహాలకు కూడా బాధ కలుగుతుంది.

9

వకీళ్ళనూ బారిస్టర్లనూ పెట్టించి తండ్రి. శశిభూషణుని బైలుమీద విడిపించాడు. తరువాత కేసుకు కావలసిన ఏర్పాట్లు చేయించాడు.

వలనష్టపోయినజాలార్లు శశిభూషణ్ ఉండే పరగణాలోనివాళ్లే, అంతా ఒక్కజమీందారిప్రజలే. చిక్కులలో ఉండేటప్పుడు ఇంతకుముందు వాళ్లు అప్పుడప్పుడు శశిభూషణు దగ్గిరికి సలహాకి వస్తూఉండేవారు. దొరగారుబోటులో

వైదీలుగా ఉంచినవాళ్ళుకూడా శశిభూషణుకు తెలియని వాళ్లు కాదు.

సాక్ష్యము చెప్పమని అడగడానికి శశిభూషణ్ వాళ్లను పిలిపించాడు. వాళ్ళు గాబరాపడ్డారు. "పెళ్లాముబిడ్డలతో సంసారయాత్ర చేయదలచుకొన్నవాళ్లు పోలీసువాళ్లతో దెబ్బలాటపెట్టుకొని, ఎక్కడ సురక్షితముగా ఉండగలరు? ఒక జీవముకంటె హెచ్చు ఎవరికీ లేదు కదా—జరగవలసిన దేదో జరిగేపోయింది, పైగా కోర్టులూ, సాక్షిసమనులూ ఎందుకు? చాలా చిక్కుల్లోకి తీసుకువచ్చి పెట్టేశారు బాబూ," అని అంతా అన్నారు శశిభూషణ్ వైపు చూచి.

బోధపరచేగా పరచేగా చూచినది చూచినట్టుగా సాక్ష్యమివ్వడానికి ఒప్పుకొన్నారు.

ఆ సమయములో హరకుమార్ బాబుగారు దొరలకు సలాముచేయడానికి బెంచికోర్టుకని పట్టణానికి వెళ్లారు. జిల్లా పోలీసు సూపరెంటుగారిదగ్గరకి వెళ్లితే ఆయన నవ్వుతూ— "మీ ప్రజలలో కొంతమంది పోలీసువాళ్లకు విరుద్ధముగా దొంగసాక్ష్యము ఇవ్వడానికి సిద్ధపడుతున్నారని విన్నానండీ!" అన్నారు. "ఏమిటీ, పోలీసువాళ్ళమీద సాక్ష్యమే! అంత సాహసమే ఆ జాతితక్కువగాడిదకొడుకులకు!" అని ఆశ్చర్యపోతున్నట్టుగా అన్నాడు బెంచిమాజిస్ట్రేటు.

వార్తాపత్రికలు చదివినవాళ్లకు తెలిసేఉంటుంది, శశి-భూషణ్ చేసినవాదన కోర్టులో నిలబడలేదు అని.

జేలారివాళ్లు ఒక్కొక్కడు వచ్చి దొరగారు తమ వలను ముక్కలుచేయలేదని సాక్ష్యమిచ్చారు, బోటులోకి ఒక్కొక్కడిని పిలిచి పేరు వ్రాసుకొని, వెళ్లిపొమ్మన్నారని చెప్పారు.

ఇంతటితో సరిపోలేదు. శశిబాబు గ్రామస్థులే నలుగురు కోర్టులో సాక్ష్యమిచ్చారు—ఇదంతా జరుగుతున్నప్పుడు ఒక పెళ్లివాళ్లతో పడవప్రయాణము చేసి వెళుతున్నారట వాళ్లు, ఎటువంటికారణమూ లేనిదే శశిబాబు గబగబ వెళ్లి పోలీసువాళ్ళమీద పడి వాళ్లను తన్నాడని చెప్పారు.

దొరగారు తిట్టగానే అతనిమీద పడి కొట్టాను అని శశిభూషణ్ ఒప్పుకొన్నాడు, గాని దానంతటికీ కారణము ఆవల కోసేయడమూ, తరవాత సూపరెంటుగారు చేసిన దుర్మా-ర్గమూ అని చెప్పాడు.

ఇటువంటి సందర్భములో శశిభూషణ్‌కు శిక్షవిధిస్తే అన్యాయముజరిగినదని ఎవరు అనగలరు? అయినా శిక్ష మాత్రము చాలా అధికమని ఒప్పుకోవాలి. మూడునాలుగు అపరాధాలు అతనిమీద మోపారు కోర్టువారు. ఒకటి, కొట్టడము; రెండు, అనధికారప్రవేశము; మూడు, పోలీసు-వాళ్ళను తమ డ్యూటీచేయనియ్యకుండా అడ్డుపెట్టడము;—

ఈ అన్ని నేరాలలోనూ అతనికి విరుద్ధముగానే సాక్ష్యము వచ్చింది.

తన చిన్న ఇంటిలో తనకు ప్రియమిత్రులైన పుస్తకా లన్నిటినీ వదిలిపెట్టి శశిభూషణ్ అయిదుసంవత్సరాలు జైలులో కాపురముచేయడానికి వెళ్లాడు. తండ్రి అపీలు చేయడానికి ఏర్పాట్లుచేస్తూఉంటే శశిభూషణ్ వద్దన్నాడు— "జైలు మంచిదనిగాని జైలుతలుపులకుబిగించిన ఇనపకమ్ములు మిథ్యఅనిగాని కాదు నే నన్నమాట. కాని బయటను మనకు ఉండే స్వేచ్ఛా, బయటనుండే స్వాతంత్ర్యమూ మనను మోస పుచ్చి ఆపదలో పెట్టేటటువంటివి. పోనీ, బయట ప్రాప్తించే సత్సహవాసముమాట అనుకుంటామా అంటే జైలులోఉండే మిథ్యావాదులసంఖ్యకు మితి ఉన్నది, కృతఘ్నులకు మితి ఉన్నది, పిరికిపందలకు మితిఉన్నది—ఎందుచేతనంటే అక్క డుండే స్థలము బహుస్వల్పము; బయటనుండేస్థలము విస్తారము.

శశిభూషణ్ జైలులోకి వెళ్ళిన కొద్దికాలములోనే అతనితండ్రి కాలముచేశాడు, తనకంటెపెద్దవాళ్లు మరిఎవ్వరూ లేరు. తమ్ముడుఒకడు ఉన్నాడు, చాలాకాలము కిందట సెంట్రల్ ప్రావిన్స్‌కు వెళిపోయినాడు, స్వస్థలానికిరావడము ఎప్పుడోగాని తటస్థించేదికాదు. ఇల్లుకట్టించుకొని అక్కడే ఉండి పోయినాడు. స్వగ్రామములో శశికిఉండే భూమీ పుట్రా. నానారకాలఎత్తులువేసి రివిన్యూసూపరెంటు హరకుమార్ బాబు, తనఅధీనం చేసుకొన్నాడు.

జైలులో తక్కినవాళ్లకంటె శశిభూషణ్ అనేకరెట్లు అధికముగా బాధ అనుభవించవలసివచ్చింది. అయినప్పటికీ అయిదుసంవత్సరాలూ ఎలాగో గడచిపోయినవి.

కృశించిన శరీరముతోనూ, శూన్యహృదయముతోనూ, వర్షాకాలములో ఒకనాటిఉదయము శశిభూషణ్ జైలుగేటు దాటి బయిటికివచ్చి నిలుచున్నాడు. స్వేచ్ఛ దొరికింది నిజమే! అంతేగాని జైలుబయట తనవాడుఅనదగినవారెవరూ లేరు, తనది అనదగిన దేదీ లేదు——ఇల్లు లేదు, బంధువులు లేరు, మిత్రులు లేరు, సంఘము లేదు——అటువంటి ఏకాకిఅయిన శశిభూషణ్‌కు 'ఇంత పెద్దప్రపంచాన్ని ఏమి చేసుకోను!' అని అనిపించింది.

జీవనయాత్రలో తెగిపోయిన సూత్రాన్ని తిరిగి ఎక్కడ ముడిపెట్టడము అని శశి ఆలోచిస్తున్నసమయములో ఒక పెద్ద జోడుగుర్రాలబండి వచ్చి అతనిఎదుట నిలబడ్డది. నౌకరు ఒకడు బండిదిగివచ్చి, "తమరు శశిభూషణ్ బాబుగారా?" అని అడిగాడు.

"అవును!"

నౌకరు తత్క్షణము బండితలుపు తీసి పట్టుకొన్నాడు, శశిభూషణుబాబును ఎక్కించవలెనని. ఆశ్చర్యపడుతూ, "ఎక్కడికి వెళ్లడానికి?" అని శశిభూషణ్ అడిగాడు.

"మా యజమానురాలు పంపారు మిమ్మల్ని తీసుకు రమ్మని," అని నౌకరు అన్నాడు.

వచ్చీపోయేవాళ్ళు కుతూహలముతో చూస్తూన్నారు, అది సహించడము శశిభూషణుకు కష్టమయి బండిలో ముందు ఎక్కిపోయినాడు, తరువాత 'దీనిలో ఏదో పొరపాటు ఉన్నది సందేహాము లేదు', అని అనుకొన్నాడు. 'కాని! ఎటోఒకవైపు వెళ్ళవలెనుకదా! ఏదోఇటువంటి పొరబాటుమూలముగా నా నూతనజీవితము ప్రారంభమయితే అదిమంచిదే!" అని అనుకొన్నాడు.

ఆ నాడుకూడా ఎండానీడా ఒకదానినొకటి వెంట బెట్టుతున్నవి. రోడ్డుకు రెండుపక్కలాఉండే పొలాలు వర్షపు నీటితో నిండిఉన్నవి. ఆ పచ్చని వరిమీద ఎండానీడా కలిసి పడుతూఉండడమువల్ల ఆ ప్రదేశమంతా అతిమనోహరముగా కనబడుతున్నది. మార్కెట్టుదగ్గర ఒకపెద్దగోథము కనబడు తున్నది, దానికి సమీపములోఉన్న ఒక చిల్లర దుకాణముదగ్గిర వైష్ణవభిక్షువులుకొంతమంది చితారీ, చిడతలూ పట్టుకొని అంతాకలిసి పాడుతున్నారు:

రావోయ్, రావోయ్, రావోయ్ నాథా!
ప్రాణేశ రావోయ్, మిత్రుడారావోయ్!

బండి ముందుకు నడుస్తున్నది. పాట అంతకంతకు దూరమయిపోతున్నది. మాటలు మాత్రము ఇంకా చెవిలో పడుతున్నవి.

సదయుండా రావోయ్, క్రూరుడా రావోయ్!
క్షుదితమై, తృషితమై, తప్తమగు నాదు
  చిత్తములోనికి చొరబడవోయ్!

పాటమాటలు మరీ క్షీణమయిపోతున్నవి, అస్ఫుట మయిపోతున్నవి, ఏమీా తెలియడము లేదు. కాని ఆ పాటా, ఆ వరసా శశిభూషణుమనస్సులో అందోళన పుట్టిస్తున్నవి. ఆపాటను తానే పూర్తిచేసి తనలో తాను పాడడము ప్రారంభించాడు, ఎంత ప్రయత్నము చేసినా పాటను ఆపలేకుండా ఉన్నాడు.

సుకుమార రావోయ్, సుందరా రావోయ్!
సుఖ దుఃఖముల నెల్ల మథియింప బుట్టిన
  వెలలేని మోహ ధనమ వెగ రావోయ్!
నీల మేఘశ్యామ నీ వికను రావోయ్!
చాలా కాలమునుండి నిను బొంద గోరితిని
  నిను కూడబెట్టుకు నుంటి రావోయ్!
చంచలుడా రావోయ్, నిశ్చలుడా రావోయ్,
వంచకుడా రావోయ్, నిత్యుడా రావోయ్,
  వచ్చి నాహృదయములో కూర్చుండవోయ్!
నా నేత్రములలోకి తిరిగి రావోయ్,

నే నిద్రబోతేను నా స్వప్నములలోకి,
నా వసన భూషణములం దుండవోయ్!
లోకమెల్ల నీవు వ్యాపించిరావోయ్,
నా కంటి నీళ్లల్లో, నా నవ్వువెన్నెల్లో,
నాయాటపాటల్లో నిలబడవోయ్!
నా ముద్దు, నా ప్రేమ, నా స్మరణ లన్నింట,
నా మరణ జననముల, నా ధర్మకర్మముల,
అన్నింట నాతోడ నివసింపవోయ్!

బండి పెద్దప్రహారీగోడలు చుట్టూగల చక్కని ఉద్యానములోకి వచ్చి ఒక రెండుఅంతస్తులమేడ ఎదుట నిలబడ్డది. శశిభూషణ్ పాట ఆగిపోయింది.

ఏమీ ప్రశ్నించకుండా నౌకరు కోరినప్రకారము శశిభూషణ్ ఇంట్లోకి వచ్చాడు.

అతను వచ్చి కూర్చున్నగదిలో నాలుగువైపులా పెద్ద పెద్ద అద్దముబీరువాలు ఉన్నవి. వాటినిండా చక్కగా బైండు చేసిన పుస్తకాలు పేర్చిఉన్నవి. అవి చూడగానే అతని పూర్వపుజీవనము కారాగృహావిముక్తమయి తిరిగి బయటికి వచ్చింది. చిత్రవిచిత్రముగా బైండుచేయబడి బంగారు అక్షరాలతో పేర్లు వేసిన ఆ పుస్తకాలు ఆనందలోకముయొక్క రత్నఖచితసింహద్వారమువలె అతనికి కనబడ్డవి.

టేబిలుమీదకూడా ఏవోకొన్నిపుస్తకాలు ఉన్నవి. దృష్టితక్కువ కావడముచేత శశిభూషణ్ బాగా టేబిలు

మీదికి వాలి చూచాడు. ఒక పాత పగిలిపోయిన పలకా, అట్ట వేసి కుట్టిన చింకి కథామాలా, కాశీరామదాసు రచించిన మహా భారతమూ, అక్కడ ఉన్నవి.

పలక కర్రఫ్రేముమీద పెద్దపెద్దఅక్షరాలతో "గిరి బాలాదేవి" అని శశిభూషణుదస్తూరితో వ్రాసిఉన్నది. ఆపుస్తకాలమీదకూడా అతని దస్తూరితోనే ఆపేరే వ్రాసి ఉన్నది.

తాను ఎక్కడఉన్నది శశిభూషణ్ అప్పుడు పోల్చుకున్నాడు. అతని హృదయములో అలలు పుట్టినవి.

తెరిచిఉన్న కిటికీలోనుంచి పైకిచూచాడు. ఏమిటి అతని కంటపడ్డది? ఆ చిన్న ఇనపగజాల గది, ఆ ఎత్తూపల్లాలుగాఉండే పల్లెటూరిరోడ్డు, ఆ డోరియాగీరలపరికిణీ కట్టుకొనిఉన్న చిన్న పిల్ల, ఎవరితోనూ సంబంధములేకుండా నిశ్చలముగా జరుగుతుండే తన జీవనయాత్ర.

ఆ సుఖముగాఉన్నరోజులనాటి కథ అతి సామాన్యమైనది. అందులో గొప్ప అనదగినదివేదీ లేదు. చిన్నపనులు చేసుకొంటూ, సామాన్యసుఖముతోనే సంతోషిస్తూ, రోజు తరువాత రోజు నెమ్మదిగా గడిచిపోతూఉండేవి. దాని అంతటిలో జ్ఞాపక ముంచుకోదగిన దేవీ లేదు. తన చేయపుమధ్యకు వచ్చి దూరిన తన శిష్యురాలి చేదువుకూడా తాను రోజూ చూస్తూఉండేచిన్న పనులలో ఒకటి అని అనుకొనేవాడు

కాని ఆనాడు ఆ చిన్న గ్రామములో అతను చేస్తూఉండిన అజ్ఞాతవాసమూ, ఆ స్వల్పసుఖదుఃఖాలూ, ఆ చిన్న పిల్లయొక్క చిన్న ముఖమూ, నేడు చేతికందనిస్వర్గమయి కనబడుతున్నది. అది దేశ కాలాలను దాటినది, ఆకాంక్షా రాజ్యముయొక్క కల్పనా ఛాయలతో శోభిస్తున్నది. అది ఈనాటి వర్షమువల్ల మందముయి ఉన్న ప్రభాత కాంతితోనూ, మనస్సులో ప్రతిధ్వనిస్తున్న కీర్తన తోనూ, తన చిన్ననాటికథతో కలిసి జ్యోతిర్మయమైనట్టీ, సంగీతమయమైనట్టీ ఒక అపూర్వ రూపము ధరించింది; ముళ్ల తుప్పలమధ్యనుంచి పోతున్న ఆ పల్లెటూరి బురదరోడ్డుమీద నిలుచొని ఉన్నది ఆచిన్నపిల్ల, గిరిబాల; ఆ మెముఖము దుఃఖము వల్లా, అభిమానమువల్లా మ్లానముయి ఉన్నది. ఆ ముఖానికి ఒక ఆశ్చర్యమయిన రూపము ఇచ్చి విధాత ఇతనికి ఇప్పుడు కనపరుస్తున్నాడు. వేదనతో వికాశముపొందిన ఆ దివ్యమైన ఆకారము కళ్ళకుకట్టినట్టుగా శశిభూషణుకు కనబడుతున్నది. దానితోకలసి ఆ కీర్తనస్వరము జ్ఞాపకమువచ్చి అతనిమనస్సు జాలితో నిండుతున్నది. సమస్తవిశ్వమూ తన దుఃఖాన్ని ఆ పల్లెటూరిపిల్లముఖాన కనపరుస్తున్నదా అనిపించింది. శశిభూషణ్ పలకా పుస్తకాలమీద చేతులు వేసి, ముఖము వాల్చుకొని, చాలాసేపు కూర్చున్నాడు; అనేక సంవత్సరాలనాటి కథ స్వప్న రూపముగా అతనికి కనబడుతున్నది.

చాలాసేపయినతరువాత ఏదోచిన్నశబ్దము వినబడి శశి భూషణ్ ఉలికిపడిలేచి, ముఖము ఎత్తి చూచాడు, వెండిపళ్లెరములో పళ్లూఫలహారమూ తెచ్చి ఎదుట గిరిబాల నిలుచున్నది. గిరిబాలఒంటిని ఆభరణాలేవీ లేవు, అంచులేని తెల్లనిబట్ట కట్టుకొన్నది—ఆమె విధవ. శశిభూషణ్ ముఖము ఎత్తగానే అతనికాళ్ళకు సాష్టాంగప్రణామము చేసింది.

గిరిబాల లేచి శశిభూషణుని చూచింది, శశిభూషణ్ కృశించి ఉన్నాడు, రంగు మాడిపోయింది, ముఖము వాడిపోయింది, చూడగానే గిరిబాలకళ్లు నీళ్ళతో నిండిపోయినవి, కన్నీళ్లు చెక్కిళ్ళవెంట కారుతున్నవి.

శశిభూషణ్ కుశలప్రశ్న వేయ ప్రయత్నించాడు, గాని మాటలు తట్టలేదు; కట్టిపెట్టిఉంచిన కన్నీళ్లు మాటలకు అడ్డుపడుతున్నవి. కీర్తనచేస్తున్న ఆ వైష్ణవులజట్టు భిక్షానికి ఆ మేడ దగ్గిరికి వచ్చి నిలుచొని పాటపాడుతున్నారు. ఆ పల్లవి మాట మాటికీ వినబడుతున్నది?—

రావోయ్, రావోయ్, రావోయ్ నాథా!